# బోయి భీమన్న

# రూపకాలు - తాత్త్విక చింతన

(సిద్ధాంత వ్యాస గ్రంథం)

Acc. No. 18395

డా॥ తక్కళ్ళ బాలరాజు,
M.A.Ph.D.,

చైతన్య సాహితి
వరంగల్.

# బోయి భీమన్న రూపకాలు - తాత్త్విక చింతన

(ఈ గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురితం - 
వెలుబుచ్చిన అభిప్రాయాలతో విశ్వవిద్యాలయానికి ఎలాంటి సంబంధ

ప్రచురణ సంఖ్య : 10

ప్రథమ ముద్రణ : మార్చి, 1996

ప్రతులు : 1000

894.8131 BAL

హక్కులు : రచయితవి.

వెల : 100/-

ప్రతులకు :

శ్రీమతి టి. కళావతి రాజ్
ఇం.నెం. 3-14-133/1/ఎ (609)
సుభాష్ నగర్ - కొత్తూరు,
హన్మకొండ, జిల్లా వరంగల్.

విశాలాంధ్ర పబ్లిక్ హౌజ్
అన్ని బ్రాంచీలలోను

ముద్రణ :

శ్రీనివాస కంప్యూటర్స్, చౌరస్తా, హన్మకొండ.

# కృతజ్ఞతాంజలి

నాకున్న నాటకానుభవం వల్ల కళపై ఒక సిద్ధాంత వ్యాసం వ్రాయాలన్న జిజ్ఞాస కలిగింది. ఈ విషయం మా గురుదేవులు ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి విన్నవించుకున్నాను. నా కోరిక మన్నించి ఆశీర్వదించారు.

**'బోయి భీమన్న రూపకాలు – తాత్త్విక చింతన'** అంశాన్ని పరిశోధనకు సూచించి నాకు పర్యవేక్షకులుగా వారు వ్యవహరించి ప్రోత్సహించారు. తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాదు ఉప-కులపతులు, పూజ్యులు ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి కృతజ్ఞుడను.

నాకు ఈ పరిశోధనకు అవకాశాన్నిచ్చిన అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు మాన్యులు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య గారికి కృతజ్ఞతలు.

పరిశోధనా కాలంలో ఆశీస్సులతో ప్రోత్సహించిన గౌరవనీయులు ఆచార్య మాదిరాజు రంగారావు, ఛైర్మన్, బోర్డ్ ఆఫ్ స్టడీస్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు, కాకతీయ యూనివర్సిటీ, వరంగల్ గారికి, ఆచార్య హరిశివకుమార్, హెడ్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు, కాకతీయ యూనివర్సిటీ, వరంగల్ గారికి కృతజ్ఞతాభివందనాలు.

పరిశోధనకు ఉపకరించే గ్రంథాలు, ఇతర పుస్తకాలు అందించిన పూజ్యులు కీ.శే. దేవులపల్లి రామానుజరావు గారికి కృతజ్ఞతా స్మృత్యంజలి.

ఈ పరిశోధనా వ్యాసాన్ని రూపొందించుటలో తగిన సలహా సహాకారాలను అందించిన డా. పి.వి. రమణ గారికి, డా. ఐ. కిషన్ రావు గారికీ –

విషయ సేకరణలో భాగంగా ప్రశ్నావళి ద్వారా సమాచారాన్ని అందించిన ఆచార్య యల్. చక్రధర రావు, ఆంధ్ర యూనివర్సిటీ, విశాఖ పట్టణం గారికీ– శ్రీ ఆవంత్స సోమసుందర్ కవి గారికీ– డా. జె. బాపురెడ్డి గారికీ– శ్రీమతి హైమవతి భీమన్న గారికీ–

ఈ సిద్ధాంత వ్యాసానికి చక్కని వ్రాత ప్రతిని సమకూర్చిన స్నేహ శీలి శ్రీ బొల్లి రామలింగం, సీనియల్ అసిస్టెంటు, రెవిన్యూ శాఖ వరంగల్ గారికీ–

ముఖ్యంగా పరిశోధన చేయుటకు అనుమతించిన మా సంచాలకులు, రాష్ట్ర ట్రెజరీస్ మరియు అకౌంట్సు శాఖ, హైదరాబాదు గారికీ,

నా పరిశోధనలో నాకు సహాయ పడిన శ్రేయోభిలాషులు డా. ఎ. నాగేశ్వర్ రావు గారికి, అర్థికంగా సహకరించిన మిత్రులు శ్రీ సి. హెచ్. మదన్ మోహన్ రావు, శ్రీ పి. మత్తాయ్, శ్రీ జె. వెంకటేశ్వర్లు, శ్రీ ఆర్. సుధాకర్ శ్రీ పి. వీరస్వామి మరియు పరోక్షంగా సహాయపడిన స్నేహితులకు , శ్రేయోభిలాషులకు అందరికీ నా కృతజ్ఞతా పూర్వక అభివందనాలు.

– డా. తక్కళ్ళ బాలరాజు

# పరిశోధనకు గ్రహించిన
# బోయి భీమన్న రూపకాలు

| | | | |
|---|---|---|---|
| 1. | పాలేరు | : | (1940) |
| 2. | కూలిరాజా | : | (1947) |
| 3 | అసూయ | : | (1954) |
| 4. | పడిపోతున్న అడ్డుగోడలు | : | (1958) |
| 5. | మానవుని మరొక మజిలీ | : | (1958) |
| 6. | పైరుపాట | : | (1959) |
| 7. | రాగవాసిష్ఠం | : | (1959) |
| 8 | చిత్ర కళా ప్రదర్శనం | : | (1963) |
| 9 | బాలయోగి | : | (1964) |
| 10 | ఆది కవి వాల్మీకి | : | (1970) |
| 11. | ప్రగతి | : | (1979) |

# అనుక్రమణిక

శా. కేలన్ గేల్, పయిటన్ బయింట గొని, సం
కీర్ణ ప్రలాపాను హా
స్యా లాపంబుల, ముద్దు నవ్వుల, విలా
సార్థంబ యేతెంచుచున్
లీలా మానుష గాన మాధురికి హా
ళిన్ దూలి, మోహార్తులై
బాలల్ వేలుగ గూడిరందు, ధవళం
బై జ్యోత్స్న లాలింపగన్!

(బోయి భీమన్న సాహిత్య జీవితానికి నాంది ఆ పద్యము)

# భూమిక

'పరోపకారార్థం ఫలంతి వృక్షాః' అన్నట్లుగానే మానవ జీవన ప్రశాంతి మనుగడ కోసం తన సాహిత్యాన్నే మార్గదర్శనం చేయించిన మహా మానవతా మూర్తి బోయి భీమన్న .

భారతీయ సాంస్కృతిక జీవన ప్రాచీన విలువల ఔన్నత్యాన్ని సందర్శించిన మహాద్రష్ట భీమన్న. తన సాహిత్యం భవిష్యత్తు సమాజ వికాస పరిణామానికి భూమికగ పరిణమిస్తుందన్న విశ్వాసంతో కలాన్ని కదను త్రొక్కించినాడు. మానవ కల్పిత కుల పరిధిలో డాంభిక మత వివాదాల నిబంధనలలో ఒదిగిపోని విశ్వమానవతావాది భీమన్న.

మానవ జాతి అభ్యుదయం కోసం సహోదర భావంతో నిండిన సహృదయ సమాజం కోసం జీవితాంతం ఒక ఉద్యమ స్ఫూర్తితో సాహిత్య కృషి కొనసాగించిన భీమన్నది సమిష్టి దృక్పథమే కాని వ్యష్టి దృక్పథం కానే కాదు. అటువంటప్పుడు సమస్త మానవ వికాసమే భీమన్న ప్రధాన దృక్పథంగా మనం గమనిస్తాం.

జీవధారలతో భారతీయ సమాజాన్ని సుభిక్షం , సుసంపన్నం చేస్తూ వస్తున్న గంగా , యమున , సరస్వతి నదుల సంగమ కేంద్రంలానే భీమన్న సహృదయం కూడ పైన పేర్కొన్న త్రివిధ దృక్పథాలతో జాలు వారే ఒక మానవతా జలపాతం.

బోయి భీమన్నది కవి వాక్కే కాక ఋషి రుక్కు కూడ. మహా ఋషులు సర్వకాల సర్వజనుల సుఖశాంతి జీవనం కోసం రుక్కులు ఆలపించినట్టే భీమన్న కూడ కేవలం కల్పనా చమత్కృతీ, శిల్ప సౌందర్య ద్రష్టలతోనే తన కవిత్వానికి ప్రాణం పోయక నిఖిల మానవాళి అభ్యుదయం కోసం అంకితమైన సార్థక వ్యక్తిగా మనం సంభావించుకోవాలి.

ఇకపోతే ' **బోయి భీమన్న రూపకాలు – తాత్త్విక చింతన** ' అనే అంశంపై రూపొందించిన ఈ సిద్ధాంత వ్యాసం కేవలం భీమన్న రూపకాలలోని తాత్త్విక చింతన పరిశీలనాన్నే లక్ష్యంగా చేసుకొని సాగింది. ఈ దృష్ట్యా ఈ సిద్ధాంత వ్యాసం తాత్త్విక చింతన వరకే పరిమితమైంది. పరిశోధన ప్రణాళికను బట్టి ఈ సిద్ధాంత వ్యాసాన్ని మూడు ప్రకరణలుగా విభజించడం జరిగింది.

**మొదటి ప్రకరణం :** ' భీమన్న సాహిత్య జీవితం ' అనే ఈ అధ్యాయంలో 1. పరిచయం, 2. బాల్యము , 3. విద్యాభ్యాసము , 4. భీమన్నపై నాటి పరిస్థితుల, వ్యక్తుల ప్రభావం , 5. రచయితగా బోయి భీమన్న , 6. భీమన్న నిర్వహించిన పదవులు , 7. భీమన్న వ్యక్తిత్వం , 8. భీమన్నకు జరిగిన సన్మానాలు , 9. భీమన్న పొందిన బిరుదులు , 10. భీమన్నను గురించి పలువురి ప్రశంసలు, 11. భీమన్న పొందిన అంకితాలు , 12. భీమన్న రచనలు మున్నగు వాటిని వివరించడం జరిగింది.

వారి జీవన విధానం వల్ల సమకాలీన సామాజిక వ్యవస్థ , దాని తీరు తెన్నులు రాజకీయ , ఆర్థిక , సామాజిక నేపథ్యం దీనిలో విశ్లేషించాను.

**రెండవ ప్రకరణం :** 'సాహిత్యవైవిధ్య స్వరూపం' అనే ఈ అధ్యాయంలో 1. భీమన్న రూపకాలు – పరిశీలన, 2. భీమన్న వస్తువైవిధ్యం, 3. భీమన్న శైలి విన్యాసం, 4. భీమన్న పాత్ర చిత్రణ, 5. భీమన్న సాహిత్య రస పోషణ,

6. భీమన్న శిల్ప వైభవం, 7. భీమన్న సాహిత్య తత్త్వం, 8. భీమన్న సామాజిక దృక్పథం, 9. ఉప సంహారం మొదలైనవి విశ్లేషించడం జరిగింది.

**మూడవ ప్రకరణం :** 'అనుబంధాలు' అనే ఈ అధ్యాయంలో 1. ఇతరులు భీమన్న గురించి, 2. బోయి భీమన్నతో ఇంటర్వ్యూ, 3. ఉపయుక్త గ్రంథాలు మొదలగునవి పేర్కొనడం జరిగింది.

ఇందులో ముఖ్యంగా వివరించినది భీమన్న రూపకాలలోని తత్త్వం. అదేమిటంటే, సత్యాన్వేషణ భీమన్న లక్ష్యం. అందుకు అతని సాహిత్య మార్గంలో భీమన్న దృష్టి క్రమ పరిణామం చెందుతూనే వచ్చింది.

తెలుగువారు కళాప్రియులు. నాటి నుంచి నేటి వరకు సంగీత సాహిత్యాలలో కళాకారులు తమ ప్రతిభ పాటవాలను ప్రదర్శిస్తూ ప్రపంచమంతట మన్ననలను పొందుచున్నారు. తెలుగు కళా వైభవాన్ని ప్రదర్శించటమే లక్ష్యంగా బోయి భీమన్న రూపకాలను రచించాడు. ప్రజల్ని ప్రభావితుల్ని చేయగలిగేది నాటక సాహిత్యమే. కనుక నాటక కర్త అయిన తాను తన కలాన్ని కాగడాలాగా ఉపయోగించి క్షీణ విలువలకు దిగజారిపోయిన ఈ చీకటి వ్యవస్థకు వెలుగు బాటలు చూపాడు. అయినా భారతీయ సాంప్రదాయం నానాటికి దిగజారిపోతున్నది. పాశ్చాత్య నాగరికతను నేటి తరం ఆహ్వానిస్తున్నది. రచయితలు, మేధావులు స్వయంగా ఆలోచించి మన సాంప్రదాయం చెడ కుండ నవ కల్పనలకు దారితీయగల స్థాయికి ఎదగాలని కోరుచున్నాడు భీమన్న.

నేను బోయి భీమన్న గారి తత్త్వ చింతన గూర్చి కొందరు పెద్దలను కలుసుకొని ప్రశ్నించడం జరిగింది. వాళ్ళ నుండి విన్నవి, నాకు లభ్యమైన గ్రంథాలలో , పత్రికలలో నేను కన్నవి జోడించి ఈ పరిశోధనా వ్యాసాన్ని రూపొందించుట జరిగింది. ఇది భీమన్న రూపకాలపై సమగ్ర పరిశోధన

కాకపోయినప్పటికి వారి సాహిత్య జీవిత విశేషాలు, వారి తాత్త్విక చింతన వ్యాసంగంలో ఒక భాగమైన రూపకాల ఆధారంగా మలిచి రూపొందించిన సిద్ధాంత వ్యాసంగా భావించగలరని నా అభిలాష.

నా ఈ శాస్త్ర గ్రంథాన్ని అభిమానించి ఆదరిస్తారని, సహృదయులు ఇచ్చే నిర్మాణాత్మకమైన సూచనలను పునర్ముద్రణలో సవరించుకోగలనని మనవి చేస్తున్నాను.

–డా॥ తక్కళ్ళ బాలరాజు.

# పరిచయం

**'' మధు మయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః ''** [1]

**అన్న సుకవి సూక్తికి ఉజ్జ్వలమైన ఉదాహరణం బోయి భీమన్న.**

బోయి భీమన్న గారు సాహితీ లోకానికే కాక యావత్ భారత దేశానికి ద్మశ్రీ భీమన్నగా ఉత్తమ కవిగా సుపరిచితులు.

తెలుగు జాతిలో నేటి మేధావి వర్గంలో ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం కలవారు. పండితులుగా, రచయితగా తన పత్యేకతను నిలుపుకొన్న వారు కవి బోయి భీమన్న అన్న పేరు ఉంది.

1940 నుండి 1945 వరకు ఉపాధ్యాలుగాను 1950 నుండి 1955 వరకు '' ఆంధ్ర ప్రభ '' పత్రిక యొక్క సబ్ ఎడిటర్ గాను పని చేశారు.

ప్రస్తుతం బోయి భీమన్న హైద్రాబాద్‌లోని స్వగృహము నందు విశ్రాంతి తీసుకొనుచున్నారు. సమాజ శ్రేయస్సు కోరి ఇంకా రచనలు చేస్తున్నారు. నేటికి వారి వయస్సు 84 సంవత్సరములు దాటి 85 లో పయనించుచున్నది.

స్వాతంత్ర్య పోరాట కాలంలో వారు పొందిన సాంఘిక రాజకీయ ఆర్థిక అనుభవాలు అనేకం. [2]

బోయి భీమన్న ఉత్తమ నాటక రచయిత. వారి ''పాలేరు'' , ''కూలిరాజు'', ప్రసిద్ధమైన రూపకాలు. ఇంకా అతడు గొప్ప విమర్శకుడు

---

1 భాగవత వైజయంతిక (వ్యాస సముచ్చయము) సంపాదకుడు- కరుణశ్రీ పే.సం. 2. భీమన్నతో

గేయ రచయిత, ఉత్తమకవి, తాత్త్వికుడు, సోషలిస్టు, హేతువాది వీటన్నిటినీమించి మానవతా వాది. తన మాతృ భాష అయిన తెలుగులోనే కాక ఆంగ్లములో కూడ కవితలు రాసారు. [1]

ఉదా!! The Seventh Season (Poetry Book)

ది సెవంత్ సీజన్ (కవితా సంపుటి)

**" లేదు నాకు వ్యుత్పన్నత, వేదచయము**
**ఉపనిషత్తులు వాని శాఖోపశాఖ**
**లేమి బోధించునో ఇంతయే నెరుంగ**
**చదువులే లేని నాకు ప్రాజదువులేడ " [2]**

" నేను కానిది సమస్తం నాదే " అంటూ విశ్వాన్నే తన ఆలింగనంలోనికి తీసుకోన్నారు భీమన్న.

**" నా సుఖాలూ , సంతోషాలూ , గౌరవాలూ**
**సమస్తమూ సర్వవతీ ప్రీత్యర్థం**
**నా కష్టాలూ , నష్టాలూ , దురదృష్టాలూ**
**అన్నీ శివార్పణం " [3]**

– అంటూ తన సర్వస్వాన్నీ శివ సరస్వతులకు వదిలేసి తాను కేవలం నిస్సంగిలా నిలిచి పోయిన రసాద్వైతా చార్యుడు భీమన్న.

1. భీమన్న సాహితీ షష్టి పూర్తి సంచిక ౧౯౮౩ పే. నెం. ౧౬ (2). "పాలేరు నుండి పద్మశ్రీ

# బాల్యము

తూర్పు గోదావరి , కోనసీమ , మామిడి కుదురు గ్రామములో 1911 సెప్టెంబరు 19 న బోయి పల్లయ్య , నాగమ్మ దంపతులకు బోయి భీమన్న జన్మించాడు. ఇతని తల్లితండ్రులు సనాతన ధర్మాకుటుంభికులు ఆదిబ్రాహ్మణ సంతతి వారు.

భీమన్న తండ్రి పల్లయ్య గారు అద్వైతి. వేదం తెలిసిన వారు. పల్లయ్య గారు సీతారామయ్య గారి వద్ద పాలేరుగా ఉండేవారు..సీతారామయ్య గారు కుల భేదాలు లేని వారు. అందు వలన పల్లయ్య గారు భాగవతంలోని పద్యాలు సీతారామయ్య గారి వద్దనే నేర్చుకున్నారు. ఆ విజ్ఞానంతో జ్ఞానిగా పేరు పొందారు. వారికి ఉభయ గోదావరులతో శిశ్యులుండేవారు. శిశ్యుల గ్రామాలలో వేదాంత గోష్టులు చేసేవారు. భీమన్న తల్లి నాగమ్మ గారు జానపద గాయని, పొలం పనిలో ఉన్నప్పుడు పొలం పాటలు, పిల్లవాన్ని నిద్రపుచేటప్పుడు ఊయల పాటలు మరియు తుమ్మెద పాటలు పాడేది. దళితులలోను పల్లె జనులలోను పల్లయ్య నాగమ్మలు గౌరవ మర్యాదలు పొందెడి వారు.

భారత దేశంలోని ప్రధాన సౌందర్య కేంద్రాలలో కోనసీమ ఒకటి. కోనసీమ భూలోక స్వర్గం గాను, మామిడి కుదురు ఒక మందార వనం గాను భీమన్న తన రచనల్లో అభివర్ణించారు. ఇతని బాల్యం ఈ సీమలో గడించింది. చిన్నప్పుడు భీమన్నకున్నంత భయం మరెవరికి లేదనవచ్చు. మెరుపంటే భయం, ఉరుమంటే భయం, వాన చినుకు మీద పడినా వాన వెలిసే వరకు ఏడుస్తూనే కూర్చుండేవాడు.

గ్రామీణ జీవనం , అచ్చటి వ్యక్తులు అక్కడి అనుభవాలు , జ్ఞాపకాలు భీమన్న రచనలన్నింటిలోను చోటు చేసుకున్నాయి. వేమన్న లాగే భీమన్న సహజ కవి. సంపూర్ణ సాహిత్యం అతనిది. పూర్ణ పురుషుడతను. ఆదిబ్రాహ్మడతను.

ప్రకృతిలోని సహజ సౌందర్యమంతా అలంకరించిన కోనసీమలో ప్రకృతి పురుషుల్లాంటి తల్లిదండ్రుల సన్నిధిలో బాల్యంగడిపాడు భీమన్న. తన బాల్యంలో పొందిన అనుభూతులు, సంఘటనలు రూపకాలన్నింటిలోను కనిపిస్తాయి.

ఒక చోట భీమన్న ఇలా అంటారు.

**" నగ్న సత్యం వేదాంతం**
**అలంకృత సత్యం కవిత్వం "[1].**

బోయి భీమన్న సాహితీ షష్ఠి పూర్తి సంచిక పే.నెం. 20

# విద్యాభ్యాసము

1920 లో తొమ్మిదేళ్ళ వయస్సున పాఠశాల యందు బోయి భీమన్న చేరాడు.

5వ తరగతి లోనే తొలి రచన చేసాడు. అది వారి సాహితీ జీవితానికి నాంది అయింది.

ఆ పద్యం–

**శా॥ కేలన్ గేల్, పయిటన్ బయంటగొని,**
**సంకీర్ణ ప్రలాపాను హా**
**స్యాలాపంబుల, ముద్దు నవ్వుల, విలా**
**సార్థంబ యేతెంచు చున్.**
**లీలా మానుష గాన మాధురికి హా**
**ళిన్ దూలి, మోహార్తులై**
**బాలల్ వేలుగ గూడి రందు , ధవళం**
**జై జోత్స్న లాలింపగన్.** [1]

ఒక వైపు పాఠం జరుగుతూ వుంటే క్లాస్ లోనే తొలి రచన చేసాడు.1923 లో మిడిల్ స్కూల్లో చేరాడు భీమన్న. తాను థర్డ్ పాఠం చదువుచున్న సమయంలోనే భారతం పద్దెనిమిది పర్వాలూ, భాగవతమూ పూర్తిగా చదివేయగలిగాడు. 1935లో పి.ఆర్. కాలేజి కాకినాడ నుండి గ్రాడ్యుయేషన్ పూర్తి చేసాడు.

1 ''పాలేరు నుండి పద్మశ్రీ వరకు'' అన్న గ్రంథం లోని పే.నెం. 31 లోని [illegible]
[illegible]

బోయి భీమన్న పేదగా పుట్టి పేదగా పెరిగినా పేదగా బ్రతికిన వాడు కాదు. కష్టాలూ, బాధలు ఎన్నో అనుభవిస్తూ కూడ నిత్య సంతోషిగా జీవించిన వాడు. అవమానాలను అవతల నెడుతూ అభిమానాలను పదిల పరుచుకుంటూ అగ్రస్థానానికి చేరుకున్నాడు బోయి భీమన్న.

కాకినాడ పిఠాపురం రాజా కాలేజిలో చదివే రోజుల్లో గోరాగారితో స్నేహం ఏర్పడింది. గోరా (గోపరాజు రామచంద్రరావు) గారు నాస్తిక వాదం కలవారు. గోరా తన విద్యార్థులకు నాస్తికత్వాన్ని బోధిస్తే, బ్రహ్మర్షి నాయుడు గారు ఆస్తికతను బోధించే వారు. వీరిద్దరి పట్ల భీమన్నకు గౌరవ భావాలున్నై. ముఖ్యంగా భీమన్నకు సాహిత్య సేవ, సుందర ప్రకృతి ఆరాధన అంటే మక్కువ. విద్యార్థి దశలో వుండగానే భీమన్నపై జాతియోద్యమ ప్రభావం పడింది. ఉద్యమాల్లో పాల్గొంటూనే సాహిత్య కృషికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవాడు.

ఉదా॥ " నా కవితా లక్ష్యం
చీకట్లో బ్రతికే వాళ్ళను మెప్పించడం కాదు
వాళ్ళను తిట్టైనా కొట్టైనా సరే
అక్కడ నుండి లేపడం
అరుణోదయం కేసి తరమడం "[1].

[1] బోయి భీమన్న షష్టిపూర్తి సంచిక పే.నెం. 34

## భీమన్నపై నాటి పరిస్థితుల - వ్యక్తుల ప్రభావం

బోయి భీమన్న పై కోనసీమ పల్లె జీవితం, అద్వైత మతం, హేతువాదం, మానవతా వాదులతో పాటు తల్లిదండ్రుల ప్రభావం కనిపిస్తున్నది.

తూర్పుగోదావరి జిల్లా కోనసీమ గ్రామీణ ప్రజా జీవనం - అప్పటి జ్ఞాపకాలు, వ్యక్తుల ప్రభావం మనకు ''పాలేరు'' నాటకంలో స్పష్టంగా కనిపిస్తాయి. పాలేరుగా ఉంటూ జీవితం గడిపినవారు ఎక్కువ మంది దళితులనియే చెప్పాలి. తన జాతి వారు పొందిన బాధల్ని స్వయంగా చూసాడు. కొంత కాలం పాలేరుగా కూడ పని చేసాడు భీమన్న. తాను అనుభవించిన అనుభవాలు ఆ నాటి పరిస్థితులు అతని రూపకాలతో కనిపిస్తాయి. యాజమాని అఘాయిత్యానికి పాలేరులు అసాహాయతలు కలిగిన సంఘటనలు భీమన్నపై ఎక్కువ ప్రభావం చూపాయి. అందుకు కారణం వారి సాహిత్య దృక్పథం.

ప్రాచీన రచయితలతో కొందరి ప్రభావం భీమన్న రచనా విషయంలో కనిపిస్తున్నది. ముఖ్యంగా వారిపై ప్రభావం చూపిన ప్రాచీన రచయితలు పోతన వేమన ప్రధానమైన వారని చెప్పవచ్చు.

మనది కర్మభూమి. ఆది కాలం నుండి మత మౌఢ్యాలపై, మూఢ నమ్మకాలపై మన దేశస్తులకు నమ్మకం అధికం. ప్రజలెక్కువగా పల్లెల్లో నివసిస్తారు. కాబట్టి చదువుపై వారు అంతగా శ్రద్ధ చూపరు. అందుకే మన దేశంలో నిరక్షరాస్యత చోటు చేసుకుంది. దీని వల్ల ప్రజల్లో ధనిక పేద వర్గ భేదాలు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి.

దేశ పరిస్థితులు, వ్యక్తుల ప్రభావం వీరి రచనలైన రాగవాసిష్టం, కూలిరాజు, పాలేరు, ప్రగతి, పైరు పాట, చిత్ర కళా ప్రదర్శనం, ఆదికవి వాల్మీకి, అసూయ, మానవుని మరొక మజిలి, పడిపోతున్న అడ్డు గోడలు, బాల యోగి మొదలగు వాటిల్లో స్పష్టంగా గోచరిస్తున్నది.

# రచయితగా బోయి భీమన్న

ఆధునిక యుగంలో ఆవిర్భవించిన మహనీయులలో ఒకరైన సాహితీమూర్తి బోయి భీమన్న. అతని ఆచరణ వెనుక నున్న తాత్వికతను పరిశీలిస్తున్నప్పుడు ఈ సారాంశం కనిపిస్తుంది.

ప్రేమ, ఆరాధన, పరమతాత్విక చింతన – వారిరూపకాలన్నింటి లోను అంతర్వాహినిగా ప్రవహిస్తున్నవి.

బోయి భీమన్న సహజ కవి. సహజంగా తాత్త్విక చింతన కల వారు వారి తాత్త్విక చింతన ఏమిటో వారి రూపకాల ద్వారా తెలుస్తున్నది.

నాటక రచయితాగా గొప్ప పేరు గడించిన భీమన్న తెలుగులోనే కాక ఇంగ్లీషులో కూడ రచనలు చేసాడు. వీరి రచనలు పండితులకే గాక పామర జనానికీ అర్థమయ్యే విధంగాను హృదయానికి హత్తుకునే విధంగాను ఉండి ఆలోచింపజేస్తాయి.

భీమన్న బాలహృదయంలో నిక్షిప్తమై ఉన్న పొలాల, తోటల దృశ్యాలను ఊహా మాత్రంగా నైనా గుర్తిస్తేనే తప్ప పాలేరు, పైరు పాట వంటి సుందర కావ్యాలను యథార్థంగా అవగాహన చేసుకోలేం. అందుకని ఈ వివరాలను ఇక్కడ పొందు పరుస్తున్నాను.

గొబ్బి పూవుల తేనె , కోడె గిత్తల చిలిపితనం ఏత్రింత పిట్టల అల్లరి, కంది కాయల రుచి , లేత ముంజెల నీళ్ళు , గంగా బోండాల మీగడ ఈయన రచనల్లోని ఇలాంటి పదాలన్నీ ఆ పొలాల తోటల్లోవే.

భీమన్న జాతీయ భావాలతోను మానవతా వాదంతోను తమ రచనలను సుసంపన్నం చేశాడు. 1922 లో సాహిత్య సేవ ప్రారంభించాడు. అదియే ''పాలేరు'' రూపకం.

ఆయన లక్ష్యం, గమ్యం, ధ్యేయం, కవితారాధనే. ఆయ ప్రతి రచన కూడ మౌలికమైనదే. దాని పుట్టకకు మూలహేతువులు కూడా అపూర్వాలు.

వ్యక్తులు, సంఘటనలు, సన్నివేశాలు – ప్రకృతిలోని ప్రతి వస్తువు ఉచితమైన లయలో సముచితమైన ఛందస్సుతో రూపుదిద్దుకొని ప్రతి రచనలోను కనిపిస్తాయి.

ప్రత్యక్ష జీవితం నుంచి పుట్టకొని వచ్చినవి, స్వానుభవ రూపకల్పనలే ఆయన రచనలన్ని. అవి మధుగీత త్రిపదలు, ట్రుమ్రీలు, మొదలుగు కవితా గుచ్ఛాలు.

మధుబాల, అశోకవనిలో రాముడు, మణి మానసం వంటి లఘు కావ్యాలు. దీప సభ, రాగ వైశాఖ మహా కావ్యాలు. అనాది కొస నుంచి అనంతత్వంలోకి, గుడిసెలు కాలిపోతున్నై, శివాలకలు వంటి వచన కవితా కావ్య సంపుటాలు.

మానవుని మరొక మజిలీ, పైరు పాట, పాలేరు, కూలిరాజు రాగ వాసిష్టం , బాల యోగి, ఆదికవి వాల్మీకి , పడిపోతున్న అడ్డు గోడలు చిత్ర కళా ప్రదర్శనం , ప్రగతి అసూయ వంటి రూపకాలు.

శైలికి, రీతికి భీమన్న ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాడు. గ్రాంధికంలో ''ము'' స్తానంలో ''ం''ను ఎలా భరించలేడో, వ్యావహారికంలో ''ం'' స్తానంలో ''ము'' ను అలానే భరించలేడు. అంతటి నిష్టాపరుడైన శైలివాది బోయి భీమన్న.

అతని శైలికి, భావాలకు ముచ్చట పడి " జనవాణి " సంపాదకులు శ్రీ తాపీ వారు ఆ పత్రికలో ఒక ప్రత్యేక శీర్షికను నిర్వహించవలసినదిగా కోరినప్పుడు లేఖా రూప సాహిత్యాన్ని ఎంచుకున్నారు. పల్లెటూరి పట్టణ జీవితాల గురించి తెలిసి ఉండడం వల్ల స్వయంగా అనుభవిస్తూ వుండడం వల్ల రెంటిని పోలుస్తూ పల్లెటూళ్ళ అభివృద్ధికి లేఖలు వ్రాస్తానన్నాడు. దాని కోసం " పల్లెటూరి లేఖలు " అనే శీర్షికతో " జానపదుడు " అనే కలం పేరుతో వారానికి ఒకటి చొప్పున ధారావాహికంగా ప్రకటించాడు. తెలుగు లేఖ మౌళిక సాహిత్యంలో మార్గదర్శకుడైనాడు.

నాటక రచనలో భీమన్న గారిది ప్రత్యేకమైన శైలి, ప్రతి నాటకమునకు భీమన్న విపులమైన పీఠికలతో రచించాడు. 1945 లో " పాలేరు " నాటకం బహుళ ప్రచారం పొందినది. చాలా సార్లు ముద్రణ గావించాడు. ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని జిల్లాలలోను దీనిని ప్రదర్శించారు.

వివిధ విషయాలను గురించి విభిన్న దృక్పధాలతో భీమన్న వ్రాసిన రచనలు తాత్త్వికదర్శనాన్ని తెలుపుతాయి. ఒక చోట భీమన్న ఇలా అంటాడు.

1. నేను హేతువాదిని , మానవతావాదిని. నాకు మానవునిలోను వాని అభ్యుదయములోను పూర్తిగా విశ్వాసమున్నది.

2. దేవుని నమ్మను పరమాత్మను నమ్ముతాను. దేవుడు వ్యక్తిగతమైనది. పరమాత్మ ప్రపంచకమైనది. ప్రాపంచకమైనదే సత్యం. సత్యమే భగవత్స్వరూపం[1].

బోయి భీమన్నలో ఒక ప్రత్యేకత కలదు. వివిధ తత్త్వవేత్తలు భావాలను చదివి అర్థం చేసుకొని తనదంటూ ఒక కొత్త సిద్ధాందాన్ని ప్రవేశపెట్టాడు. దానికి **"రసాద్వైతమని"** పేరు పెట్టారు.

1. భీమన్నతో ముఖాముఖి

" కర్మ కాండే సమస్తము అయిన కర్మిష్ఠికి
కర్మా ద్వైతం ఉంది.
చిత్తం దైవాయత్తమైన భక్తుడాకి
విశిష్టా ద్వైతం ఉంది "[1]

" ఓహో ఎవరీ అపూర్వనంద రస్సైందవి?
ఉమా, రమా పరమైశ్వర్య కళాదేవి?
నా కౌగిట్లో, నా దేహంలో నా హృదయంలో
నారసాద్వైత రమ్యతకీ ఒక ప్రమాణమై
పరవశించి ఉన్నావా నీవు !
పరమ రసాద్వైతానివేనా నీవు?
అయితే —
అమృత యోగవై నాలో పొంగి
ఆనంద ధారవై విహరించు "[2]

అద్వైతం – శంకరాచార్యులు , విశిష్టాద్వైతం రామానుజాచార్యులు బోధిస్తే – భీమన్న " రసాద్వైతం " బోధిస్తున్నాడు. ప్రేమ అభిమానుము గౌరవము అందరూ సమానముగా పొందువలెనన్నదే రసాద్వైతం.

భీమన్న ముద్రిత కృతుల్లో కొన్ని ప్రజాదరణ పొందినవి , సాహిత్య అకాడమీ అవార్డులు అందుకున్నవి.

దీప సభ, మధుబాల పద్య గీత కావ్యాలు ప్రజాదరణ పొందితే "పాలేరు" నాటకం పలు ప్రదర్శనలు ఇచ్చింది. "గుడిసెలు కాలిపోతున్నై" కవితా సంపుటి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు అందుకుంది.

---

(1) గుడిసెలు కాలిపోతున్నై (కవితల సంపుటి) పే.నెం. 120. (2). గుడిసెలు కాలిపోతున్నై (కవితలసంపుటి పే. నెం. 122.

భీమన్న రచనలలో అముద్రిత రచనలు ఇంకా ఉన్నాయి. వాటిలో కొన్ని —

1. వేద వ్యాసుడు - నాటకం.
2. ధర్మ వ్యాధుడు - నాటకం.
3. క్షీర సాగరం - నవల.
4. అతికిన ముక్కలు - గేయ పద్య కావ్యం.

# భీమన్న నిర్వహించిన పదవులు

భీమన్న కవిగానే కాక అనేక ప్రభుత్వ ప్రభుత్వేతర సంస్థలలో అనేక పదవులు నిర్వహించి తమ మేథాసంపత్తిచే తగు సలహాలిచ్చి ఆయా సంస్థలకు, ప్రజలకు సేవ చేశాడు.

1940 – 45 లో ఉపాధ్యయ వృత్తిని చేపట్టాడు. ఒక ప్రక్క ఉపాధ్యాయ వృత్తిని నెరవేరుస్తూనే సాహిత్య కృషిని గూడ కొనసాగించాడు. తరువాత ఉపాధ్యాయ వృత్తిని వదలి 1946లో రాజకీయ రంగ ప్రవేశం చేశాడు. ప్రదేశ్ కాంగ్రెస్ ఆర్గనైజరుగా , హరిజన సేవక్ సంఘ్ సంయుక్త కార్యదర్శిగా పదవులు నిర్వహించాడు. ఆ తర్వాత మళ్ళీ మద్రాస్ రాష్ట్రంలో అసిస్టెంట్ పబ్లిసిటీ ఆఫీసర్‌గా ఉద్యోగంలో చేరాడు.

1950 లో మద్రాస్ నుండి శ్రీ నార్ల వెంకటేశ్వరరావు సంపాదకత్వంలో వెలువడే '' ఆంధ్రప్రభ '' లో సహాయ సంపాదకులుగా మళ్ళీ సాహిత్య సేవ ప్రారంభించాడు.

1955 లో జర్నలిజానికి స్వస్తి చెప్పి ఆంధ్ర రాష్ట్రంలో అనువాద శాఖ మరియు పుస్తకాల నమోదు అధిపతిగా తిరిగి ఉద్యోగ రంగ ప్రవేశం చేశాడు.

1960 లో నవ్య సాహితీ సమితి అధ్యక్షుడుగా అఖిల భారత ప్రథమ తెలుగు రచయితల సభలకు సారథ్యం వహించాడు. ఇదే సంవత్సరము ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీలో ఎగ్జిక్యూటివ్ మెంబరుగా ఎన్నిక చేయమడినాడు.

1974 లో కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు సలహా సంఘం సభ్యులుగాను, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ సంయుక్త కార్యదర్శి గానూ పదవులు నిర్వహించాడు. మరియు తెలుగు అకాడమీలో పాలక మండలి ( బోర్డ్ ఆఫ్ గవర్నర్స్) సభ్యులుగా ప్రభుత్వం నియామకం చేసింది.

1975 – 76 ఆంధ్రప్రదేశ్ ఫిలిం అవార్డ్స్ కమిటిలో రెండు టర్మ్ములు సభ్యులుగా ఎన్నిక చేయబడినాడు.

1978 లో ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తు సభ్యులు (ఎం.ఎల్.సి.) గా ప్రభుత్వంచే నియమింపబడినాడు. ఇంకా అంతర్జాతీయ తెలుగు సంస్థ పాలక మండలి (గవర్నర్ బోర్డ్) సభ్యులుగాను నియమింపబడి సాహిత్య సేవకు అంకితమైనాడు.

ఇంకనూ డాక్టర్ బోయి భీమన్న గారికి ఈ దిగువ సంస్థలతో వివిధ హోదాలలో సన్నిహిత సంబంధాలున్నాయి.

1. ఆంధ్ర , ఉస్మానియా విశ్వవిద్యాలయాల్లో సెనేట్ సభ్యత్వం.
2. కేంద్ర సాహిత్య అకాడమీ.
3. ఆకాశవాణి ప్రాంతీయ సలహా సంఘం.
4. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.
5. ఆంధ్ర ప్రదేశ్ సంగీత తెలుగు రచయితల మహా సభలు.
6. అఖిల భారత తెలుగు రచయితల మహా సభలు.
7. నవ్య సాహితీ సమితి.
8. సుఖేలా నికేతన్ స్థాపన.

# భీమన్న వ్యక్తిత్వం

భీమన్నను ఇతరులతో పోల్చడం భీమన్న ఒప్పుకోడు. అలా పోల్చడం అతని వికాసానికి అడ్డుకట్టలు వేస్తున్నట్లు భావిస్తాడు. ముఖ్యంగా వీరు స్వీయ గౌరవం గల వ్యక్తులు. బలీయమైన ఆత్మవిశ్వాసం పెంపొందించుకొన్న వ్యక్తిత్వం వీరిది. బోయి భీమన్న తనలోని ప్రత్యేకతను, విశిష్టతను గుర్తించుకుని వాటికి అనుగుణంగా తన జీవితాన్ని తీర్చిదిద్దుకున్నాడు. అంతే తప్ప ఇతరులను అనుకరించడం, అనుసరించడం తనకెంతో హానికరం అని గుర్తించాడు. స్వంత వ్యక్తిత్వం, మేథా నైశిత్వం వున్న వ్యక్తి.

బోయి భీమన్న ఎవర్ని ఆదర్శంగా తీసుకోలేదు. తనకు తానే ఆదర్శం. ''ఒక గొప్ప వ్యక్తి ఎప్పుడూ సామాన్యుల నుంచి, సాధారణ వ్యక్తుల నుంచి ఘర్షణను ఎదుర్కొవలసి ఉంటుంది ''[1]. ఇది అక్షరాల బోయి భీమన్న విషయంలో జరిగినట్టు అతని వ్యక్తిత్వం ద్వారా తెలుస్తుంది.

ఇంకా బోయి భీమన్న వ్యక్తిత్వమేమిటో ఆయన రచనల ద్వారా, అయన చింతన ద్వారా మనకు తెలుస్తుంది. ముఖ్యంగా ప్రజాస్వామ్యం, మానవతా వాదం ఈ రెండూ భీమన్న జీవిత ధ్యేయాలు. జాతి బాహ్యాడంబర ఆధ్యాత్మిక నిగళ బద్ధమై వున్నంత కాలం దేశం అధునికం కావటం గాని, ఆర్థికాభ్యున్నతి సాధించటం గాని, సామాజికంగా పురోగమించడం గాని జరుగదు.

డాక్టర్ బోయి భీమన్న విశ్వాన్నంతటినీ ఆకళింపు చేసుకున్న తత్త్వవేత్త. తన తాత్త్విక దృష్టితో ప్రపంచానికి కొత్తదారులు చూపించిన మహనీయుడు. గొప్ప మానవతావాది.

---

1. 'మిసిమి' మాసపత్రిక, ఫిబ్రవరి, 1994 సంచిక పేజీ. నెం, 75

ద్వైత, అద్వైత , విశిష్టాద్వైత తత్త్వాలు ప్రసాదించే పాక్షిక సత్యాలను సదవగాహన చేసుకొని అసంతృప్తుడైన భీమన్న, మానవానంద ప్రణయ మూల బీజానికి సంపూర్ణ సర్వతో ముఖ వికాసం కల్గించే చేతనా రసస్ఫూర్తిగా రసాద్వైత తత్త్వ సృష్టి చేసిన కళా స్రష్ట అనవచ్చు.

అవ్యాజ ప్రేమను, అనంత సౌందర్యాన్ని, అవిచ్ఛిన్న విశ్వాత్మను ఆవిష్కరించే ఈ రసాద్వైత దృష్టి అతని విభిన్న రచనలన్నింటిలో అంతర్జ్వాలగా ప్రజ్వలిస్తున్నది.

పద్మశ్రీ భీమన్న సాహిత్యం ద్వారా ప్రజల్లో నూతన చైతన్యాన్ని కల్గించడానికి ప్రజాస్వామ్యం, మానవతా దృక్పథం కలిగి సాహిత్యం తో సాహిత్య సేవ చేస్తున్న విశిష్టమైన వ్యక్తిత్వం కలవాడు.

మహాకవి భీమన్న వినయ స్వభావం కలవాడు. ద్వేషము, అసూయ అతని మృదు స్వభావమునకు విరుద్ధములు.

# భీమన్నకు జరిగిన సన్మానాలు

బోయి భీమన్న ప్రతిభకు, వారికి గల సేవా గుణానికి జరిగిన సన్మానాలు అనేకం.

క్రీ.శ. 1953 సంవత్సరములో శ్రీ దామోదరం సంజీవయ్య, ముఖ్యమంత్రి అధ్యక్షతన గుంటూరు జిల్లా చెరుకుపల్లిలో బ్రహ్మాండమైన పౌర సన్మానం. ఇంకా ప్రజాకవి భీమన్నకు ''గండపెండేరం'' ప్రధానం చేసినపుడు ఆనాటి శ్రీ కృష్ణదేవరాయలు అల్లసాని పెద్దనకు జరిపిన సన్మానసత్కార సభలా తీర్చిదిద్దారు.

1975 లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలో గొప్ప సన్మాన సత్కారం జరిగింది[1].

1988, జూలై 24 న డా॥ జె. బాపురెడ్డి గారి అధ్యక్షతన విజయవాడలో ''కనకాభిషేకం''[2] జరిగింది. అందు నగర మేయర్ శ్రీ జంధ్యాల శంకర్, శ్రీ తుర్లపాటి కుటుంబ రావు, శ్రీ ఎన్. సి. కృష్ణమాచార్యులు, డా॥ కుందుర్తి సత్యనారాయణ మూర్తి, శ్రీ ఎమ్.పి. జాన్ కవి, మరియు శ్రీ ఈడ్పుగంటి సత్యనారాయయ మూర్తి గార్లు పాల్గొని అభినందనలు తెల్పినారు.

1989 లో సెప్టెంబరు 19 న హైద్రాబాద్‌లో సాహిత్య వేత్తలు, పండితులు, పలువురు కవులు పాల్గొని ''పుష్పాభిషేకం''[3] జరిపారు.

---

భీమన్న సాహితీ షష్టి పూర్తి సంచిక. [illegible] లో భీమన్న జీవిత విశేషాల నుండి

భీమన్న గారి శ్రీమతి హైమవతి గారితో ముఖాముఖి ద్వారా

1990, సెప్టెంబరు 19న విశాఖ పట్నంలో పురప్రముఖులు జిల్లా రచయితలు భీమన్న గారికి సన్మాన సభ ఏర్పాటు చేసి అందులో **''కనక పుష్పాభిషేకం''** గావించారు.

బోయి భీమన్న గారు జన్మతః కవి. వీరు సాహిత్యరంగానికి విశేష సేవ చేశాడు, చేస్తున్నాడు కూడ. భీమన్న గురించి వివిధ సందర్భాలలో సమకాలీనులైన కవి మిత్రులు, పండితులు, ప్రజలు చేసిన ప్రశంసలు, సన్మాన సత్కారాలు కొన్ని ఇందు పొందు పరుస్తున్నాను.

1) ఒక సారి డా॥ జె. బాపు రెడ్డి గారు చేసిన వైయుక్తిక సన్మానంలో సి.నా.రె. స్వయంగా వ్రాసి వివరణాత్మకంగా పాడగా , బాపు రెడ్డి , రమణ రావు, డా॥ యాదగిరి రెడ్డి మరియు ఎ.వి.ఆర్. మున్నగు మిత్రులు 'ఖవాలీ ' తరహాలో ఆనాటి సన్మాన సభయందు పాడారు.

**'' నీ దొక దీర్ఘాలాపన**
**నీది అనర్ఘాలోచన**
**నీది నిశాసూర్య దృష్టి నిత్య నేస్తం**
**నీది దివాచంద్ర సృష్టి నిజమిది నేస్తం ''.** [1]

2) 16-1-1990 శనివారమున ఆంధ్ర నలందలో భీమన్న గారికి చేసిన సన్మానంలో శ్రీ కోట సీతారామశర్మ గారు ఈ కవిత చదివి సమర్పించుకున్నారు.

**'' వేములవాడ భీమకవి వీరుడు నాడు - విశాల పాండితీ**
**శేముషి ధార్మికా చరణ శిష్ట జగత్తు శిల్పి వాడు ; దా**
**గోముగ బోయి భీమకవి కోకిల విప్లవ భావదీప్తితో**
**ప్రేమప్రపూత విశ్వమునకు పేర్కొనినేడుత దాఖ్య నొప్పెడున్''.**

---

1. ''పాలేరు'' నుండి పద్మశ్రీ వరకు'' బోయి భీమన్న ప్రశంసాసర్గ నుండు పేజీ. నెం. [illegible]

3) 24-5-1970న ఆం. ప్ర. నిమ్న జాతి సంక్షేమ సంఘం, శ్రీ శైలం శాఖ వారు గొప్ప సభ ఏర్పాటుచేసి ఘనంగా సన్మానించారు. అందునొసంగిన సన్మాన పత్రం లోని కొన్ని వాక్యాలు ఇందు తెలియజేస్తాను.

" స్నేహ శీలీ ! మహాకవీ ! ప్రతిభాన్వితా ! [1]
రసపిపాసీ ! ఆర్ద్ర హృదయా !
అభ్యుదయ గామీ ! మార్గదర్శకా !
..................................
..................................
..................................
ఎన్నటికీ వాడని నీ
కావ్య కుసుమాలవుందు
తరాలవారికి ఆదర్శంగా నిలిచి కళాజగత్తులో
వెలుగు బాటలై వర్థిల్లుగాక

4) దివి. 21-1-1971న కాకినాడ సన్మాన సభలో-

1. ఆం. ప్ర. షెడ్యూలు కులాల సంక్షేమ సంఘం
2. తూర్పుగోదావరి జిల్లా యువజన సమాఖ్య
3. ఇండియన్ క్రిష్టియన్ అసోసియేషన్
4. అంబేద్కర్ మెమోరియల్ లైబ్రరీ సొసైటీ
5. కాకినాడ మార్కెట్ వర్తక యూనియన్
6. విద్యార్థి రిపబ్లికన్ ఫెడరేషన్

---

"పాలేరు నుండి పద్మశ్రీ వరకు" బోయి భీమన్న ప్రశంసా పత్రంలో పేజీ నం. 274

7. విజయజ్యోతి నికేతన్
8. పి. అండ్.టి. ఎంప్లాయిస్ ఫెడరేషన్
9. తూర్పుగోదావరి జిల్లా రచయితల సం...
10. స్టూడెంట్స్ అసోసియేషన్
11. వివేక వాణీ ప్రచార సంఘ్
12. సిటిజన్స్ ఆప్ కాకినాడ.

మొదలగు సంఘాలు ఉచిత రీతిన సత్కరించి సన్మాన పత్రాలు సమర్పించారు. అందులో ఉదాహరణకు ఒకటి.,

**'' కవి ! మహా కవీ ! పీఠికా పీఠాధిపతీ! [1]**
**కళాప్రపూర్ణ ! ప్రగతి శీలీ! ప్రజాకవి! కవి ఋషీ!**
**శ్రీ బోయి భీమన్న ! చిరాయువగుమన్నా !.........**

5) దివి. 24-1-1971 న ఏలూరులో సన్మానం జరిగింది. ఆ సన్మాన సభలో భీమన్న గారికి సమర్పించిన సన్మాన పత్రము నందు చోటు చేసుకొన్న అక్షర బీజాల కొన్ని -

**'' సముజ్జ్వల రచనా సముద్రులగు మీరు నూఱేండ్లు**
**మని , భారత దేశ స్వాతంత్ర్య సౌభాగ్య సామాన్య**
**ప్రజాభ్యుదయార్థమై శతాధిక కృతులు వెలయించు**
**నట్లుల పరమేశ్వరుడు అనుగ్రహించు గాత. ''**

6) దివి. 18-10-1974న బెంగుళూరులో ఆరవ అఖిల భారత తెలుగు రచయితల మహా సభలో జరిగిన సన్మానంలో పొందిన సన్మాన పత్రము నుండి

1. ''పాలేరు నుండి పద్మశ్రీ వరకు బోయి భీమన్న'' లో

" చీకట్లను చీల్చిన సూర్యబింబమా! [1]

తరతరాల అస్పృశ్యతమః పటలాన్ని చీల్చుకుని
ఆది వేద విజ్ఞాన సాగర గర్భంలో నుంచి ఆంధ్ర ప్రదేశ్
పూర్వ దిశా తీరం మీద అమృత గోదావరి ఒడిలో
వెలసిన సూర్యబింబమా

ప్రగతీ సముద్దీపక నాటక కర్తా!

భారతీయ కుల వ్యవస్థలో, స్వార్థ సాంఘిక వ్యవస్థలో
శతాబ్దాలుగా అణగారిన పీడిత దళిత వర్గాలలో
స్వేచ్ఛా స్వాతంత్ర్య చైతన్య తరంగాలను పొంగించిన
పాలేరు కూలిరాజా వంటి అపూర్వ సాంఘిక నాటక
నిర్మాణం చేసిన నవ విభాత వైతాళికుడవు నీవు.
రస ప్రపుష్ట స్వతంత్ర్య కావ్యానేక స్రష్టా!
దీవ సభ, మధు బాల.........
అఖిల ప్రపంచంలో జరుగుతున్న నవ నవోన్మేష
మూల సాహిత్య నిర్మాణానికి దోహదం చేశావు.
అందుకు తెలుగు జాతి ఎంతో గర్విస్తున్నది.
నీకు ఋణపడి యున్నది.
సర్వతోముఖ! జీవన దర్శనాదర్శ రాగ వైశాఖి దాతా!
ఎన్నో యుగాల కొకసారి గాని వెలువడని భగవద్గీత,
బైబిల్, ఖురాన్ వంటి మానవ జాతి జీవన గతిని
నిర్దేశించే మహద్గ్రంథాలతో సరి గద్దెను నిల్చే
రాగ వైశాఖి లేఖా కావ్యన్ని నిర్మించి తెలుగు

1. "పాలేరు నుండి పద్మశ్రీ వరకు" బోయి భీమన్న లో

సాహిత్య చరిత్రలో నూతన యుగ కర్తవైనావు.
రసాద్వైత తత్త్వ నిర్మాతా !
ద్వైత అద్వైత విశిష్టాద్వైత తత్త్వాలు
ప్రతిపాదించే పాక్షిక సత్యాలను
సదవగాహన చేసుకొని అసంతృప్తుడవైన నీవు

.......................................

కళా ప్రపూర్ణ , పద్మ శ్రీ బిరుదాంకితా!
మహాకవివై , సాహితీ వసంతుడవై
ఉపజ్ఞా కోకిలవై తెలుగు సరస్వతి

...................................

అఖిల భారత రచయితల మహాసభ పక్షాన
నిన్ను సన్మానించి భాషాను తల్లిని ఆరాధిస్తున్నాము ''.

సాహిత్య సమరంలో తనదంటూ ఒక ప్రత్యేకతను నిలబెట్టుకొన్న భీమన్న తన ' పాలేరు ' రూపక మలి ముద్రణ యందు తన అభిప్రాయంలో తనకు జరిగిన సన్మానాలను అన్నింటినీ సీసపద్యంలో పేర్కొన్నాడు.

'' బ్రహ్మ రథము పట్టి , పగటి దివిటీలతో [1]
వేయించితివి గండ పెండెరమును
అందించితివి భారతాధ్యక్ష గిరి చేత
మహనీయమ్మైన పద్మా అవార్డు
కలిగించితివి గుడిసెల కావ్యమునకు జా
తీయ పురస్కార ధీయశస్సు

1. ''పాలేరు' నాటకం రచయిత అభిప్రాయము లో

ఆంధ్ర కాశీద్ధ విద్యా పీఠముల నుండి
గౌరవంచితివి డాక్టర్ బిరుదుల
శాసన పరిషత్తు సభ్యత్వ మొసగి తీ
ర్చితివి నాలోని రాచరిక తృష్ణ

ఇంతగా నన్ను భూషించి , ఇపుడు దీని
కంతకు కిరీటి మన కనకాభిషేక
ధన్యతను గూర్చినావు నా తల్లీ ! బ్రాహ్మి
బాపురే సోలవరపు సత్రావు గారి
హృదయ పద్మాసనము నుండి ఎంత కరుణ !''.

# భీమన్న పొందిన బిరుదులు

బోయి భీమన్న గారి ప్రతిభావుత్పత్తులకు శక్తి సామర్థ్యాలకు ధీర చిత్త వృత్తిని నిరూపమాన సాహితీ సేవకు సన్మానాలు సత్కారాలతో పాటు అనేక బిరుదులు పొందారు. అందులో కొన్నింటిని తెలియపరుస్తాను.

**i) మహాకవి :**

1968లో కాకినాడ ప్రజలు బోయి భీమన్న గారికి ఘనమైన సన్మానము జరిపి అందు మహాకవి బిరుదు ప్రదానం చేశారు.

**ii) సాహితీ వసంత :**

1971 లో స్వగ్రామం మామిడి కుదురులో షష్టి పూర్తి ఉత్సవం జరిపారు. అందు 'సాహితీ వసంత' బిరుదు సాహితీ బంధువులచే ప్రదానం చేశారు.

**iii) కళా ప్రపూర్ణ :** [1]

1971 లో ఆంధ్ర విశ్వ విద్యాలయం వారిచే బ్రహ్మాండమైన సభా మంటపము నందు గౌరవ ప్రదమైన 'కళా ప్రపూర్ణ' బిరుదు ప్రదానం చేయబడింది.

**iv) పద్మశ్రీ :**

1973 లో కొత్త ఢిల్లీలో భారత ప్రభుత్వం తరుపున రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరి గారి చేత " పద్మ శ్రీ " బిరుదు ప్రధానం చేయబడినది. దీనితో భీమన్న గారు భారత దేశ సాహితీ లోకానికి తెలిసి పోయారు.

---

1. భీమన్న సాహితీ షష్టి పూర్తి సంచిక, ౧౯౮౩ చివరి పేజిలో

## V) డాక్టర్ :

1976 లో వారణాసిలోని కాశీ విద్యా పీఠం వారు భీమన్న గారికి సన్మాన సభ యేర్పాటు చేసి గౌరవ డాక్టరేట్ ( డి.లిట్.) ప్రదానం చేశారు. ఆ సభ యందు వివిధ గౌరవ మర్యాదలతో సత్కరింపబడినారు. పలువరి ప్రశంసలు అందుకున్నాడు భీమన్న .

# భీమన్న గూర్చి పలువురి ప్రశంసలు

పలు సన్మానాలు పొందిన భీమన్న పలువురిచే ప్రశంసలు పొందిన సందర్భాలెన్నో వున్నాయి. వాటిలో కొన్నింటిని ఉదహరిస్తాను.

## 1. కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

1960లో కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు బోయి భీమన్న గూర్చి ఓ సందర్భంలో ఇలా అన్నారు.

" భీమన్న గారు చక్కని కవి సుకుమారముగా సొగసైన భావములతో సంప్రదాయము చెడకుండ వ్యాకరణ శుద్ధములైన శబ్దములతో రచించు కవి".

## 2. కవి చక్రవర్తి గుఱ్ఱం జాషువా

ఒక సందర్భంలో కవి చక్రవర్తి జాషువా గారు బోయి భీమన్న గారి ప్రతిభ తెలుసుకొని ఇలా అన్నారు.

**" తళుకుల్ బెక్కులు గల్గు మేల్తెలుగు [1]**
**శబ్ద శ్రేణితో , కావ్య భా**
**షలు సృష్టించి , విరించి బిత్తరి కటాక్ష**
**శ్రీల నార్జించి, కా**
**గల వాడై సుతికెక్కు భీమన కవిన్**
**గన్నట్టి శ్రీ వేగి మం**
**డల మేరీతి బహూకరించునో**
**ప్రతిష్ఠా వాహనమెక్కించు చున్ ".**

1. పాలేరు నుండి పద్మశ్రీ వరకు బోయి భీమన్న గ్రంథంలో పేజీ. నెం. 654.

## 3. డాక్టర్ దివాకర్ల వెంకటావధాని

1973 న ఆం.ప్ర. సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వ ప్రదాన సందర్భములో చేసిన ప్రశంసలో కొన్ని వాక్యాలు —

''ప్రాచీనాధునిక – ఆంధ్రాంగ్ల గ్రాంధిక వ్యావహారిక రచనా సంప్రదాయ సవ్యసాచులు శ్రీ భీమన్న గారు. వారి రచనలన్నింట సుపజ్ఞా మౌళికతలు సర్వతో ముఖములై వర్తించుచు వారి కుపజ్ఞా కోకిల బిరుదమును సార్థకమొనరించుచున్నది......''

## 4. ఉత్తర ప్రదేశ్ గవర్నర్ శ్రీ బూర్గుల రామకృష్ణా రావు గారు

ఉత్తర ప్రదేశ్ గవర్నరు శ్రీ బూర్గుల రామకృష్ణా రావు గారు ఓ చోట ఇలా అన్నారు.

''శ్రీ బోయి భీమన్న గారు నవ్యాంధ్ర కవులలో గణనీయమైన స్థాయిని సంపాదించుకున్నారు. మాధుర్యము వారి రచనల ప్రత్యేక విశిష్టత. శ్రీ భీమన్న గారు ఉచ్చశ్రేణికి చెందిన యశస్కారములగు మధుర కవులు''.

## 5. మహాకవి డాక్టరు దాశరథి

ప్రజలు చేసిన ప్రశంసలు విని, భీమన్న గ్రంథాలు చదివి మహాకవి డా॥ దాశరథి గారు ఇలా చెప్పారు.

**'' రాల లోపల నమృతంపు జాలునించు**
**స్వాదుతను పంచు హృదయాల చేదుత్రుంచు**
**ప్రవిమలానంద సంపద పంచి పెట్టు**
**భీమన కవీంద్రు దివ్య కవిత్వ శక్తి''.**

## 6. శ్రీ యస్వీ జోగారావు

" బోయి భీమన్న కవిత వసంత నిరంతరమైన మధ్యధరా ప్రాంత ప్రకృతి సన్నివేశం వలె విసర్గ మనోజ్ఞమైన రివీరా వినోద కాలక్షేపం వలె శ్రుతి సుభగము యుగన్మమనోహరము అయినది. భారతీయ తత్త్వ ప్రవచనము వలె నిర్భర భావనా గంభీరమైనది. ప్రాచీనాంధ్ర జానపద హృదయం వలె నిరాడంబరము నిరతార్ద్రము నిత్యముగ్ధము అయినది".

# భీమన్న పొందిన అంకితాలు

సాహిత్య సీమలో సిద్ధహస్తులైన కళా తపస్వి బోయి భీమన్న మోదుగులు పుష్పించే చోట , మ్రోడులు చిగురేత్తే చోట, పీడిత జనం పిడికిలి నెత్తే చోట, విద్యుత్కవితలో గుండెలు వెలిగే చోట కనిపిస్తాడు. గుండె గుండెలో కోటి దీపాలు వెలిగిస్తాడు. కనుకనే ఇతడు మానవతావాది.

ఎందరో సాహితీ పిపాసకులు తమ కావ్య కన్యలను శ్రీ బోయి భీమన్న గారికి అంకితాలు చేశారు. అందులో ముఖ్యులు :

1. డా॥ జె. బాపు రెడ్డి - బాపురెడ్డి గేయాలు (గేయ సంపుటి) [1]
2. శ్రీ నర్రావుల సుబ్బారావు - తెలుగులో జర్నలిజం (వచన గ్రంథం)
3. శ్రీ భాస్కరభట్ల క్రిష్ణారావు - వెల్లువలో పూచిక పుల్లలు(నవల)

# భీమన్న రచనలు

తన సాహిత్యము భవిష్యత్తు సమాజ వికాస పరిణామానికి భూమికగ పరిణమిస్తుందన్న విశ్వాసముతో కలాన్ని కదను త్రొక్కించిన మహాకవి బోయి భీమన్న యొక్క రచనల పరంపర :

| | |
|---|---|
| 1. దీపసభ | పద్య కావ్యం |
| 2. మధుబాల | గీత కావ్యం |
| 3. రాగోదయం | గేయ సంపుటి |
| 4. భీమన్న కావ్య కుసుమాలు | లఘుకృతుల సంపుటి |
| 5. పాలేరు | రూపకం |
| 6. కూలిరాజు | ,, |
| 7. రాగవాసిష్ఠం | ,, |
| 8. అసూయ | ,, |
| 9. పడిపోతున్న అడ్డుగోడలు | ,, |
| 10. పైరుపాట | ,, |
| 11. మానవుని మరొక మజిలీ | ,, |
| 12. బాలయోగి | ,, |

13. ఆదికవి వాల్మీకి ,,

14. ప్రగతి ,,

15. చిత్రకళా ప్రదర్శనం ,,

16. మధుగీత ముక్తకాల సంపుటి

17. అనాది కొస నుంచి అనంతత్వంలోకి కవితా సంపుటి

18. త్రిపదలు ముక్తకాల సంపుటి

19. సెవెంత్ సీజన్ ఆంగ్ల కవితా సంపుటి

20. జానపదుని జాబులు లేఖా సంపుటి

21. ప్రకృతిలో మానవ ప్రకృతి కావ్య సంపుటి

22. రాగ వైశాఖి లేఖా కావ్యం

23. అకాండ తాండవం నృత్య గేయ కావ్యం

24. పిల్లీ శతకం వ్యంగ రచన

25. రాజకీయ వీరుడు – డాక్టర్ ఖాన్ జీవిత చరిత్ర

26. ధర్మం కోసం పోరాటం సాంఘిక, రాజకీయ సిద్ధాంత గ్రంథం

27. ఏక పద్యోపాఖ్యానం – సవ్యాఖ్యానం వ్యంగ రచన

28. అశోక వనిలో రాముడు పద్య కావ్యం

29. రాఖీలు గేయ సంపుటి

30. మణి మానసం పద్య కావ్యం

31. గుడిసెలు కాలిపోతున్నై గద్య కవితా సంపుటి

32. కేదారీశ్వరి — తెలుగు నేల పాటలు
33. బొమ్మ — గేయ కావ్యం
34. జన్మాంతర వైరం — కర్మ సిద్ధాంత కావ్యం.
35. శివాలకలు — సాంస్కృతిక విప్లవ కవితా సంపుటి
36. రాధతో ఎగ్జిబిషనుకు
37. ఓయి! కవీ కవిత్వం రాయి!
38. భీమన్న ఉగాదులు
39. పాటల తోట
40. భీమన్న భగవత్ గీత

**అముద్రితాలు:**

1. గోరువంకలు — మిని కవితలు
2. అతికిన ముక్కలు — పద్య కావ్యం
3. సినీమని - మనీ సిని — గేయ నాటికలు
4. వేదవ్యాసుడు — నాటకం
5. ధర్మ వ్యాధుడు — నాటకం
6. క్షీరసాగరం — నవల

''నా కవితా లక్ష్యం
చీకట్లో బ్రతికే వాళ్ళను మెప్పించడం కాదు
వాళ్ళను తిట్టైనా కొట్టైనా సరే
అక్కడ నుండి లేపడం
అరుణోదయం కేసి తరమడం''

(భీమన్న గారి సాహిత్య ఆశయం అది)

# భీమన్న రూపకాలు పరిశీలన

బోయి భీమన్న ఆధునికాంధ్ర కవులలో అగ్రగణ్యులు. మహాకవులు వీరి నాటకాలన్నీ దృశ్య కావ్యములే. కనుక దృశ్య మానమగు నాటకాలను రూపకాలని అంటారు. రూపకం అనేది నాటకానికి పర్యాయ పదం. అంటే, రూపకం గాని నాటకం గాని ఒకే పద్ధతికి చెందినవి అనవచ్చును. ముఖ్యంగా రూపకాలయందు పద్యాలు, పాటలు ఎక్కువగా చోటు చేసుకున్నాయి.

ఇక పరిశీలన అంటే ఏమిటో తెలుసుకుందాం. ఒక ప్రత్యేక దృష్టిని మనసులో నిలుపుకుని ఒక విషయాన్ని నిశితంగా చూడటమే పరిశీలన అనవచ్చు.

Concise Oxford Dictionary లో పరిశీలన పదానికి "The observation is accurate watching and nothing of phenomenon as they occur in nature is which regard to cause and effect of mutual relations." అని అర్థం చెప్పబడింది.[1]

పి.వి. యంగ్ అనే శాస్త్రవేత్త "The Observation is a systematic and delibarate study through the eye of spontaneous occurance at the time they occure" [2] అని పరిశీలనకు నిర్వచనం చెప్పాడు.

మానవుడు ప్రపంచాన్నిఅర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతున్న సాధనం పరిశీలన. ఏదైనా ఒక ప్రత్యేక ఉద్దేశంతో పరిశీలన చేయడమే దీని ప్రధాన లక్ష్యం. ఒక విషయాన్ని బేరీజు వేసి గమనించడమే పరిశీలన.

1. 'పరిశోధన విధానం'' - ఎస్. జయ ప్రకాష్ - 72 వ పుట
2. P.V. Young Scientific Social Surveys and Research 102 వ పుట.

"Philosophical and biographical truth must submit to the kind of truth that poems embody. It is there the poems that new life manifest itself. "[1] అని లారెన్స్ లిప్‌కింప్ అనే ఆధునిక విమర్శకాచార్యుడు విశ్లేషించాడు.

పాశ్చాత్య దేశాలలోని నాటకాలు రెండు విధాలుగా ఉంటాయి. ఒకటి సంపూర్ణ పద్య నాటకం. రెండవది సంపూర్ణ గద్య నాటకం. సంస్కృతంలో గద్య పద్య మిశ్రిత నాటకాలునున్నాయి. అట్లే బోయి భీమన్న తెలుగు నాటకాలలోనూ మిశ్రితాలున్నాయి. సంస్కృత నాటకాలలోని పోలికలు భీమన్న రూపకాలలో కనిపిస్తాయి. ఉన్న దాన్ని ఉన్నట్టు విచారించుట ఒకటైతే, అట్లా ఎందుకున్నదని విచారించుట రెంవది. ఈ రెండవ రకమైన విధానం తత్త్వ విచారణ అంటారు. ఇలాంటి విచారణ గల రచనలే బోయి భీమన్న చేసినవి.

వీరు అవిచ్ఛిన్నంగా వివిధ ప్రక్రియలలో రచనలు చేస్తున్నా ఇరవయ్యవ శతాబ్దపు కవి. నాటక కర్తగా, వక్తగా, విమర్శకుడిగా ఆధునిక తెలుగు సాహిత్యంలో భీమన్న స్థానం సుస్థిరమైంది. వీరి రచనలు తెలుగు సాహితీ జగత్తులో ప్రశస్తిని పొంది ఉన్నాయి. వీరి రూపకాలలో ''రాగవాసిష్ఠం'' (1959) గొప్ప కళాఖండం. వీరి ''పాలేరు'', ''కూలిరాజా'', ''పైరుపాట'', ''ప్రగతి'', ''చిత్ర కళా ప్రదర్శనం'' మొదలగు రూపకాలు ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రత్యేకత కలిగి వున్నవి.

వీరు తెలుగులో ప్రచురించిన మొత్తం రూపకాలు పదకొండు. వీరు దాదాపు 1940 నుండి నేటి వరకూ రచనలు చేస్తు వాటిని ప్రచురిస్తున్నారు. వీరి నాటకాలను ఈ దిగువ తెలిపిన విధంగా వర్గీకరించవచ్చును.

[1] ఆంధ్రప్రభ దినపత్రిక - తేది జనవరి 31, 1994

## 1. సామాజిక రూపకాలు

పాలేరు – ప్రచురణ 1940

కూలిరాజు – ప్రచురణ 1947

పైరుపాట – ప్రచురణ 1959

## 2. ఐతిహాసిక రూపకాలు

రాగవాసిష్ఠం – ప్రచురణ 1959

బాలయోగి – ప్రచురణ 1964

ఆదికవి వాల్మీకి – ప్రచురణ 1970

## 3. వ్యంగ్యాత్మక రూపకాలు

పడిపోతున్న అడ్డు గోడలు – ప్రచురణ 1958

ప్రగతి – ప్రచురణ 1979

## 4. ప్రతీకాత్మక రూపకాలు

అసూయ – ప్రచురణ 1954

మానవుని మరొక మజిలీ – ప్రచురణ 1963

చిత్ర కళా ప్రదర్శనం – ప్రచురణ 1963

బోయి భీమన్న సంస్కృత రూపక మర్యాదలను సమన్వయాత్మకంగా

పండించుకుని రూపకాలను రచించి తెలుగున విశిష్ఠ ప్రయోక్తగా ప్రసిద్ధి చెందినారు వీరి నాటకాలను పరిశీలించినపుడు రూపకాలలో తాత్త్వికచింతన, పాత్ర చిత్రణ, రస పోషణ, వస్తువైవిధ్యం, శిల్పం మరియు శైలి మొదలగునవి వివేచింపవలసి వుంటుంది. ముందుగా వీరి సామాజిక రూపకాలు పరిశీలిద్దాం.

## సామాజిక రూపకాలు :

మానవుడు సంఘజీవి. అతని వ్యక్తిత్వ వికాసం పై సమాజ ప్రభావం పడక తప్పదు. అతని మానసిక స్థితి వల్ల సమాజంలో మార్పులు రాక మానవు. అలాంటి మార్పులతో ఉన్న సమాజ లక్షణమే 'సామాజికత' అనవచ్చు. ఇలాంటి సామాజికత గల రూపకాలు బోయి భీమన్న రచించాడు.

వీరు జాతీయోద్యమ కాలంలో గ్రామీణుల జీవితాన్ని ప్రతిబింబిస్తూ గ్రామ ప్రజల రాజకీయ, నైతిక, సాంఘిక చైతన్యాన్ని పురికొల్పటానికి 'పాలేరు', 'కూలీరాజు', 'పైరుపాట' మొదలగు రూపకాలు రచించాడు తెలుగు సాహిత్యంలో ప్రప్రథమ దశలోనే రూపకాలు రచించిన వారిలో బోయి భీమన్న ఒకరు.

## పాలేరు (రూపకం)

ఈ రూపకంలో పద్యాలు, పాటలు, చిన్న చిన్న మాటలు ఉన్నాయి. సామాన్యులకు కూడ అర్థమైయ్యే విధంగా విసుగు కలిగించని సంభాషణలున్నాయి. ఈ నాటకంలో పదహారు రంగాలు ఉన్నాయి. ఇది భీమన్న గారి స్వతంత్ర నాటకం సామాజిక సమస్యలు కలిగినదీ నాటకం. 1940 లో ప్రచురించబడినదీ నాటకం.

బోయి భీమన్న భక్త కవి మరియు తాత్త్వికుడు. బుద్ధి గమ్యం, హృదయ గమ్యం రెండూ కలవారు. తాత్త్వికడైన భీమన్న తన సిద్ధాంతాలను శాస్త్రీయ శైలిలో చెప్పాడు. కవియైన భీమన్న దానినే తన జీవిత సిద్ధాంతం ఆధారముగా చేసుకొని కావ్యమయ శైలిలో తెలిపారు. అనగా శాస్త్రీయ శైలి మరియు కావ్య శైలి రెండింటినీ జోడించి భిన్నత్వంలో ఏకత్వాన్ని చూపగలిగాడు.

ఉదాహరణకు :

**" రాలే పూలకు మొలిచే మొగ్గలు**

**ప్రాణములోయీ దేవా !**

**మనుజాలలో యీ మాత్రపు సత్యము**

**మరుగైయున్నది – దేవా!"** [1]

ఇలా భీమన్న తన తాత్త్విక భావము తెలియజేశాడు. భీమన్న అద్వైత వాది. అనగా జీవాత్మకు పరమాత్మకు భేదము లేదని చెపుతాడు.

## సామాజిక దృక్పథం :

పేదల శ్రమను దోపిడి చేసేవారి దౌర్జన్యాలు, నిరుపేదల నికృష్ట జీవితాలు ఈ నాటకంలో కనిపిస్తాయి. అమాయక జీవితం గడిపే రైతు ఇందులో కథానాయకుడు. ఇతని చేత ఒక అభ్యుదయ సూచన చేయిస్తాడు రచయిత. చూడండి ఆ భావం :

---

1. 'పాలేరు' రూపకం 15 వ పుట

" ఆకటి బాధకు అల్లాడెదవా
బానిసవై బ్రతికెదవా
ఈ విశాల విశ్వంలో మరియొక
త్రోవయే కనబడదా
పగలగొట్టు నీభిక్షా పాత్రను
తెగ ద్రెంపుము నీ శృంఖలము
అభ్యుదయములో ఆశాగతిలో
అడుగిడి సాగుము వీరా" [1]

ఇలా ఉద్బోధలే కాక హృదయ వేదనను చక్కని ఛందస్సులో చెప్పిన కవితలున్నాయి ఉదాహరణకు :

చం॥ "హృదయము బీటవారె సహింపగరాని
వియోగ వహ్నిచే
బ్రతికితి నీదు దర్శన శుభాభ్యుదయంబిక
తొల్కరింప వం
చదియును పోయె; ఆశలు, నిశాచరులై
భయపెట్ట సాగె; రే
పుదయమె లేదు గావున తలోదరి ? ఈ దరిలేని
రాత్రికిన్" [2]

ఇలాంటి కవితలు ఈ నాటకంలో ఇంకా ఎన్నో ఉన్నాయి

1. 'పాలేరు' రూపకం – 63 వ పుట 2. 'పాలేరు' రూపకం – 78 వ పుట

Truth nacked is philosophy

Truth Clothed is Poetry

నగ్న సత్యం వేదాంతం అలంకృత సత్యం కవిత్వం – ఇలాంటి మాటల ద్వారా భీమన్న సాహిత్య హృదయం తెలుస్తుంది.

## కూలిరాజు (రూపకం):

ఈ రూపకాన్ని 1947 లో ప్రచురించి కళాలోకానికి అందించాడు. బోయి భీమన్న. ఈ 'కూలిరాజు' ఇతివృత్తం వ్యవసాయ కూలీల పోరాటం. సామ్యవాద సిద్ధాంతం ప్రాతిపదికగా సమసమాజాన్ని నిర్మించడం. ఈ తాత్త్విక చింతనతో భీమన్న తన రచనలో గ్రామీణ వాతావరణాన్ని సజీవ పాత్రల్ని సహజమైనట్టి సంఘటనల్ని సాధారణమైనట్టి సంభాషణల్ని అక్కడక్కడ పద్యాల్ని, పాటల్ని విన్యాసాలు చేయించాడు.

కూలిలంతా ఏకం కావాలని కూలీ రాజ్యం స్థాపింపబడాలని రచయిత ఎన్నికల్ని ప్రతిపాదించాడు. గాంధీయిజాన్ని ఆచరించి వయోజన వోటింగుతో కూలీలు అధికారంలోకి రావాలని ఈ నాటకం ద్వారా భీమన్న ఆశిస్తాడు. ఈ రూపకం ఒక రాజకీయ ప్రచార సాధనంగా మలిచినట్టు కనిపిస్తుంది. కాంగ్రేస్ ప్రభావం బోయి భీమన్నపై వుంది. అందుకే గాంధేయాన్ని తీసుకురావడానికి ప్రయత్నం చేసినట్టు ఈ నాటకం ద్వారా గోచరమవుతుంది.

కవికి కావలసిన కావ్య సంపద భీమన్న కలంలో పుష్కలంగా వుంది. ''నా సాహిత్యమే నా జీవిత చరిత్ర''[1] అని అన్నాడు భీమన్న.

**''పచ్చని పొలముల పచ్చి బాలెంత**

**మా బంగారు తెలుగు తల్లి''** [2]

---

1. 'పాలేరు' నుండి పద్మశ్రీ వరకు - 141 వ పుట 2. 'కూలి రాజు' నాటకం - 71 వ పుట

అని ప్రేమ దృష్టితో వీక్షించడం సమకాలీన పాత్రను ప్రేమరసంతో నింపడం విశ్వసాహిత్యమవుతుంది. వాస్తవాన్ని అందంగా తీర్చిదిద్దే కళ. మనకు స్వాతంత్ర్యం వచ్చింది గాని ఇంకా స్వరాజ్యం రాలేదు. దాన్ని మనం సాధించవలసి ఉంది'' [1]

ఇలాంటి సాధారణమైన సంభాషణలు ఇందులో కనిపిస్తాయి. 'కూలిరాజా' నాటకాన్ని 'ధన్యజీవి' అనేపేరుతో చాలా ప్రదర్శనలు జరిపినట్లు, 1947లో 'కష్టజీవి' గా మారినట్లు అటు తరువాత 1948 లో 'కూలిరాజా' గా పేరు మార్చి పలు ప్రదర్శనలు చేయించినట్లు తెలుస్తోంది. ఈ విషయమంతా కూడా 'భీమన్న సాహితీ షష్టి పూర్తి సంచిక' 1983 లోని శ్రీ బొజ్జా తారకం గారి వ్యాసంలో పేర్కొబడింది.

ముఖ్యంగా ఈ రూపకం గాఢమైన ఆవేశాన్ని చక్కని భావాన్ని భీమన్న తన పద్యాల ద్వారా పాటల ద్వారా సాహిత్య లోకానికి అందించాడు.

## పైరుపాట (రూపకం):

**'' రసే నైవ సర్వం జీవతి కావ్యం**

**నహి రస శూన్యం కావ్యం కించిదస్తి**

**రస ఏవ వస్తుతః ఆత్మా''**

అని రసాన్ని గూర్చి ప్రాచీన కాలంలో అభినవ గుప్తుడు అన్న మాటను భీమన్న అంగీకరించినట్లు చెప్పవచ్చు. ఈ ఛాయ భీమన్న 'పైరుపాట' గేయ రూపకంలో కనిపిస్తుంది.

రసస్ఫూర్తితో సాంఘిక చైతన్యం కోరుతూ రచించిన రూపకం 'పైరుపాట'. ఇందులోని గేయ కవిత్వం ఒక మూడ్ (Mood) ని కల్పించగలదు. ఈ రూపకంలోని ముఖ్యమైన సమస్య సాంఘికమైనదే అయినా Emotional Crisis అనవచ్చు.

1. కూలిరాజా' రూపకం - 10 వ పుట

బోయి భీమన్న పేరు విశ్వకవుల జాబితాలోనే చేర్చవచ్చు. విశ్వకవులలో అధిక సంఖ్యాకులు కేవలం దూరం నుండి పరిశీలించడం కాకుండా ప్రకృతిలో తాదాత్మ్యమే పొందారు. 'ఆకులో ఆకునై, పూవులో పూవునై' అంటూ కృష్ణశాస్త్రి గారు పరవశించి పోయారు. అలాగే భీమన్న గూడా...

**గడ్డి పూవ్వుగానైనా**
**కలువ పువ్వుగానైనా**
**నీ యడుగుల దరినైనా**
**నీ యెడ బాటునవైనా"** [1]

ఇలా ప్రకృతి పరంగా రచన చేస్తూ సాంఘిక సమస్యను తెలియజేశాడు.

శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారు ఒక నాటకానికి తెరలో మాట వ్రాస్తూ ఇలా అన్నారు. 'రంగస్థలం మీద కవిత్వ చదువుతూంటే వింటున్నామనే చైతన్యం ప్రేక్షకుల్లో కలుగనీయకుండా కథా గమనంలో వారికి సత్యభ్రాంతి కల్పించగలిగేటంతగా నాటకీయత సాధించగలిగినప్పుడు కవితా నాటకాలు విజయవంతమవుతాయి. ఈ అభిప్రాయం 'పైరుపాట' రూపకంలో మనం చూడగలం.

భీమన్న తత్వాన్ని గ్రహించడానికి వారి రూపకంలోని సంభాషణలు తోడ్పడుయాయి.

ఉదాహరణకు :

**శ్రీవత్స :- " మేడలు మిద్దెలు వున్నా**
**మెత్తని పానుపులున్నా**
**హృదయం లేకున్నపుడు**

1. 'పైరుపాట' రూపకం 74 వ పుట

వృథయే బ్రతుకంత'' [1]

స్నేహ:- ''సుకుమారపు కుసుమాలను
సూదుల కర్పిస్తాడా
అడుగులపై పడు పూలను
పడ ద్రొక్కకు పోతాడా'' [2]

శీల :- '' ఎక్కడ పుట్టి నేమి
ఎక్కడ పెరిగిన నేమి
కోరిన గుణమున్నపుడు
కోసుకొమ్ము పుష్పమును'' [3]

ఇంకా ఈ రూపకంలో అక్కడక్కడ వర్ణనలు, సూక్తులు కనిపిస్తాయి. మొత్తంమీద ఈ నాటకంలో ప్రధాన వస్తువు సాంఘికమే. ఎందుకంటే పై సంభాషణ సారం ఇలా వుంది.

అమాయకులైన వారిని పూలతో పోల్చడం, పూలకు సూదులు గ్రుచ్చడం, అమాయుకలను బాధించడం లాంటివి సాంఘిక సమస్యలే గదా.

పేదవాని ఇంట్లో పుట్టినా, కాని కులంలో పుట్టినా తనకు నచ్చిన గుణం వారిలో ఉంటే వారిని ఆదరించండి, గౌరవించండి, అనే భావం మనకు 'పైరుపాట' రూపకం ద్వారా తెలుస్తుంది. ఇదీ ఒక సామాజికమైన భావనయే. అలా భీమన్న శిష్ట వ్యావహారికంలో తమ సాంఘిక, సామాజిక భావలను తన రచనల ద్వారా తెలియజేశాడు.

బోయి భీమన్న సామాజిక రూపకాలోని ఇతివృత్తాలను సంక్షిప్తంగా తెలియజేస్తాను. ఇది వారి రచనలోని కథా వస్తువు యొక్క సారాంశంగా భావించగలరు.

---

1. పైరుపాట' రూపకం - 12 వ పుట 2) 'పైరుపాట' రూపకం - 35 వ పుట
3. 'పైరుపాట' రూపకం - 53 వ పుట

# సామాజిక రూపకాలలోని ఇతివృత్తం

| పాలేరు | కూలిరాజా | పైరుపాట |
|---|---|---|
| రైతువాడ గ్రామంలో కుబేర్రావు ఒక భూస్వామి. ఇతని వద్ద పుల్లయ్య పాలేరు. ఇతని కొడుకు వెంకన్న చిన్న పాలేరు. పాలేరు వెంకన్న చదువుకుని డిప్యూటి కలెక్టరు అవుతాడు.<br>వనబాల అను సవర్ణ స్త్రీని వర్ణాంతర వివాహంచేసుకుంటాడు వెంకన్న. చివరకు దుష్టుడైన కుబేర్రావు క్షమించబడటం చివర లో అందరు కలుసుకోవడం జరుగుతుంది.<br>ఇలా ఓ సినిమా కథలా సాగుతంది పాలేరు నాటకం లోని కథ. | కూలిరాజా నాటకంలోని కథానాయిక పరంజ్యోతి. ఈమె ఒక దళిత స్త్రీ. ఈమె ఆ గ్రామంలో ఓ వ్యవసాయ కూలి. కాంగ్రేసు ద్వారా ఎన్నికల్లో గెలుస్తుంది. భారత దేశానికి అధ్యక్షురాలు అవుతుంది.<br>కథ చివరలో రౌడీ భయంకరరావు పశ్చాత్తాపంతో ఆత్మహత్య చేసుకుంటాడు. కథానాయిక పరం జ్యోతి ప్రేమకు పవార్ అను అగ్రకులస్థుని వర్ణాంతర వివాహం చేసుకుంటుంది.<br>అలాగే ఉపనాయికా నాయకులు మధు-మిత్రల ప్రేమ వివాహం జరిగి కథ సుఖాంతమవుతుంది. | స్నేహ ఒక మాల పిల్ల. ఈమె స్నేహితురాలు శీల. ఈ యిద్దరు పైరు పాలాలలో గడ్డి కోస్తుంటారు. కథా నాయకుడు శ్రీవత్సం అగ్రకుల విద్యావంతుడు ఇతడు తరచు పాలాలలోకి షికారుకువస్తూ ఉంటాడు. ఇలా వస్తూనే స్నేహను ప్రేమిస్తాడు. శీల సహాకరంతో స్నేహను వివాహం చేసుకుంటాడు.<br>వారి వివాహం వర్ణాంతరమై వర్ధిల్లుతుంది. చివరకు పాలేరు, కూలిరాజా రూపకాల వలె ఇందులోని కథ కూడ సుఖాంతమవుతుంది. |

రచయిత భీమన్న ఈ రూపకాల ద్వారా ప్రతి మనిషిలోనూ ప్రేమ తత్త్వం నిర్మలమై , నిస్వార్థమై, నిష్పక్షపాతంగా పవిత్రంగా వుండాలని ప్రేమకు కులమతాలు ఉండరాదని చెప్పాడు.

## ఐతిహాసిక రూపకాలు :

ఒకనాటి మత ధర్మ సంస్కర్తల యొక్క , మానవ సమాజ హితం కొరే పుణ్య పురుషుల జీవిత చరిత్రలను తెలియజేసే రచనల్ని ఐతిహాసిక రచనలు అని అంటారు. అలాంటి గొప్ప ఐతిహాసం కలిగిన పుణ్య పురుషుల రూపకాలు బోయి భీమన్న రచించాడు.

బోయి భీమన్న ఒక్క రూపకాలే కాక అనేక రకములైన రచనలు చేశాడు. వీరి సాంఘిక భావాలు ఉన్నతమైనవి. మన సంఘంలోని అస్పృశ్యత , కుల భేదాలు, అన్యాయాలు , అక్రమాలు , దౌర్జన్యాలు , దోపిడిలు , చూస్తూ స్వయంగా వాటికి గురియవుతూ తన్నివారణార్థం సంఘాన్ని ఎదిరిస్తూ , ఉద్బోధిస్తూ , సమీకరిస్తూ వస్తున్న బోయి భీమన్న ధోరణి అభినందనీయం. ఆ ధోరణి లోనే ఐతిహాసిక రూపకాలు రచించాడు. అట్టి వాటిలో 'రాగవాసిష్ఠం', ఆదికవి వాల్మీకి , బాలయోగి మొదలైనవి ప్రసిద్ధాలు. ఈ రచనలలో ఉత్కృష్టమైన రచన ' రాగ వాసిష్ఠం '. ఇది 1959 వ సంవత్సరములో ప్రచురించబడింది. దీని విషయం పరిశీలిద్దాం.

### రాగ వాసిష్ఠం (రూపకం):

ఇది భీమన్న రచనల్లో మకుటాయమానమైనది. ఇది గొప్ప ఇతిహాస రూపకం. దీనిని గొప్ప కావ్యంగా తీర్చిన ఇతిహాస కావ్యంగా మలిచాడు. బోయి భీమన్న కథా కావ్య నిర్మాణంలో దక్షుడు. ఇతిహాస వస్తు గుణములైన నీతులు

ధర్మములు మనోరంజకముగా ప్రతిపాదించు నైపుణ్యము భీమన్నకు కలదు. కనుకనే వీరిని ' నానా రుచిరార్థ సూక్తి నిధి ' అనవచ్చు.

## రూపక పరిశీలన :

బోయి భీమన్న తత్త్వదృష్టి పరిశీలిస్తే జాతీయతా దృష్టితో పౌరాణిక ఇతివృత్తాన్ని స్వీకరించి రూపకాలు రచించాడనవచ్చు. వీరి రచనల్లో అతి నవ్య సాహిత్యం కనిపిస్తుంది. ఈ అతి నవ్య సాహిత్యాన్ని గూర్చి పాశ్చాత్య రచయిత క్రిస్టోఫర్ కాడ్వెల్ ఇలా అన్నారు.

"Specialisation is useful;integration is esential, electicism which avoids both makes worst of both worlds and is a characteristic feature of modern thought" [1].

ఈ విషయం భీమన్న రచనల్లో కనిపిస్తుంది. ప్రతి దానిలోని మంచినీ గ్రహించాలనుకోవడం వల్లనే భీమన్న పౌరాణిక ఇతవృత్తాన్ని సాంఘిక దృష్టితో ''రాగవాసిష్ఠం'' రచించాడు.

'రాగవాసిష్ఠం' భీమన్న గారి కీర్తికి పతాకలాంటిది. ఇది దృశ్యకావ్యం. మరియు శ్రవ్య కావ్యం కూడ. కనుక శ్రోతలను ప్రేక్షకులను ఆనందపరిచే శబ్ద మాధుర్యము కలిగి ఉంది. అక్షర రమ్యతచే నానారుచిరార్థ సూక్తులచే ప్రసన్న కథా కవితార్థ యుక్తిచే 'రాగవాసిష్ఠం' తెలుగు జాతి మనసులో చోటు చేసుకోగలిగింది. దానికి కారణం దాని సుందరమైన భావసంపదలోని విశిష్టతయే. అసలు రాగవాసిష్ఠంఅంటే వసిష్ఠుడి యొక్క రాగం, అనురాగం, ప్రేమ, పెళ్లి అని అర్థం. ఇందు అరుంధతి ఒక దళిత స్త్రీగా చిత్రించబడింది

1. 'మిసిమి' మాసపత్రిక జూలై । ౧౯౯౩ సంచిక - ౨ । వ పుట

ముఖ్యంగా సంఘసంస్కరణ ఈ రచన ఉద్దేశ్యం వ్యంగ్యం, హాస్యం సున్నిత స్థాయిలో ఉంది. దీనిశైలి నృత్య నాటక శైలి. రసపోషణ, పాత్ర చిత్రణ నిర్దిష్టంగా ఉంది.

ఇందులో 'కులగిరి' పాత్ర ఒక బ్రాహ్మణుడు. 'శివోహం' అరుంధతి సోదరుడు. ఈ రెండూ కల్పిత పాత్రలే. 'కులగిరి' అంటే 'పర్వతం' అనగా పాషాణం లాంటివాడు అని అర్థం. 'శివోహం' అంటే 'నేను శివుణ్ణి' అని అర్థం. వర్ణ ధర్మానికీ, కుల వ్యవస్థకూ గొడ్డలిపెట్టుగా పరిణమింప చేయడానికే ఆ పాత్ర చిత్రణ చేశాడు భీమన్న.

'పులి నోట్లో నన్నా చస్తాను గానీ నిన్ను ముట్టుకోను'' [1]. అంటాడు కులగిరి.

''యేడిసినట్టుగా వుంది నీ సిద్ధాంతం. యెవడు బోధించాడురా నీకిది, మనిషిని తాకవా ? పులినోట్లో చస్తావా, అయితే చావు'' [2]. అంటాడు శివోహం.

ఇలా బోయి భీమన్న సాంఘిక దురన్యాయాన్ని ఈ రూపకం ద్వారా తెలియజేశాడు. స్త్రీ పురుషుల సమానత్వము అద్వైతమూ. ఇది అరుంధతీ వశిష్ఠుల్లో వుంది. ఇలా పాత్రల్ని రూపొందించి భీమన్న కులాంతర వివాహాన్ని ప్రోత్సహించాడు.

''మిమ్మల్ని సమానంగా సృష్టిస్తున్నాను. మీలో భేదాలు సృష్టించుకొని ఒకళ్ళ నొకళ్ళ హింసిస్తున్నారు'' అని బ్రహ్మదేవుని చేత అనిపిస్తాడు బోయి భీమన్న.

ఈ రూపకంలో మరోచోట భీమన్న శివుని చేత వర్ణభేద నిర్వచనం చెప్పించాడు. ''గుణాల ననుసరించి వృత్తులు పుట్టాయి. వృత్తుల ననుసరించి వర్ణాలేర్పడ్డాయి. అవే కులాలయినాయి. అంటారు భీమన్న ఈ పుస్తక రచనలో. భగవద్గీతలోని –

1 మరియు 2 'రాగవాసిష్ఠం' రూపకం - 20 వ పుట

**చాతుర్వర్ణ్యం, మయాసృష్టం గుణకర్మ విభాగశః**

**తస్య కర్తారమ పియాం విద్ధ్య కర్తా రమ వ్యయం**

ఈ శ్లోకానికి దగ్గరి పోలిక భీమన్న నిర్వచనం. ఈ రూపకంలో హేతువాదం ప్రయోగించి భీమన్న కులతత్త్వంపై దెబ్బ కొట్టాడు.

## ప్రసన్న కథా కవిత:

అలంకారికులు వాఙ్మయమును వేదశాస్త్రములు, పురాణేతిహాసములు, కావ్య నాటకములు అను తీరున విభజించారు. భీమన్న 'రాగవాసిష్ఠం' కావ్య నాటకమై శోభిల్లుతోంది. అరుంధతి వసిష్ఠుల ప్రణయ గాథయే రాగవాసిష్ఠం. ఈ గాథ ఒక ఇతిహాసం. ఇతిహాసమే ఒక పుణ్యకథ. దాన్ని రమ్యంగా చెప్పటం భీమన్న ఆశయం. శ్రోతలు, ప్రేక్షకులు భీమన్న కథా కలితార్థ యుక్తిని ఆరసి దాని రమ్యతను మేలని అభినందిస్తారు. అందుకు సందేహం లేదు.

**ఉదాహరణకు :**

**"అరుణోదయమున కే**
**అనురాగమెచటిదో**
**అడవి తీగల కింత**
**అమృతత్వ మేమిటో"**[1]

ఈ కావ్య నాటకంలో అక్షర రమ్యత అతి సుందరం.

## అక్షర రమ్యత :

పద సంయోజనం, వర్ణ సంయోజనం రూపమే అక్షర రమ్యత.

1. 'రాగవాసిష్ఠం' రూపకం – 3 వ పుట

రమణీయమైన అర్థాన్ని ప్రతిపాదించు రమణీయమైన శబ్దమే కావ్యము. భీమన్నరచనలో అక్షరాలు పదబంధాలై పరిపక్వాలై ఉంటాయి. భీమన్న గద్య పద్యములు సమ్మోహన మంత్రముల వలే పనిచేస్తాయి.

**" కుల విభేదంపు కఠిన శృంఖలము త్రెంచి**
**మోక్షముం బొందజాలని మూఢు నేను**
**సత్త్వహీనుని బ్రతుకు వర్జ్యమ్ము "** [1]

ఇలాంటివి ఈ రూపకంలో చాలా ఉన్నాయి. బోయి భీమన్న సామాన్య మానవుడి ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొనియే రచనలు చేస్తాడు. ఇంకా ఇందులో సూక్తులు చమత్కారములతో పాటు శాస్త్రం, ఇతిహాసం, కావ్యము మొదలగు త్రివిధ లక్షణములు కలిగి యున్నది.

**ఉదాహరణకు :**

**" ప్రణయ యజ్ఞమందు ప్రాణాలను యజించి**
**సోమ పాన మగుదు సుదతి పెదవి"** [2]

**ప్రణయ యజ్ఞమందు'** – అనుట శాస్త్ర ఫక్కీ.

**'ప్రణయ యజ్ఞమందు ప్రాణాలను యజించి'** – అనుట ఇతిహాస ఫణితి.

**'సోమ పాన మగుదు సుదతి పెదవి'** – అనుట కావ్యభంగి.

కనుక భీమన్న 'రాగవాసిష్ఠం' త్రివిధ లక్షణాలు కలిగి మనస్సు కెక్కునట్లు సుందరమై ఉంది. ఇకపోతే భీమన్న కావ్య వర్ణన ఇలా ఉంటుంది. సందర్భాను సారంగా పాత్రోచితంగా భావపూరితంగా సుభమైన సుకుమార సుందరమైన అర్థాన్ని ఇచ్చేవిగా ఉంటాయి.

---

1. 'రాగవాసిష్ఠం' రూపకం ౨౧ వ పుట    2. 'రాగవాసిష్ఠం' రూపకం ౬౨ వ పుట

## వర్ణనలు :

బోయి భీమన్న వర్ణనలు పరిమితములై పటుత్వం గలవై వుంటాయి. భీమన్న దృష్టి ప్రధానంగా రసాద్వైతం. ఇదే వారి తాత్త్విక చింతనకు మూలం. ఉదాహరణకు కొన్ని–

**" నీ పాద నిర్మల నీరాజములలోన**
**ప్రకృతి చైతన్యమే పల్లవించే"** [1]

**" ముఖబింబమందు సంపుల్లమై బ్రహ్మ తే**
**జము సహస్రాబ్జ తేజమున వెలుగు"** [2]

ఇలా ప్రేమను ప్రకృతి పరంగా భీమన్న వర్ణించి స్త్రీ, పురుష ప్రేమ సమానమని, ఇరువురి సమానత్వాన్ని అద్వైతమని ఈ 'రాగవాసిష్ఠం' రూపకం ద్వారా తన తాత్త్విక ధోరణి తెలిపాడు.

## ఆదికవి వాల్మీకి ( రూపకం):

ఈ రూపకం వ్రాసింది మహాకవి బోయి భీమన్న. ఇతను స్వయంగా జీవితం నుండి స్పందన పొందిన రచయిత. ఆ స్పందనకు ఔచిత్యం, వివేకం మేళవించి మరో నలుగురికి ప్రేరణ యిస్తాడు. ఇదే విషయాన్ని పాశ్చాత్య రచయిత క్రిస్టోఫర్ కాడ్వెల్ ఇలా అన్నారు.

"Poetic life is a flower on the social plant developing and growing with the plant as a whole, because it sucks the same sap and performs an office that benefits the whole plan"[3] .

---

౧. ''రాగవాసిష్ఠం' రూపకం - ౩౦వ పుట   ౨). 'రాగవాసిష్ఠం' రూపకం - 4౮ వ పుట
౩. 'ఆంధ్రప్రభ' ౯-4-౧౯౯౩ సాహితీ గవాక్షం లో

కవికి ఎంతటి స్వతంత్ర భావాలున్నా దేశకాల పరిస్థితుల ప్రభావం అతనిపై పడక తప్పదు. అదే బోయి భీమన్న కూ జరిగింది. దాని ప్రభావమే 'ఆదికవి వాల్మీకి' రూపక రచన.

ఇది సాంఘిక ఇతివృత్తం గల పౌరాణిక నాటకం. అస్పృశ్యులు ఆర్యులే అని ఋజావు చేయడం కోసం వ్రాసిన రూపకం ఇది. మన వాల్మీకి, వ్యాసులు పూజ్యాలు. వీరు గొప్ప జాతీయ కవులు. వారి సంబంధితులు అస్పృశ్యులు గానూ, దళితులుగాను చూడటం అవివేకం. ఈ సాంఘిక అసమానత తొలగాలి. ఇదే ఈ నాటక లక్ష్యమని మనకు ఈ రూపకం చదవడం వల్లనూ చూడటం వల్లనూ తెలుస్తుంది.

ఈ రూపకం ద్వారా తర్కం, తత్త్వం మొదలైనవి ప్రవేశపెట్టబడినై. అంటే భీమన్న జ్ఞానమార్గం ఈ రూపకం ద్వారానే చూపాడు. జ్ఞానమంటే భీమన్న దృష్టిలో Purity. Purity it self జ్ఞానం. మనోవాక్కాయకర్మల్లో ఏ కల్మషం అంటని శుద్ధమార్గం ఏదో అది జ్ఞాన మార్గం.

**రసం :**

బోయి భీమన్న ఈ నాటకంలోనూ కులతత్త్వ వాదులు సృష్టించిన అపవాదాలను ఖండించడం ఆశయంగా పెట్టుకున్నాడు. ఈ నాటకం చదువుతున్నప్పుడు ఇందులోని పద్యాలు పాటలు మనకు రసానుభూతి కలుగజేస్తాయి.

ఉదహరణకు :

" రాముడే పురుషుడు సీత ప్రకృతియౌను
ప్రణయ ధర్మాల మధ్య పోరాట మిద్ది" [1]

1. 'ఆదికవి వాల్మీకి' - రూపకంలో

అన్నపుడు భీమన్న ప్రకృతిని సౌందర్యవంతంగా, భగవతీ స్వరూపంగా భావించి ధ్యానించడం వల్ల 'జ్ఞాత – జ్ఞేయము – జ్ఞానము' అనే త్రిపుటి ఏర్పడి అద్వైత భావానికి వీరు కొంత దూరమేమెూ అనుకునే అవకాశం కలిగించింది. భావుకులైన కవిగా వీరు ప్రకృతిలోని ప్రతి చిన్న అంశంలోనూ అందాన్ని చూచి తన్మయం పొందాడు.

ఈ రూపకంలో ఓ చోట భీమన్న ఇలా అంటాడు.

**" శోకమునకు ఇంత లోకమేలెడు శక్తి**
**ఎవరి వలన కలిగే ఏల కలిగే? "** [1]

కనుక సృజనాత్మక రచన చేసే కవి అంతరంగంలో అద్వైతం పట్ల కొంత ఆమోదం ఉన్నప్పటికీ ఆచరణలో ద్వైతి కాక తప్పదని చెప్పవచ్చు. రసవత్తరమైన రచన సాగించాలనుకునే కవి వైరాగ్యాన్ని, మిథ్యావాదాన్ని ఆశ్రయించడం ఆచరణీయము కాదనుకోవచ్చు. కనుక బోయి భీమన్న అద్వైత వాసన ఉన్న కవిగా కొంత వరకు విశిష్టాద్వైతానికి దగ్గరవుతున్నారని భావించవచ్చు.

## బాలయోగి (రూపకం):

'సత్యం జ్ఞానం అనంతం' అను ప్రాచీన ఉపనిషత్ వాక్యాన్ని బట్టి సత్యమే భగవత్స్వరూపకం అన్న బోయి భీమన్న నిర్వచనానికి తేడా లేదు. ఆయన ఆధ్యాత్మిక చింతనతో ప్రేరేపితులై ముమ్మిడివరం 'బాలయోగి' యదార్థ జీవితాన్ని ఇతివృత్తంగా తీసుకుని ఏడు అంకాల నాటకంగా వ్రాశాడు భీమన్న. ఈ నాటక పరిశీలనలో ఈ దిగువ అంశాలు మనం గమనిస్తాం.

1. 'ఆదికవి వాల్మీకి' రూపకంలో

**పరిశీలన :**

" ఎవరు వెలుపల? లోపల ఎవరు తలవ?
ఎవరు తనవారు ? పెర వార లెవరు ధరణి ?
తనకు, రాధకు మధ్య బాంధవ్యమేమి ?
ప్రాణ మొకటన్న జ్ఞానమే బ్రహ్మతాను" [1]

ఇలాంటి కవితలెన్నో ఈ రూపకంలో చిందులు తొక్కుతాయి.

ఇందులో భీమన్న ఒక సాంఘిక ప్రయోజనం ఆశించి దానికి తగిన పాత్రలను సృష్టించి లోక స్వభావానికి సరిపడే లాగ వర్ణించాడు. జీవిత సమస్యలనీ ఈ నాటి క్లిష్టపూరిత జీవితాన్నీ అర్థం చేసుకుని ఒక మానవతా సిద్ధాంతానికి పునాది ఏర్పరచుకొని వ్రాస్తున్నవాడు బోయి భీమన్న. అస్పృశ్యత సమస్యనీ రూపుమాపడం కోసం కుల కలహాల పునరావృతాన్ని నివారించడం కోసం వ్రాసిన రూపకాలలో 'బాలయోగి' రచన యదార్థ గాథ.

సాహిత్యం ద్వారా మానవతని చైతన్యవంతం చేయాలనే సిద్ధాంతం బోయి భీమన్నది. నాటక రచన మానవుని మేథస్సుకి (Intellectual), ఉద్రేకాలకు (Emotion) సంబంధించిన ప్రక్రియ.ఈ సందర్భములో జోసెఫ్ కోన్రాడ్ గారి మాట చెబితే సరిపోతుందనుకుంటాను. జోసెఫ్ కోన్రాడ్ మాటలో–

'My task which I am trying to achieve is by the power of the written word to make you hear to make feel as it is before all to make you see that and no more and it is everything." [2].

మానవుల్లో జన్మని బట్టి వర్ణాన్ని బట్టి వచ్చే ఆధిక్యం అశాస్త్రీయమూ కృత్రిమమూ అని ఈ నాటకం పరిశీలన ద్వారా తెలియవస్తుంది. నన్నయ,

---

బాలయోగి' – రూపకం 51 వ పుట  2) తక్కెళ్ల బాలరాజ్ వ్యాసాంజలి – 19 వ పుట

తిక్కన, ఎఱ్రన, పోతనాదులంతా యేదో ఒక 'ధర్మం' అవలంబించి ప్రచారం చేసినవారే. అలాగే భీమన్న తాత్త్విక చింతనలోని ధోరణులు సాహిత్యంలో ప్రస్ఫుటమౌతున్నాయి. ధర్మబద్ధమై కనిపిస్తాయి.

పాల్కురికి సోమనాథుడు మల్లిఖార్జున పండితారాధ్యుడు శైవదృష్టి కలవారు. ఇక్కడ బోయి భీమన్న మానవతా దృష్టి కలవాడు గనుక అస్పృశ్యతను నివారించడానికి సాహిత్య కళను ఉపయోగించాడు. ఆ పరంపరలో సర్వజన సమాదరణీయమైన రూపకాన్ని రచించాడు. తాను ఫలానా కులం వాణ్ని అని చెప్పుకుని సంఘంలో ఉత్తముడిగానో నీచుడిగానో మన్నన పొందడమో నిరాకృతి పొందడమో కాదు బుద్ధిమంతుడి లక్షణం. ఉత్తమమైన శీలం సత్రవర్తన వల్ల ఏ వ్యక్తి అయినా ఏ కులం, వాడైనా సంఘంలో మర్యాదను పొందగలడు అని 'బాలయోగి' రూపకం ద్వారా తెలియవస్తుంది.

సమాజంలో కులం కారణంగా మానవత్వం మంట కలిసిందని చిత్రించిన భీమన్న మానవులు దానవులుగా మారవలదనే భావాన్ని కూడ ఈ రూపకంలో సూచించాడు.

**కవితా నిర్మాణం :**

**''కరుణతో సాత్సల్య మధువును**
**కురిసి దాహము తీర్చినావు**
**నెరలు తీసిన నరుని గుండెల**
**చెరకు తోటలు పెంచినావు**
**తండ్రివో ఈ ధరణి కంతకు**
**తల్లివో ఈ చల్లదముకు**

ఎవరవో నీ వెవరవో

ఎంత మంగళమూర్తివో!'' [1]

ఇలాంటి భావ ప్రకటనలు భాషకు సంబంధించిన కొత్త నుడికారాలు కొత్త సాహిత్య సంప్రదాయాన్ని కలిగిన కవితా నిర్మాణాలు 'బాలయోగి' రూపకంలో ఉన్నాయి.

కథానాయకుడైన బాలయోగి గొప్ప ధర్మ నిష్ఠాపరుడైనప్పటికి కూడా సాధారణ వ్యక్తి అతను. అన్నింటికంటే పెద్దదైన భూతదయను, ప్రేమను అతనిలో చూస్తాం. ఇలాంటి ఉత్తమమైన గుణాలున్నాయి బాలయోగి రూపకంలో. అందుకే ఇది చాలా తాత్త్వికమైన ధ్వని పూర్వకమైన కావ్యం.

'బాలయోగి' – రూపకం 4 వ పుట

# ఐతిహాసిక రూపకాలలోని ఇతివృత్తం

| రాగవాసిష్ఠం | ఆది కవి వాల్మీకి | బాలయోగి |
|---|---|---|
| అరుంధతి ఒక చండాలిక. వసిష్ఠుడు ఒక బ్రాహ్మణుడు. ఈ ఇరువురి ప్రేమ వివాహమే రాగవాసిష్ఠం. | వాల్మీకి ఆదికవి. ఇతను బ్రహ్మపుత్రుడు. తండ్రిచే శాపగ్రస్తుడై చండాలునిగా పుడతాడు. నారదముని ప్రభోదంతో మహాభక్తుడవుతాడు. ఆత్మజ్ఞానంతో అచంచలమైన తపోదీక్షతో భగవచ్చరిత్ర వ్రాస్తాడు. లోక మాత సీతాదేవినే సాక గలిగి జన్మను చరితార్థం చేసుకుంటాడు. ఇందలి కథ సీతావనవాసం మొదలు కుశలవుల జననంవరకుసాగుతుంది. | ఇది ఒక సమాకాలీన పుణ్య పురుషుని ఐతిహాసిక జీవిత కథ. ఆధ్యాత్మిక చింతన గల 12 సం.ల బాలయోగి కథ. దీనిని 1964 లో రచించాడు బోయి భీమన్న. |
| వసిష్ఠుడు అరుంధతిని ప్రేమించివర్ణబాహ్యరాలు అనితెలిశాక కొంచెందూరమై పోతారు.విరహం భరించలేక వసిష్ఠుడు పశ్చాత్తాపపడి మళ్ళీ ఆమె దగ్గరకు వస్తాడు. అప్పుడు అరుంధతి తపస్సులో ఉంటుంది. ఆమె తపోగ్ని తాపానికి వర్షాలు పడక కరువులేర్పడతాయి. ప్రజలు తిండి తిప్పలు లేక నానా ఇబ్బందులకు గురియగుతారు. | ఇది పురాణ కథ. ఇందులో తక్కువ కులం వాడైన వాల్మీకి పొందిన జీవిత అనుభూతి ఏమిటో తెలియవస్తుంది. | బాలయోగి మొదటి పేరు సుబ్బారావు. ఇతని తండ్రి గంగయ్య. ఇతడు ఒక మాలవాడు. 12 సం.ల పిల్లవాడైన బాలయోగి వెంకన్నశెట్టి దగ్గర పాలేరుతనం చేస్తుంటాడు. ఇతను కారణజన్ముడని వెర్రిమ్మకు తెలియదు. పశువులను సరిగా కాయడం లేదని తన భర్త వెంకన్న శెట్టి ముందర చీవాట్లు పెట్టి మందలిసుంది. |
| చివరకు వాళ్ళంతా | ఆదికవి వాల్మీకి [illegible] | |

కలసి బ్రహ్మదేవుని వేడుకుంటారు. ఆయన అప్పుడు శంకరుని కలవమని ప్రజలను అంటాడు. వాళ్ళు శంకరుని కలవడానికి కైలాసం వెళ్ళుతారు. అక్కడ శివుడు ఉండడు. అరుంధతి ఆశ్రమానికి వచ్చి వుంటాడు. అంతా అక్కడికి వస్తారు. అక్కడ శివుడు అరుంధతీ వసిష్ఠుల వివాహం చేయ తలపడగా ప్రాచీనుడు మొదలగు పూర్వాచార నిష్ఠులు అడ్డు పడతారు. వారికి బుద్ధి చెప్పి అరుంధతీ వసిష్ఠుల వర్ణాంతర వివాహం జరిపిస్తాడు శివుడు.

ఇలా కథ సుఖాంత మవుతుంది.

జీవితం కుల సామరస్యాన్ని మనుష్య ధర్మా మర్మాన్ని ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని తెలియ చేస్తాయి. విశ్వజనీనమైన రామాయణ రచనకు మూల పురుషుడైన వాల్మీకి జీవిత చరిత్ర కూడా విశ్వజనీనమే.

కుల ప్రశక్తి కలిగిన ఈ నాటకంలో వాల్మీకి అస్పృశ్యుడుగా ఎక్కడా పరిగణింపబడలేదు. మరి ఇప్పుడెందుకు ఈ కులాలు అనే ప్రశ్నతోనే వాల్మీకి జీవిత చరిత్ర రచించి బోయి భీమన్న చరితర్థుడైనాడని చెప్పవచ్చును.

బంగారం గారు అనే మహా ఛాచార శ్రీమంతుడు అతని పాలేరు పోతురాజా ను ఎల్లవేళలా అవమానిస్తూ ఉంటాడు.

పంటతల్లి అను ఓ పది సం.ల బాలిక బాయోగితో స్నేహశీలిగా ఉంటుంది. అతని కష్టాలను, దౌర్జన్యాలను గురియైన సంఘటనలు చూస్తూ విచారిస్తుంటుంది. బాదలకోర్చి కూడ బాలయోగి లోకానికి భక్తి భావం అందిస్తాడు.

ఒకనాడు సర్వమానవ శ్రేయోవాది వేదాంతి అయిన స్వాముల వారు బాలయోగిని దర్శించి అతని దీక్షను తపస్సును తెలుసుకుంటాడు. ఈ మాలపిల్లవాడు కారణ జన్ముడని, ఒక ప్రయోజనం కోసం

| | | |
|---|---|---|
| | | కైలాసం నుండి భూ లోకానికి పంపబడిన ప్రత్యేక రాయబారి అంటాడు. యోగ నిద్రలో నున్న బాలయోగికి చేతులు జోడించి నమస్కరిస్తాడు స్వాముల వారు.<br>ఓం నమశ్శివాయ నమోబాలయోగీంద్రాయ ఆత్మోద్ధారకాయ నమో నమః అనగానే ప్రజలంతా చేతులు మోడ్చి తన్మయులై స్తుతించసాగుతారు.<br>వ్యాసుడు, ధ్రువుడు, మార్కండేయుడు వంటి ఏకొద్ది మందో కనిపిస్తారు పురాణాలలో బాలయోగి సరసన నిలువ గలిగిన వారు అని బోయి భీమన్న ఈ రూపకం ద్వారా బాలయోగి జీవిత చరిత్ర తెలియజేశాడు. |

రచయిత బోయి భీమన్న ఈ రూపకాలు ద్వారా జాతీయతా దృష్టి తత్త్వాని తెలియజేశాడు. ముఖ్యంగా ఈ నాటకాల ద్వారా గమనించదగిన దేమిటంటే కులం కాదు - గుణం ప్రధానం అనే విషయం అందరు గుర్తించాలి. ఇదే భీమన్న ఆశయం.

## వ్యంగ్యాత్మక రూపకాలు :

నవరసాల్లో ఒకటయిన హాస్యరసం చాలా ముఖ్య స్థానాన్ని వహిస్తుంది. ఆనందకరంగా ఎంతో స్పష్టంగా మోతాదు మించని చురుకలతో హాస్యాన్ని పండించేదే వ్యంగ్యాత్మకం. బాధ కలుగకుండా నవ్వు పుట్టించే క్రియయే వ్యంగ్యం. ఇలాంటి వ్యంగ్యాత్మక రూపకాలు బోయి భీమన్న రచించాడు. అట్టి వాటిలో 'పడిపోతున్న అడ్డు గోడలు', 'ప్రగతి' మొదలగు రూపకాలు ప్రసిద్ధాలు.

ఇవి హాస్య రస స్ఫూర్తిని బాగా కలిగినవి. భాషా పటిమ, భావ గాంభీర్యం, రచనా చమత్కృతి, ఊహావిశేషం వీటి పరిశీలనలో ప్రకటితమవుతాయి.

### <u>పడిపోతున్న అడ్డు గోడలు (రూపకం) :</u>

బోయి భీమన్న ఈ రూపకంలో వాడిన శైలి విలక్షణమైనది. ధ్వని, వక్రోక్తి, అవహేళన, వ్యంగం ఈ 'పడిపోతున్న అడ్డుగోడలు' రూపకంలో చోటు చేసుకున్నాయి.

కళ్లు తెరిపించే వాస్తవాలతో పాటు ఆలోచింపజేసే కల్పనలూ చేశాడు. భీమన్న స్వయంకృషితో పెంపొందించుకున్న జ్ఞానం, హేతుబద్ధమైన ఆలోచన ఈ రూపకానికి బలమిస్తాయి.

ఇండియన్ ఎక్స్‌ప్రెస్ దిన పత్రిక, 1971 లో "The Rebel" అనే శీర్షిక క్రింద భీమన్నపై వచ్చిన వాక్యాలు ఇక్కడ ఉదాహరిస్తాను. వీరి రచనా గొప్పదనం మనకు ఆ వాక్యాల ద్వారా తెలుస్తుంది.

"Mr. Boyi Bhimanna, a drop of that ageless agony of backwardness, is a rebel with a considerable stock of literature to make him agreeable universally. Not that the path of self-upleft from a down-trodden position should always smack of rebellion but it happens so sometimes with some persons."[1].

ప్రపంచ మానవుని సంక్షేమానికి తహతహలాడిన బోయి భీమన్న అవగాహనయే ఆ సంగ్రహణం.

బోయి భీమన్న 'పడిపోతున్న అడ్డ గోడలు' యొక్క పీఠిక ఎంత విజ్ఞాన ప్రదంగా ఉన్నదో నాటిక అంత రసోదచితంగా ఉన్నది. ఇది అందరూ చదువదగింది.

## విశ్లేషణ శిల్పం :

యథార్థ చిత్రీకరణకు ప్రాధాన్యమిచ్చి సాహితీప్రయోజనాన్ని సామాజిక నైపుణ్యాన్ని రంగరించి రచించినట్లు ఉంది . జీవితానికి అతుక్కుపోయే పాత్రలతో నాటకీయతకు సరియైన స్వరూపం ఇందులో కనిపిస్తుంది.

కథానాయిక వ్యంగ్యధోరణిలో విశ్లేషణ అద్భుతంగా ఉంటుంది.

1. 'పాలేరు' నుండి పద్మశ్రీ వరకు - 684 వ పుట

ఇందులో తెలుగు భాషలోవున్న సొగసు, శక్తి, గొప్పతనం రూపకంలోని సంభాషణ ద్వారా స్పష్టమౌతుంది.

**వాస్తవికత :**

కవి కాంచని చోటు కవి కాంచునట్లు సమాజాన్ని కాచి వడపోసి సారాన్నంతా ఈ రూపకంలో పొందుపరిచారు. ఇందులో హాస్య, వ్యంగ్యం దండిగా పండిస్తూ ఒక ప్రత్యేక శైలిలో కొనసాగించారు. గురజాడవారి 'కన్యాశుల్కం' లోని పాత్రలకున్న స్వభావ, కొంత కనిపిస్తుంది. అంటే కన్యాశుల్కంలోని పాత్రలు మనకు ఎక్కడో తారసపడినట్లు ఎలా కనబడుతాయో అలాగే బోయి భీమన్న రచనలోని పాత్రలు కూడా కనిపిస్తాయి.

**కావ్యం :**

వాక్యాన్ని రసమయంగా చెప్తే కావ్యం అవుతుంది. అందుకే ఇదో కావ్యం అనబడుతుంది. ఇందులో కవలసినంత కవిత్యం ఉంది. మంచి రచన చదివే పాఠకుడికి ఎలాంటి తృప్తి లభిస్తుందో ఆ తృప్తి ఈ రూపకంలోనూ కనిపిస్తుంది ముఖ్యంగా ఇందులో 'మనం' కనబడుతాం. 'మన వాళ్ళు' కనబడుతారు.

**<u>ప్రగతి (రూపకం):</u>**

బోయి భీమన్న రచించిన వ్యంగ్యాత్మక రూపకం ' ప్రగతి ' ఇది అతని మౌలికతను వ్యక్తం చేస్తుంది. భీమన్న చూపిన కావ్యానుశీలన విధానం తత్త్వగంభీరం గొప్ప కళాకుశలం. ప్రసిద్ధ పాశ్చాత్య ప్రతీకవాద ' బోద్లేర్ ' భావనలో చెప్పినప్పుడు - "The artist plays on the immense key board of the correspondance or the entire visible universe

appears as but a store house of images and signs to which the imagination will give a relative place and value, it is a sort of pasturage which the imagination must digest and transform ".[1]

బోయి భీమన్న కూడా ' బోద్లేర్ ' భావనతో ఏకీభవిస్తున్నట్లు అతని రచనల ద్వారా తెలుస్తుంది. బోయి భీమన్నకు సృజనాత్మక యుగాన్ని సృష్టించే లక్ష్యం తెలుసు. తిట్టి చెప్పే తెగువ తెలుసు, తట్టి చెప్పే తెలివి తెలుసు.

**" సత్య మద్వైతమని పల్కె శంకరుండు**
**అగును నిజము రసాద్వైత మందు నేను**
**నిజమో సత్యమో, సత్యమె నిజమో తెలిపి**
**అమృత పదవిని సమకూర్చునదియె ప్రగతి "** [2]

ప్రగతి గురించిన భీమన్న దర్శనమిది. సర్వ సమత, దారిద్ర్య నిర్మూలన, అవిద్యా తొలగింపు, అందరికీ తిండి, ఎల్లరకూ పని ఇదీ బోయి భీమన్న తాత్త్వికత.

మానవులకు గల సర్వ శక్తులలోని భావనా శక్తి మహాద్భుతమైన శక్తి. ఆ శక్తి కవికి లభిస్తుంది. అందువలననే భీమన్న సృజనాత్మకంగా భాసించగలడు. నిరాశా నిస్పృహలతో కృంగి పోయిన వారికి ఆశా జ్యోతిని అందివగలడు. ఆ ఆశయంతోనే భీమన్న 1979లో 'ప్రగతి' రూపకాన్ని వర్తమాన పరిస్థితులకు అద్దం పట్టిన విధంగా సృష్టించాడు.

బోయి భీమన్నన యొక్క తాత్త్విక సిద్ధాంతం ఒక 'ప్రగతి' రూపకంలోనే కాదు, అన్ని రచనల్లోనూ అంతర్వాహినిగా ప్రవహిస్తున్నది. ముఖ్యంగా

---

1. 'యుగద్రష్ట' సంపాదకుడు ఆచార్య తిరుమల – 107 వ పు 2) 'ప్రగతి పథం'–పీఠిక 1వ పుట

వ్యంగ్య రూపకం. నవరసభరితమైంది కూడా. ఈ నాటకంలో నాయిక పేరు ప్రగతి. నాయకుడు మార్గమిత్ర. దేశ ప్రగతికి ఏదో చేస్తున్నామనుకొనే సామ్యవాద సిద్ధాంతాలు వల్లించే నాయకులకు, ఉప నాయకులకు ఈ నాటకం ఒక కనువిప్పుగా నిలుస్తుంది. ఇందులో సిద్ధాంత పరమైన మాటలు, సందేశ పూరితమైన పాటలు ఉన్నాయి. ఒకరి జీవితానిక ప్రతిబింబం ఈ రూపకంలోని ప్రతిపాత్ర.

## పాటల శైలి :

బోయి భీమన్న పాటలు వ్రాయడంలో సిద్ధహస్తులు. ఈ నాటకంలోని పాటలు కడు కమనీయము మరియు రమణీయమూనూ.

ఉదాహరణకు :

**"ఎదలో ప్రగతి ప్రతిష్ఠించుకోరా**
**హే! మానవుడా! ప్రకృతి పురుషుడా**
**కులమూ, మతమూ వర్గం, జాతి**
**కృతకం రా! నీ స్థితికి తగవురా !"[1]**

–అని అంటాడు బోయి భీమన్న. ఇందులో ఉపనిషత్తు సారం, రాజకీయ సిద్ధాంతం, మత ధర్మాల క్రోడికరణ ఉంది. అలాగే దృశ్యం రెండులో పాట ఉంది. అది ఎంత హృద్యమంగా ఉందో గమనించండి.

1 ప్రగతి – నాటకం 1 వ పుట (దృశ్యం ఒకటి)

''రాతి నుంచి రమణీయ శిల్పమా
మట్టి నుంచి మాణిక్య దీపమా
ఎవరే, ఎవరే మీరు
ఇంత శోభ నెట తెచ్చారు?

ఇకపోతే బోయి భీమన్నకు సినిమా సాహిత్యంపై తృప్తి లేదు. ఈ విషయం తన 'ప్రగతి' రూపకం ద్వారా తెలుస్తుంది. మూడో దృశ్యంలో ఆ వియాన్ని తెలియజేసే పాట వ్రాశాడు. చలన చిత్రాల సాహిత్యాలపై తన అసంతృప్తిని వ్యక్తం చేయడానికే వ్రాసినట్టుగా ఉంది. పరిశీలించండి.-

''జారిందే పైట కొంగు జింగుపిల్ల
ఊడిందే రైకముడి ఊసరవెల్లి
నీ కళ్ల నేరేడు పళ్లు
నీ వొళ్లు గులాబి ముళ్లు''

అంటాడు బోయి భీమన్న జానపద రీతిలో. సినీ సాహిత్యం చాలా వరకు మహిళా లోకాన్ని అవహాస్యం చేస్తుందని స్పష్టీకరించాడు.

ఇక నాలుగవ దృశ్యం లోని పాట చూడండి -

'కలలోనే జీవించావా
కలల నుంచి మేల్కొవా
మనిషివి కావా! మధువులు తేవా
జాతికి జీవన మీవా !'

–ఇలా పాట ద్వారా నిద్రాణమై నిర్వీర్యమైపోయిన జాతిని మేల్కొల్పుతాడు భీమన్న. కథానాయిక 'ప్రగతి' పాట సాగే కొలది లేస్తూ తేరుకుంటూ ఉత్సాహం పొందుతుంది. పాటల ద్వారా సమాజాన్ని చైతన్యవంతం చేయడం భీమన్న ఆశయం. ఇది ఈ రూపకం ద్వారా గ్రహిస్తాం.

ఈ రూపకంలోని ఐదవ దృశ్యంలో కథానాయిక 'ప్రగతి'ని వంచించి, త్రాగించి, మతిలేనిదానిగా చేసిన సందర్భములో పాడిన పాట :

''యుగ యుగాల నుంచీ
ప్రగతి పథం ఇదేనోయ్
వరవరాల జీర్ణించిన దోషం
నైతిక హత్యా విన్యాసం
కృత యుగాదిగా గుడుగుడు గుంచం
క్షత గాత్రం ఈ ప్రగతి పథం''.

–అని భారతీయ సంస్కృతి ప్రపంచానికి దారి జూపిందని విర్రవీగే వారిపై తీవ్రమైన విసుర్లు విసురుతాడు. ఈ సృజనాత్మకమైన 'ప్రగతి' నాటకం చివరలో కవి తత్త్వవేత్తగా మానవ కళ్యాణానికి ఆశీస్సులందిస్తాడు.

ప్రగతికి కవిరా, కవికి ప్రగతిరా
పరమ శ్రేయో దంపతిరా
కవి భావనయే ప్రగతిరా
ప్రగతి విలాసమే జగతిరా

........................

మనిషికి మార్గం మానవత, నీ
మనుగడ లక్ష్యం పరమైశ్వర్యం''

-ఇలా పాడించి కవి వేదాంతి కాకుండా మహాకవి కాలేడన్న సత్యాన్ని వెల్లడించాడు.

ఈ నాటకంలో నాయిక 'ప్రగతి' అన్ని విద్యలను కళలను నేర్చింది. భూస్వామికం, పారిశ్రామికం, వ్యాపారికం వంటి వ్యవస్థలు 'ప్రగతిని' ఎన్ని అవస్థలు పెడుతూ వస్తున్నాయో సూత్రప్రాయంగా ఈ రూపకంలోని ఇతివృత్తంలో సూచించబడింది. చివరకు అన్ని అవస్థలనూ దాటుకుంటూ నాయిక 'ప్రగతి' ముందుకు పోతుంది.

## నాటకంలో వ్యంగ్యం :

ఇందులో పాత్రలన్నీ కల్పితాలు. అయినా సమాజంలోని వ్యక్తుల వ్యక్తిత్వాలను స్ఫురింపజేస్తాయి. చూడండి -

1. కథానాయిక 'ప్రగతి' చేత ఒక సందర్భములో -

**'ఆడ పిల్లల వెంటబడి వేధించే రౌడీ గాడిదలకు**

**గుండెలుండవు'** అని పలికిస్తాడు భీమన్న.

2. 'ఎన్ని పద్మవ్యూహాలైనా ఒక్క ధర్మరాజు అబద్ధానికి సాటిరావు' అంటే వ్యంగ్యంగా భారతమంతా బొంకు అనే కదా విమర్శ. బోయి భీమన్న మంచిని ఎక్కడా విమర్శించలేదు.

3. కృష్ణార్పణం సుబ్బుతో అంటాడు - 'లంకేశం గారికి లంకవేంత కావాలయ్యా'. వ్యంగ్యంగా లంచం యిస్తే తప్ప పనులు జరగడం లేదని భావం.

4. ప్రచార్ అంటాడు ప్రగతి చేతి రేఖలు పరిశీలించి – ' నీ చేతిలో లోక విప్లవం వుంది' అంటాడు.

5. 24 వ పుట యందు మరీ విచిత్రమైన వ్యంగ్య పదజాలం ప్రయోగించాడు రచయిత. శ్రీధాం ప్రగతితో అన్నమాట – ''నీకేం భయం లేదు. ఏ లెవెల్‌లో గావాలంటే ఆ లెవెల్లో పెడతాను. నాక్కావలసింది మెరిట్.''

6. దొర : నేను సింహాన్నైతే, నీవు లేడి పిల్లవవుతావా

ప్రగతి : జాతి భేదం లేదు గానీ లక్ష్య భేదం వుంది.

7. పోలీసు ఆఫీసులో బుద్ధమూర్తితో ప్రగతి వ్యంగ్యంగా అన్నమాట-

''నన్ను పోనివ్వండి. నాకున్నదంతా భయమే, నాకీ లోకంలో స్థానం లేదు. పైగా మీ ఆధీనంలో,'' రక్షిస్తాననే వారే భక్షిస్తారనే భావన ఏమో రచయితది.

8. ''ఓ కులం కాని కొండముచ్చు వెధవతో లేచిపోతే మేమంతా ఏం కావాలి?'' అని దొర బాబు ప్రగతితో అన్నమాట.

ఇలా సంభాషణలు రసవత్తరంగా రచించడంలో బోయి భీమన్నకు గొప్ప కళ ఉంది. ప్రేమకూ, కామానికీ ఉద్ధతికీ, పతనానికి సిద్ధాంతానికి – ఆచరణకు రాజకీయానికీ, మానవతకూ మధ్య ఎంత వ్యత్యాసముందో ' ప్రగతి' దృశ్యరూపకంలో రూపొందించి నేటి రాజకీయ సాంఘిక దుర్భర పరిస్థితుల్ని క్షాళనం చేస్తాడు బోయి భీమన్న.

# వ్యంగ్యాత్మక రూపకాలలోని ఇతివృత్తం

## పడిపోతున్న అడ్డు గోడలు

ఈ రూపకాన్ని 1958 లో ప్రచురించాడు. మహాకవి బోయి భీమన్న రచించిన ఈ రూపకం వ్యంగ్యాత్మకం. ఇందు ఒక దళిత బాలిక తన తోటి బ్రాహ్మణ విద్యార్థి ఇంటికి స్నేహ పూర్వకంగా వెళుతుంది.

అక్కడ ఆ దళిత బాలిక పొందిన అనుభూతిని వ్యంగ్యంగాను హాస్యంగానూ వ్యాఖ్యానిస్తుంది.

కులం పట్టింపు అర్థ రహితమని, మూఢ నమ్మకమని, అనాగరికమని, ఇది తొలగిపోవాలని ప్రబోధం చేయ బడుతుంది.

నాటిక చివరలో వర్ణాంతర వివాహ పద్ధతిని ప్రవేశపెడుతూ మతాచారం ముఖ్యంకాదు నైతిక జీవనం ముఖ్యమనే తాత్త్విక సూత్రీకరణ చేస్తాడు భీమన్న.

పాలేరు, కూలిరాజా, పైరుపాట, రాగవాసిష్ఠం, బాలయోగి, ఆదికవి వాల్మీకి మొదలగు రూపకాలలో నున్న కథావస్తువు ఈ 'పడిపోతున్న

## ప్రగతి

ఈ రూపకాన్ని 1979లో ప్రచురించాడు. మహాకవి బోయి భీమన్న రస భరిత పాత్ర చిత్రణ గావించిన దృశ్యమాలిక 'ప్రగతి' నాటకం.

ఈ రూపకంలోని కథానాయిక పేరు ప్రగతి. నాయకుడు మార్గమిత్ర. ఇతనొక కవి. నాయిక ప్రగతి నృత్యగాన కళా విద్యార్థిని.

లంకేశం అనే ఓ పెద్ద మనిషి ఈమెను వంచించడానికి ప్రయత్నం చేస్తాడు. ఆమెను లొంగదీసుకోవడానికి 'కృష్ణార్పణం' అను పారిశ్రామిక వేత్త, అబ్బులు, సుబ్బులు అనే వ్యక్తుల ద్వారా ప్రగతిని మాయచేసి బంధిస్తాడు. ఈ సంఘటనకు పూర్వం 'ప్రచార్' అను ఫోటోల వ్యాపారి ప్రగతిని వశపర్చుకోడానికి ఎత్తులు వేస్తాడు. అదే విధంగా శ్రీధాం మరియు దొరబాబు అను వాళ్ళు కూడా బలవంతం చేస్తారు. ఆమె అందరినీ ప్రతిఘటిస్తుంది. ఎన్నో శ్రమల కోర్చి తన శీలాన్ని రక్షించు కుంటుంది.

| | |
|---|---|
| అడ్డుగోడలు' రూపకం లోనూ వుంది. చివరకు కథ సుఖాంతమవుతుంది. | ప్రగతి కథానాయిక చివరలో బుద్ధమూర్తి అను పోలీసు అధికారి సహాయంతో 'మార్గమిత్ర' ను వివాహం చేసుకుంటుంది. ఇలా నాయికా నాయకుల వార్ణాంతర వివాహంతో కథ సుఖాంతమవుతుంది. |

కళా ప్రపూర్ణ బోయి భీమన్న ఈ రూపకాలు ద్వారా స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కలిగించాలని కోరారు., వాటిని రక్షించుకోవడానికి అవసరమైన విద్యలన్నింటినీ నేర్పించాలని కుస్తీ, కరాటే, సాము మొదలగు విద్యలను కూడా అలవర్చుకోవాలని సూచించాడు. దీనిని అందరూ గుర్తించాలి. ఇదే బోయి భీమన్న కోరేది.

## ప్రతీకాత్మక రూపకాలు :

కవి నిత్య సత్యాన్వేషి. కవి దేనినైనా చూడగలడు. దేనినైనా సృష్టించగలడు. దేశ చరిత్ర గతిని మార్చాలన్నా సాంఘిక రాజకీయ చైతన్యానికి స్ఫూర్తిని కలిగించాలన్నా కవులే కారణం. కనుక దేశ పురోగతికి మూల పురుషులు కవులే. ఇదే కోవకు చెందినవారు బోయి భీమన్న.

తాను ఊహ తెలిసినప్పటి నుండి అనుభవించిన సాంఘిక సమస్యల్ని అతని కలం ద్వారా సృజనాత్మక రచనలు గావిస్తున్నాడు. ముఖ్యంగా శిష్ట వ్యవహారికాన్ని తన రచనలలో చూపాడు.

బోయి భీమన్న ప్రత్యేకంగా ఏదేని ఒక వస్తువును లేదా మానవుని గుణగుణాలను ఎన్నుకొని దానికి ప్రతీకగా పాత్రల్ని సృష్టించి రచించడంలో ప్రసిద్ధి పొందినాడు. ఇలాంటి రచనలను **ప్రతీకాత్మక రచనలు** అంటారు. ప్రతీకాత్మక రచనలలోని పాత్రల స్వభావం సమాజంలోని వ్యక్తుల స్వభావాన్ని తెలియజేస్తాయి. ఇన్‌డైరెక్ట్‌వ్‌గా సూచిస్తున్న కథా సంవిధానం ప్రతీకలుగా కనిపించే ఆ పాత్రలు వ్యక్తుల స్వరూపాలుగా కనిపిస్తాయి.

వీరి ప్రతీకాత్మక రూపకాలలో ముఖ్యమైనవి మరియు ప్రసిద్ధి చెందినవి 'అసూయ', 'మానవుని మరొక మజిలీ', 'చిత్ర కళా ప్రదర్శనం' మొదలైన రూపకాలు. ముందుగా వీరి ప్రతీకాత్మక రూపకం 'అసూయ' ను పరిశీలిద్దాం.

## అసూయ :

ఈ శతాబ్దం ఆరంభం నుండి తెలుగు సాహిత్యంలో కొత్త ధోరణులు పుట్టుకొచ్చాయి. భావనలో, వ్యక్తీకరణలో, ఆలోచనా విధానంలో మార్పులు వచ్చాయి. అలాగే బోయి భీమన్నలోనూ, అతని రచనలోనూ ప్రతీకాత్మక పద్ధతి కనిపిస్తుంది. వారి ప్రతీ రచన ఒక కళా ఖండం. అందులో ప్రధాన అంశాలలో ప్లాటు, అందమైన భాష, చక్కని నిర్మాణం, కళాత్మక వ్యక్తీకరణ , శిల్పం , ఇవన్నీ ఉన్నాయి.

పాశ్చాత్య రచయిత ' ఆస్కార్ వైల్డ్ అన్నాడు. " form is every thing. It is the secret of life starting with the worship of firm and there is no secret in out that will not be revealed to you " [1].

"Art for art's sake " అనేది కళాకారుడు తనకీ సమాజానికీ పరిష్కరించలేని వైరుధ్యం ఏర్పడిందని అనుకున్నప్పుడు వచ్చే దశ. ఏది ఏమైనా బోయి భీమన్న కళకి పరమ ప్రయోజనం సమాజ శ్రేయస్సే. దానిని దృష్టిలో నిలుపుకొని " అసూయ " అనే రూపకం వ్రాశాడు.

ఈ నాటకాన్ని బోయి భీమన్న '1935 ' లో వ్రాసి 1954 లో ముద్రించాడు. ఇందులో ఆరు రంగాలున్నాయి. పాత్రలు పదికి మించి ఉన్నాయి. ఈ రూపకం పంచతంత్రము లాంటి ' టెక్నిక్' కలిగినది. దీనిలో మనుష్యులతో పాటు ' రాత్రి ' మరియు ' దినం ' అనే సమయాలు, 'భూతాలు', 'తంత్రాలు ' అను నమ్మకాలు మొదలగు సమకాలీన సమాజపు మనష్యుల మనస్తత్వానికి ప్రతీకలుకగ పాత్రలను కల్పించి రచించాడు భీమన్న. ఇది గొప్ప రసాత్మకమైన రూపకం. ఉదాత్త జీవిత తత్త్వ నిరూపణకు భీమన్నను ప్రేరేపించిన అనేక సంఘటనల రూపమే ఈ 'అసూయ' రూపకం.

---

. అభ్యుదయ విమర్శ విశేష సంచిక పుట నెం. 121

## రచనా వైశిష్ట్యం :

ప్రాచీన సాహిత్యంలో బొమ్మలు కథలు చెప్పాయి. బోయి భీమన్న సాహిత్యంలో ' కాలము ' దానికి సంబంధించిన పేర్లు పాత్ర పోషణ చేసి కథను నడుపుతాయి. ఇదే వీరి రచనా వైశిష్ట్యం.

భావాన్ని చెప్పడంలోనే కవి సామర్థ్యం వ్యక్తమవుతుంది. భావం పాతదే అయిన చెప్పే విధానంలో కవి ప్రత్యేకత కనబడుతుంది. కనుకనే బోయి భీమన్న ఈ రూపకంలో –

**'వసంత లతాంత హృదంతరముల పాడలేవే మధురంగా**
**కంఠమేల నీకు పికవూ ?**
**సమస్త వస్తు సమృద్ధి మధ్యనే సౌఖ్యము లేదా నీకు**
**బ్రతుకేలా , ఓ మనిషీ '**

– అని అన్నాడు. శబ్దాలు కానీ వాటి అర్థాలు కానీ కొత్తగా వీరు కల్పించినవి కావు. కానీ శబ్ద ప్రయోగ కౌశలంతో వీరు నవ్యత సాధించారనవచ్చు.

## తెలుగుదనం :

బోయి భీమన్నకు తెలుగుదనం మీద మక్కువెక్కువ. వీరు తెలుగు భాష తియ్యదనాన్ని కవితల్లో చాటి చెప్పాడు. అటువంటి తియ్యని మాధుర్యాన్ని ఎంతటి రసవత్తరంగా చెప్పాడో చూడండి .

**'' ఆ – మావుల మాటున ఆ పూవుల చాటున**
**సంధ్యారాగపు జవనికతో ఎవరే పిల్తురు నిన్ను**
**ఏ కోయిలవో ? ఏ తుమ్మెదవో**
**మోహము తీరని మూగవాణివో ''**

ఈ విధంగా బోయి భీమన్న రూపకాలను పరిశీలించినపుడు అతని రచనా విధానంలో కొత్తదనం తెలుగుదనం మీద అభిమానం తనకున్నట్లు కనబడతాయి. అతని కవిత్వంలో అంతర్లీనంగా కనబడే సత్యాలు అతని తత్త్వ తర్శనాన్ని చూపుతాయి. అ తత్త్వ చింతనయే భీమన్నను దార్శనిక కవిగా నిరూపిస్తుంది.

**శివసోషలిజం :**

బోయి భీమన్న తన రాజకీయ సిద్ధాంతానికి ' శివ సోషలిజం ' అని పేరు పెట్టుకుని , శివుణ్ణి ఆదర్శ సోషలిస్టుగా ప్రతిష్ఠించుకుని సర్వమానవ సమానత్వానికి ఒక సాహితీ రూపకం కల్పించాడు. ఇది ఈ ' అసూయ ' రూపకంలో కనిపిస్తుంది.

ఈ రూపకంలోని కథానాయకుడు విద్యార్థి కాంగ్రెస్ ' రాజా ' ద్వారా రచయిత భీమన్న తన రాజకీయ సిద్ధాంతమైన ' శివ సోషలిజాన్ని ' తెలియజేస్తాడు. తన శివసోషలిజం యొక్కటే మనిషిగా , బాధ్యత గల సామాజికుడిగా ముందుకు నడిపించగలదంటాడు.

<u>మానవుని మరొక మజిలీ :</u>

''ఆంధ్ర దేశంలో ఈ నాడు వెలువడుతున్న సాహిత్యాన్ని పలాయనవాద సాహిత్యం, బూర్జువా సిద్ధాంత పునాది ఆధారంగా వున్న సాహిత్యం , అతి వామపక్ష సిద్ధాంత ప్రేరిత సాహిత్యంగా స్థూల విభజన చేసుకోవచ్చు. ఈ మూడు తరహాలవీ కూడా ప్రయోజనమైన పుష్టికరమైన సాంస్కృతిక రంగాన్ని యేర్పాటు చేయవు. ఎంగెల్స్ అన్నట్టు "Freedom is

the recognition of necessity " ఈ అంశం మీద కాడ్వెల్ చెప్పిన దాంతో ప్రారంభిస్తాను.

" Art is the expression of man's freedom in the world of feeling , just as science is the expression of freedom in the world of sensory perception, because both are consecious of the necessities of their worlds and can change them - art the world of feeling or inners reality seicence the world of phenomena or outer reality"[1]

కాడ్వెల్ అభిప్రాయమే భీమన్న రచనలలో కనిపిస్తుంది. ప్రాబంధికం , భావవాదం , సవిమర్శక వాస్తవికత , సోషలిస్టు వాస్తవికత , ప్రజాస్వామ్య సిద్ధాంతాలు ఇవన్నీ వివిధ కళాత్మక పద్ధతులు. వీటిని తన రూపకాల యందు ప్రకటించాడు. ఈ కోవకు చెందినదే '' మానవుని మరొక మజిలీ '' గేయ రూపకం.

ఈ రూపకాన్ని భీమన్న 1958లో ప్రచురించాడు. ఇది 16 రంగాల సంపూర్ణ గేయ నాటకం. సంపూర్ణ నాటకాన్ని తెలుగులో కేవలం గేయాలతో వ్రాయడం అపూర్వం. ఆటవిక యుగం నుండి అణు యుగం వరకు మానవ సమాజం పొందిన దశలను ప్రతీకాత్మక పాత్రల ద్వారా చిత్రించాడు.

భూలక్ష్మి, క్షేత్రయ్య , భోగయ్య, ఆశావతి, సస్య, మేధానిధి, మొదలైన పేర్లతో భూమి సేద్యం, పంట, పరిశ్రమ, వృత్తులు, ఆశలు, ఆశయాలు, శ్రమ బుద్ధి, త్యాగం, మొదలగు మానవ గుణ కర్మలు పాత్రలుగా స్వీకరించబడి సుందరముగా నడిచిందీ రచన.

అభ్యుదయ భావనకు కవితా సృష్టికి పరమ పారమ్యం ఈ రచన

1. 'అభ్యుదయ' విమర్శ విశేష సంచిక । 37 వ పుట

మాత్ర ఛందస్సులో నడిచిన గేయాలు శ్రవణానందాలు. సూరన్న, చంద్రన్న కార్మికులుగా పాత్ర చిత్రణ చేయడం ఒక అపూర్వ సృష్టి.

## గేయ ఛందస్సు :

ఈ దృశ్య కావ్యము గేయ ఛందస్సులో నడిచినది. అక్కడక్కడ ద్విపదలు కనిపిస్తాయి. ఇందు రచయిత గ్రాంధిక భాషా, వ్యావహారిక భాషా జానపద ప్రయోగం చేశాడు. సరళమైన శైలిలో గేయ నాటకం రచించాడు.

ఉదాహరణకు :-

**"పొగలేని కార్చిచ్చు**
**పొట్టలో నుండగా**
**తనువెల్ల పొగ చూరి**
**తగులబడి పోతోంది"** [1].

అలాగే ఈ రూపకం 172 వ పుటలో ప్రేమ పరమైన గేయ ఛందస్సు సులభ శైలిలో వ్రాశాడు గ్రహించండి.-

**చేతగాని మగవాడవు**
**స్త్రీ జోలికి పోవేలా ?**
**పారస్యము వెరుగలేని**
**జడునికి ప్రియురాలేలా ?**

-ఇలా కవిత మూల్యాల దృష్ట్యా ఈ నాటకం చాలా గొప్పది.

---

నవ్వని నలోక మజిలీ' రూపకం - 22 వ పుట.

## శబ్ద చమత్కారం :

సాహిత్య దర్శనం గల కవులే నవ్యతను సృజించగలరు. యుగాలను ప్రవర్తింపజేయ గలరు. తెలుగు సాహిత్యంలో నాచన సోముడు చమత్కారాన్ని సృష్టి చేశారు. ఇందులో భీమన్న శబ్ద చమత్కారం చేశాడు. చూడండి-

**"దోర్బలమ్ము, దౌర్జన్యముతో**
**తుపాకితో ప్రజను నిగ్రహించే**
**యుగము చింతనతో హిమగిరి చేరెను**
**మిగిలి యున్న దన్యోన్య ప్రేమము"** [1].

– రచయితగా కొత్తగా చెప్పిందేమీ లేదు. కానీ కొంత శ్రద్ధ వహించాడు. సంగీత నృత్య రూపకంగా ప్రదర్శించడానికి వీలుగా శబ్ద చమత్కారం వాడాడు. పాఠకునికైనా, ప్రేక్షకుడికైనా ఆనందానుభూతి కలిగేలా రచించాడు.

ఇదే రూపకంలో మరో భావ కవితను గమనించండి.

**"కుటిల నగరాలు, కుగ్రామాలు**
**కోట్ల లాభాలు కుంచిన బ్రతుకులు**
**పాత పోటీలు పోరాటాలు**
**భూత కాలమ్మై ముగిసినవోయ్"** [2].

"సత్యం ఎంత సుందరమో ధర్మం ఎంత ఆనందకరమో చూడడానికి ప్రగాఢమైన అంతర్దృష్టి అవసరం". అని బోయి భీమన్న తన రూపకం ముందు మాటలో అన్నాడు.

ఇకపోతే భీమన్న నాటకాలు చదవడం వల్ల సాహిత్యానికి సంబంధించిన ఎన్నో విషయాలు తెలియవస్తాయి.

---

1. 'మానవుని మరొక మజిలీ' రూపకం - 185 వ పుట 2. 'మానవుని మరొక మజిలీ' రూపకం - 214 వ పుట

ఉదాహరణకు –

''పుణ్య పురుషుడై మళ్ళీ
పుట్టినాడు మానవుడు
ఆవర్త క్రమము మీఁది
యంతస్తున నేడు
ఇలా కావ్యమున మానవు
డిక నొక ప్రియగీతి
సమాజమున లేదిప్పుడు
స్వపర భేద భీతి''[1].

–అను ''స్వయం ప్రభ'' మాటల ద్వారా ప్రతి మానవుడు విశ్వమావానంద సిద్ధికై ప్రయత్నించాలి. ఇది బోయి భీమన్న తన రచనల ద్వారా కోరుకున్న తాత్త్వికత.

## చిత్ర కళా ప్రదర్శనం (రూపకాల సంపుటి):

బోయి భీమన్న సాహిత్యం విశిష్టమైనదే కాకుండా విభిన్నమైనదీ, వినూత్నమైనిది. ఇతనికి తగు విధమైన ప్రోత్సాహం లేక పోయిన ఒంటరిగా నిర్భయంగా ఒక్కడే సమకాలీన సమాజంలో కవితావరికరాలు సమకూర్చుకుని సాహిత్య క్షేత్రం దుక్కిదున్ని అక్షరాలు చల్లి కావ్యపంటలు పండించి సమకాలీన సమాజంలో పంచిపెట్టాడు. ఇంకా పంచి పెడుతున్నాడు. అందుకే ఆయనలో అంత భిన్నత్వం వైవిధ్యం ఉంటాయి. ఆ వైవిధ్యాన్ని కలిగిన రూపక సంపుటి ''చిత్ర కళా ప్రదర్శనం''. ఇపుడు ఈ రూపకాన్ని పరిశీలన చేద్దాం.

1. 'మానవుని మరొక మజిలీ' రూపకం – 21వ పుట

## పరిశీలన :

ఈ చిత్ర కళా ప్రదర్శనం నృత్య సంగీత రూపక సంపుటి. ఇందు పది రూపకాలు చోటు చేసుకున్నాయి. వాటిలో ప్రాచీన తాత్త్విక గ్రంథాల కథా సారంతో భారతీయ తాత్త్విక చింతన కలిపి భీమన్న మహా అద్భుతంగా రచించాడు, 'చిత్ర కళా ప్రదర్శనం' అనురూపకం. ఇది 1963 లో ప్రచురితం. ఇందలి పది రూపకాలలో 'చాండాలిక' రూపకం పలు ప్రదర్శనలు పొందింది ఈ కావ్యంలోని రూపకాలు. ఇలా ఉన్నాయి.

1. చిత్ర కళా ప్రదర్శనం
2. వసంత స్వయంవరం
3. గులాబి ప్రసవించింది
4. దేవయాని
5. మెదడులో మెరుపు
6. శ్రేయసి
7. పాత ఊరు-కొత్త దారి
8. సుభాస చంద్రుడు
9. చాండాలిక
10. అంధకారంపై విజయం

మొదలైన రూపకాల ద్వారా మానవుని ఆనాటి ఆటవిక దశ నుండి నేటి ప్రజాస్వామ్య స్థాపన వరకు ఎదిగిన ఎన్నో విషయాలను మరియు యుగ యుగాల ఆచారాలను భీమన్న వీటి ద్వారా ప్రకటించారు.

బోయి భీమన్న ఆస్తికుడు. అయితే ఆయన ఆస్థికత ఏ మతానికీ చెందిన విశ్వాసం

కాదు. ఒక సందర్భములో ఆయన ఇలా అన్నారు. ''దేవున్ని నమ్మను. పరమాత్మను నమ్ముతాను. దేవుడు వ్యక్తిగతమైన విషయము. పరమాత్మ ప్రపంచకమైనది. ప్రపంచకమైనదే సత్యం. సత్యమే భగవత్స్వరూపం.

బోయి భీమన్న నిరంతర కవితా సాధకుడు, సౌందర్యారాధకుడు రసాద్వైత సిద్ధాంతి. ఇతనికి రసాద్వైతమే గమ్యం. పద్యం పల్కినా, వచనము చెప్పినా, గేయం పాడినా వస్తువు మాత్రం మానవునిలోని ప్రేమ, ఆర్తి, అనుభూతుల జీవన చిత్రాలు.

ముఖ్యంగా భీమన్న రూపకాలు పరిశీలించినపుడు ఒకటి రసాద్వైతం మరొకటి శివాద్వైత, కనిపిస్తుంది.

**''కంఠమున శివునిన్ ధరించిన విషమునై, నీ**
**కరుణకై మనుచుంటినోయీ!**
**నీవ నన్ను ధరించి, ప్రకృతికి పురుషుడై న**
**వ్యావనులు నిర్మింపుమోయి!''**

'వసంత స్వయంవరం' అను రూపకం 12 వ పుటలో గల ఆ గేయం ద్వారా తెలియవచ్చిన దేమిటంటే -

ప్రకృతి-పురుషుల సంయోగమే సృష్టికి మూలమని బోయి భీమన్న మనస్సులో ఓ సరికొత్త రసాద్వైతం రవళించింది. ప్రకృతి ప్రియురాలిగా, పరబ్రహ్మయే పురుషుడిగా, వారి ప్రేమయే రసాద్వైతంగా ప్రతిపాదించాడు. శివాద్వైతాన్ని ప్రతిపాదిస్తూ 'వసంత స్వయంవర,' రూపకంలో రసాద్వైత సిద్ధాంత ఛాయలు చేకూర్చాడు.

ప్రతీకాత్మక పాత్రల ద్వారా భీమన్న చెప్పే విషయాన్ని ''చిత్ర కళా ప్రదర్శనం'' రూపకంలో ఒక హాలు సన్నివేశం. అందులో ఉన్న చిత్రాలు పాత్రల రూపంలో నటించడం ఒక టెక్నిక్ గా ప్రవేశపెట్టాడు. ఇందు కథావస్తువు ప్రేమ. అదియు రసాద్వైతమే. ఇందులోని సామాజికం సౌందర్యాత్మకం.

**''శిల్పులే చిత్రాలు**
**చిత్రాలే శిల్పులు**
**ఒకరిలో ఒకరుండి**
**ఉన్నతులం కెగయుగా**
కళ అందులో జీవ కలశం'' (చిత్ర కళాప్రదర్శనం, 9 వ పుట)

ఇలా తన భావ కవిత్వం అపూర్వ కళా మనోజ్ఞంగా ప్రచలితమైనది. ఈ అవగాహనకు సూత్రీకరణంగానే కాడ్వెల్ తత్త్వవేత్త ఇలా అన్నారు.

"The poetry of one age does not satisfy the next age, but each new generation (While appreciating the old Poetry) demands poems which more peculiarly and specially express its own problems and aspirations." [1]. ఈ మాటలు ద్వారా మనకో సత్యం ద్యోతకమవుతుంది. ఆనాటి మహానీయులు అందినంత జ్ఞానాన్ని సకల శాస్త్రాంశాలనూ కవిత్వ రీతిలోనే అభివ్యక్తం చేవారు. భీమన్న స్వీయానుభవము సాహిత్య రూపంగా అవతరించింది. తన సాహిత్యం సమిష్టి శ్రేయాన్నే కోరుకుంది. ''విశ్వశ్రేయః కావ్యం'' అని ఊరికే అన్నారా పెద్దలు.

వీరి మరో రూపకం 'గులాబీ ప్రసవించింది'. దీని కథావస్తువు వేదన.

1. 'ఆంధ్రప్రభ' దినపత్రిక తేది ౧౯-4-౧౯౯౩- సాహితీ గవాక్షము నుండి

ఒక ఉద్యానవనంలో కోకిల ప్రధాన పాత్ర. దీని వేదనయే బోయి భీమన్న వేదన. అట్టి వేదన విశ్వవేదన అని కవి తన సమాజంలోని అనాథల అధముల బలహీనుల వేదనను ఈ రూపకం ద్వారా తెలియజేయశాడు. ఈ 'రూపకం' యొక్క 25 వ పుటలో-

"ప్రసవ వేదన లతికదైనా
పశువుదైనా పడతిదైనా
విశ్వవేదనమది; సమస్తా
వేగములకును కేంద్ర మయ్యది."

ఇలా భీమన్న వాస్తవ స్థితి గతులను పరిశీలించి జీవన యదార్థాలను కావ్యరూపకంలో సమాజానికి అందించాడు. సామాజిక రాజకీయ అంశాల మీద గాఢమైన అవగాహన భీమన్నకు ఉండడం వల్లనూ భాష, శైలి, శిల్పం మొదలగు కవితా సామాగ్రి ఉండటం వల్లనూ రూపకాలు రచించ గలుగుచున్నాడు. వీరి రచన ప్రాచీన ఆధునిక సాహిత్యం కలగలుపై నూతన అభ్యుదయ సాహిత్యమై కనిపిస్తుంది.

బోయి భీమన్న తన కవిత్వం సామాజిక జీవన తలాన్ని స్పర్శించి ప్రతిస్పందనా తరంగాలను జాగృతం చేయాలని బహుజనుల హృదయాల్లో జ్వాజ్వల్యమానమైన కాంతిని ప్రసరించాలని కోరుతూ 'మెదడులో మెరుపు', 'శ్రేయసి', 'పాత ఊరు-కొత్త దారి' మొదలగు గేయ నాటికలను రచించాడు.

సాంఘిక జీవనంలో గాని మానవుని వ్యక్తిగతమైన బ్రతుకుబాటలో గానీ సాహిత్యాది రంగాల్లో గాని సంప్రదాయం ప్రబల శక్తిగా పనిచేస్తుంది. ఒకానొక సంప్రదాయం గతంలో ఘనమైంది. అందువలన వర్తమానంలో దానికి

గల విశిష్టగతిని గమనించుటం ముఖ్యం. అందుకు రచయితలకు చారిత్రక దృష్టి అసరం అనే అభిప్రాయం కలిగియున్నట్లు బోయి భీమన్న రచనల వల్ల తెలుస్తుంది. సంప్రదాయాన్ని గుడ్డిగా అనుసరించటం కూడా వాంఛనీయం కాదు. అనుసరించటం కన్న నవ్యతను సాధించడం శ్రేష్టమని టి. యస్. ఇలియట్ తలంపు. ఈ విషయమును ఇలియట్ తన "Tradition and individual talent" అనే పుస్తకంలో "Novelty is better than repetation" అంటాడు. అంటే పురాతన ఆచారాలను యథాతథంగా ఆచరణలో పెట్టటం కన్న నవ్యతను పాటించుటయే శ్రేష్ఠతయని ఇలియట్ ధృడవిశ్వాసం. బోయి భీమన్నకు గూడ ఇలాంటి విశ్వాసమే ఉంది. కనుకనే తన సాహిత్యంలో నూతన నిర్మాణం జరిగినట్లుగా ఈ దిగువ గేయం వలన తెలుసుకోగలము.

**''యంత్ర హలమును మీటవోయీ**
**మంత్ర బలమును చాటవోయీ**
**చంద్ర తారా మండలాలకు**
**చక్ర పొంగలి పంచవోయీ!**
**లేచి రావోయ్**
**లేత యూహకు** (మెదడులో మెరుపు – 59 పుట)

శారీరక తత్త్వంపై వంశ పారంపర్య ప్రభావమెలాగో సాంఘిక జీవనంలో సాహిత్య క్షేత్రంలో సంప్రదాయం నిర్వహించే పాత్రకూడ అలాంటిదే.

"Tradition has to do with past and commanly known as the influence of the past on the present. అపార ప్రతిభావంతులు కొందరు పూర్వులు నడిచిన బాటలో నడుస్తూనే అప్పుడప్పుడు ఒక కొత్తదనమును

చంద్రుడు వరకు పరదాస్య విమోచనానికై ఉద్యమం నడిపిన వీరులత్యాగాన్ని, జాతికి స్ఫూర్తిదాయకమైన చారిత్రిక ఘట్టాల్ని ఉప్పొంగే ఆవేశంతో ఉత్తేజ భరియమైన కవితా ఝురితో నింపి జాతీయ రూపకాంగా అందించాడు భీమన్న.

జాతీయ సమైక్యత, దేశ సమగ్రత, సమభావం, పరస్పర సామరస్యం పెంపొందడానికి ముఖ్యంగా యువతరంలో దేశభక్తి రగుల్కొనే విధంగా 'సుభాస చంద్రుడు' రూపకం వ్రాశాడు.

ఉదాహరణకు ఈ రూపకం 103వ పుటలో –

**'పార తంత్ర్యపు గాఢాంధ కారమందు**
**పర్వ చంద్రుడు తోచె సుభాస చంద్రు**
**డిక తరింతు నుషస్సు వీక్షింతునంచు.**
**భారతము రాల్చె ఆనంద బాష్ప శతము''**

ఇక మరో రూపకమైన 'చాండాలిక' కథను మహాకవి రవీంద్రుని రచన నుండి గ్రహించి తెలుగులో సంగీత రూపకంగా భీమన్న అందించాడు. యుగాల తరబడి అంధ విశ్వాసాల్లోనూ మూఢ నమ్మకాల్లోనూ జీవిస్తున్న సమాజ సమూహంలో నవచైతన్యం ఉద్భవింపజేయటం 'చాండాలిక' రూపకం లోని లక్ష్యం.

'చాండాలిక' నాటకాన్ని బాగా ఎరిగిన అందరికీ ఇతివృత్తాన్ని వివరించాల్సిన అవసరం లేదు. నాటకంలో 'చాండాలిక' పాత్ర అంటరాని కులానికి చెందినది. పాత్ర ఔచిత్యాన్ని గొప్పగ తీర్చిదిద్దారు. మానవత్వ విలువల శిఖరాల నందుకున్న ఒక మహా మనిషి ఆ చాండాలిక. ఈ పాత్ర తో పాటు జన్మించిన మరో పాత్ర 'ఆనందుడు'. ఇతడు మానవతావాది. చాండాలిక

రూపకంలో కథానాయకుడు. కులం తక్కువ ఆడదని అనాగరికతతో ఒక అబలను మానసిక వ్యధకు గురిచేయడం జాతి బలహీనతగా గుర్తించాలంటాడు భీమన్న.

కులం తక్కువ ఆడది ఆడది కాదా ? తానొక మనిషికాదా ? ఆమెకు కోర్కెలు ఉండవా, తక్కువ కులంలో మంచి గుణం ఉండదా, ఆ మంచి గుణాన్ని గ్రహించవలసిన అవసరం లేదా? అంటూ భీమన్న తన పాత్ర 'ఆనందుడు' చేత ఇలా అనిపిస్తాడు.

**''నేను మనిషిని, మనిషివి నీవు; మనము**
**బోధి సత్త్వుని విశ్వైక బుద్ధిజాలము**
**ఇర్వురము ఒక్కటే భేదమేమి లేదు**
**భేదమెంచుట పాపం బెంచుకొనుట'** (చాండలిక' – 120 వ పుట)

సామాజిక స్పృహ కల్గి చారిత్రకాంశములు, సాంస్కృతికాంశములు దృష్టిలో ఉంచుకొని సాహిత్యాన్నితరించి చూస్తే, అధ్యయనం చేస్తే అందలి వాస్తవాలు బయట పడి అద్వైతుల్ని కేవలం పాఠకుల్ని ఉద్దేశములను చూసి వారిలోని సామాజిక స్పృహ మేల్కోల్పుతుంది. ఆ మేల్కొన్న సామాజిక స్పృహ చారిత్రక సాంస్కృతిక ప్రాధాన్యాన్ని గుర్తించి అద్వైతుల్ని కార్యోన్ముఖుల్ని చేస్తుందనుటలో సందేశం లేదు. ఈ సత్యం తోనే భీమన్న 'అందకారంపై విజయం' అను రూపకం వ్రాశాడు. ఈ నాటకంలోని 168 వ పుటలో ఇలా వ్రాశాడు.

**''నరుని న్యాయపు టెల్ల మీద**
**నరక దైత్య విజృంభణం**

చూపుదురు. అట్టి వారిలోని వాడే బోయి భీమన్న. ఈ రచనయే అందుకుదాహరణ:

**"ఈ రసోదయ సమయ మందివు**
**డెందుకీ తత్త్వార్థ చింతన**
**సంధ్య ననురాగమున పోలిచి**
**జడియ నేలను తమసి శోభకు"** ('శ్రేయసి' – 64 వ పుట.)

శంకరాచార్యుడు, రామానుజాడు, వివేకానందుడు మున్నగు ప్రవక్తలు, వాల్మీకి, కాళిదాసు, జయదేవుడు మున్నగు ప్రాచ్యకవులు, చాసరు, వర్డ్స్‌వర్త్, బెరన్, మిల్టన్ వంటి పాశ్చాత్య కవులు వారి వారి రంగములందు కొన్ని సంప్రదాయాల నెలాగ ఏర్పరిచారో అట్లే బోయి భీమన్న కూడ సాహిత్యంలో రసాద్వైతమను సాహిత్య సంప్రదాయాన్ని ఏర్పరిచాడు.

ఒక విధంగా భారతీయ సంస్కృతి మతం, ధర్మము, వర్ణ వ్యవస్థ సాంఘిక రాజకీయ ఆర్థిక విషయాలన్నీ కూడా సంప్రదాయము పేరిట సాహిత్యంలో చోటు చేసుకున్నాయి. పాశ్చాత్య ప్రభావం కూడ సాహిత్యంపై సంప్రదాయముపై ఎంతగానో పడిందని చెప్పవచ్చును. అందుకు కారణం బోయి భీమన్న 'పాత ఊరు–కొత్త దారి' రూపకం తెలియజేస్తుంది.

ఉదాహరణకు :

**"పంచవర్ష ప్రణాళిక సా**
**ధించినట్టి పురోభివృద్ధి ది**
**గాంధిదేవుని మహిమ చూతురు**
**గాని రండిక లోనికి "** ('పాత ఊరు–కొత్త దారి' 101వ పుట)

ఇలా భీమన్న రాజకీయ విషయాన్ని సాహిత్యం ద్వారా తెలియజేయడం పాశ్చాత్య ప్రభావాన్ని చూపుతోంది. తరతరాల నుండి సంక్రమించిన సాంఘిక సంప్రదాయాలతో బాటు సమకాలీన సామాజిక భావ వీచికలు బోయి భీమన్న సాహిత్య,లో ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి కూడా.బోయి భీమన్న వాస్తవికతా ధోరణి చాలా గొప్పది. ఉన్నతమైనది.

మహానాటక కర్త 'ఇబ్సన్' భావ విప్లవానికి ఆద్యుడు. జీవితపు ఛాయలు నాటకంలో ప్రతి ఫలించే వాస్తవికతా ధోరణిని ప్రవేశపెట్టింది ఇబ్సన్. ఇతని రచనా ప్రభావం మన తెలుగు కవులపై ప్రత్యక్షంగాను పరోక్షంగాను పడినప్పటికిని భీమన్నపై స్వాతంత్ర్య ఉద్యమ ప్రభావం సమకాలీన సమాజంలోని పరిస్థితుల ప్రభావం ఎక్కువ ఉంది. ముఖ్యంగా భీమన్న ప్రధాన సాహిత్య వస్తువు వర్ణ వ్యవస్థలో నవ్య ప్రయోగం గల రచనలు. సార్వజనిక శ్రేయానికి దోహదపడే సృజనాత్మక సాహిత్యాన్ని వెలయించిన రచనలలోని రూపకాలు –

1. **సుభాస చంద్రుడు**
2. **చాండాలిక**
3. **అంధకారంపై విజయం.**

–ఇవి కూడా బోయి బీమన్న యొక్క కీర్తి కేతనాలే. జన జీవితం భీమన్న చుట్టు ఉన్న ప్రపంచం. వీరి రూపకాలకు ఇతివృత్తం. తాను చూసినకొన్ని సంఘటనలకు చలించి మనసున మదనపడి దానికో రూపం తీసకురావడానికే రూపకాలు రచించాడు. కళ కళ కోసం కాదు, సమాజ హితం కోసం అన్నట్టుగా భీమన్న రచనలు కనిపిస్తాయి.

దేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో మహాత్ముని మొదలుకొని సుభాస

**పాలు త్రాగి - రొమ్ము గ్రుద్ది**

**పచ్చి నెత్తురు పీల్చడం''**

- అన్నప్పుడు భీమన్న సాహిత్య రంగములో అత్యంత కీలక స్థానము నాక్రమించాడనవచ్చును. ఈ రూపకంలో రసాభివ్యక్తికి రస ప్రతీతికి సంవిధానం అత్యసరం. అధునిక శతాబ్దంలో నవ్యకవితా, ఆ తరువాత భావకవితా ప్రసిద్ధమైన ప్రక్రియ. అందులోని సంవిధానం నిర్లక్ష్యంచేయబడలేదు. దువ్వూరి రామిరెడ్డి, రాయప్రోలు మొదలగు వారి మొక్క వివేచన యందీ యంశం స్పష్టము.

**''అందినది దిగమ్రింకుకొంటూ**

**అసుర మూకలు హద్దుదాటిరి**

**మానవత్వపు గుండెలోకి**

**మారణాస్త్రాల్ పేల్చిరి'' (అంధకారంపై విజయం - 168 వ పుట)**

దీనిలో ఒక విధమైన లయాత్మక ధ్వని పుట్టుకొస్తున్నది.

ఇదే పాఠకుణ్ని ప్రభావితం చేయకలుగుతుంది. ఎందుకంటే ధ్వని ఈ జగత్తుకి చైతన్య స్వరూపం. సమాజంలో సమాన దృష్టి పెంచుకొమ్మని చెప్పడానికే భీమన్న రూపకాలు వ్రాశాడు. వీరి రచనలుసుందరమై సార్వజనీన ప్రయోజనాన్ని కలిగి భావాత్మకమైన ఆహ్లాదాన్నిస్తాయి. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, షేక్స్‌పియర్, పుష్కిన్, టాల్‌స్టాయ్, ఛెకోవ్, ఓహెన్రీ, మిల్టన్, ఇబ్సన్ మొదలగు సాహిత్య మహాపురుషుల వరుసలో నిలుదగినావాడు బోయి భీమన్న.

## ప్రతీకాత్మక రూపకాలలోని ఇతివృత్తం:

| అసూయ | మానవుని మరొక మజిలీ | చిత్రకళా ప్రదర్శనం |
|---|---|---|
| క్రీ.శ. 1954 లో ప్రచురించబడినది. దీనిని బోయి భీమన్న రచించాడు.<br><br>ఈ రూపకంలో కథానాయకుడు 'రాజా' ఇతను విద్యార్థి కాంగ్రెస్ నాయకుడు ఇతని చుట్టు ఇతర పాత్రలునడుస్తాయి. ఇందులోముఖ్యమయిన పాత్రలు రాజా (కథానాయకుడు), రాత్రి (కథానాయిక, విశ్వం చెల్లెలు), విశ్వం (రాజా మిత్రుడు) చంభాస్కరావు (ధనికుడు), దినం (ధనికుని మిత్రుడు),రేరాణి (భూతాల కూతురు), భూతాలు, తంత్రాలు (పల్లెటూరి పెద్దలు), ఇంకా ఇందులో | కథానాయకురాలు 'స్వయంప్రభాదేవి' ఈ నాటకంలో ప్రధాన పాత్ర. బోయి భీమన్న కల్పన కథ ఈ రూపకం.<br><br>స్వయం ప్రభాదేవి వివిధ సందర్భాలలో వివిధ రూపాలలో ప్రత్యక్షమవడం పాత్ర ప్రత్యేకత.<br><br>ఈమె వలన జన్మించిన వారు భూలక్ష్మి, క్షేత్రయ్య దంపతులు, వీరి కూతురు సస్య. ఈమెను మేథానిధి వివాహమాడుతాడు. ఇతని తల్లిదండ్రులు భోగయ్య, ఆశావతి.<br><br>సూరన్న, చంద్రన్న అనువారు కార్మికులు. వీరితో కలసి భూలక్ష్మి క్షేత్రయ్యలు వ్యవసాయం | బోయి భీమన్న రమణీయమైన కల్పన చిత్ర కళా ప్రదర్శనం. దీనిని 1963లో ప్రచురించాడు. ఇందులో (10) సంగీత నృత్య నాటికలు కలవు.<br><br>**1. చిత్ర కళా ప్రదర్శనం:**<br><br>ఇందలి పాత్రలు నాలుగు చిత్ర దత్తు, కళ, మంజీర, మార్దంగం, చివరి రెండు పాత్రలు ప్రతీకాత్మక పాత్రలు. చిత్రదత్తు అనే చిత్రకళాకారుడు ఇందులో కథానాయకుడు. ఇతను 'కళ' అనే కధానాయికను ప్రేమించడం ఇందలి ఇతివృత్తం. ప్రేమకు భేదాలు ఉండవని ప్రేమ పవిత్రమైందని ఈ |

ప్రజలు, పోలీసులు కూడా ఉంటారు.

విశ్వం చెల్లెలు 'రాత్రి' రాజాను ప్రేమిస్తుంది. భూతాలకూతురు 'రేరాణి'కి జ్వరం వచ్చినపుడు 'రాత్రి' ఇలా అంటుంది. 'అబ్బ ఎంత జ్వరం ఉంది. ఇక్కడే హాస్పిటల్లో వుంచేద్దాం. ఈమెనను కూడా అన్నా నీవు తీసుకెళ్ళి అడ్మిట్ చేయించు' అని విశ్వంతో చెబుతుంది. విశ్వం రేరాణిని తీసుకు వెలతాడు.

అక్కడ 'రాత్రి' రాజా వంక తదేక దృష్టితో చూచి ముద్దు పెడుతుంది. ఇలా చివరలో బోయి భీమన్న తన రసాద్వైత ప్రేమను ఈ ప్రతీకాత్మక పాత్రల ద్వారా తెలియజేశాడు.

చేస్తుంటారు. కష్ట కాలంలో క్షేత్రయ్య స్వయంప్రభను ప్రార్థించగా ఆమె 'అన్నపూర్ణ'గా ప్రత్యక్షమవుతుంది.

సూరన్న, చంద్రన్నలు మేధానిధిపై పోరుకు సిద్ధపడ్డప్పుడు 'శ్యామల'గా ప్రత్యక్షమవుతుంది. ఒకసారి బోగయ్య దర్బారులో 'శశికళ' గా నాట్యం చేస్తుంది. ఇలా స్వయం ప్రభ పాత్ర వివిధరూపాలలో కనిపించడం ఈ నాటకంలోని ప్రత్యేకత. నాటకం చివరలో 'ధనలక్ష్మి' రూపంలో ప్రత్యక్షమౌతుంది. కథానాయకురాలు స్వయం ప్రభ.

'ధనరాజు' అనేవాడు 'సస్య'నుఎత్తుకు పోతాడు. మేధానిధి అతనిని రూపకం ద్వారా తెలుస్తుంది.

**2. వసంత స్వయంవరం:**

మధుప్రియ (కోకిల) రసాలిని (మామిడి), నింబలత (వేప) ఇక్షు కాంత (చెరకు) వసంతుడిని ప్రేమిస్తే, వసంతుడు ఉగాది పచ్చడితో వచ్చేగోపికను ప్రేమిస్తాడు. ఇది ఇందలి కథ.

**3. గులాబి ప్రసవించింది:**

ఈ కథ సన్నివేశం ఓ ఉద్యానవనం. ఇందలి పాత్రలు-గులాబి, సీతాకోకచిలుక, గుడ్లగూబ, తులసి, కోకిల, నెమలి, ఆకుపు రంగు మొదలగునవి. ఇక గోపిక ఇందులో ప్రత్యేక పాత్ర. ఈమె నోట ఉద్యానవన సౌందర్యాన్ని పలికించడం ఇందలి ఇతివృత్తం.

| | | |
|---|---|---|
| | ఓడించి సస్యను తిరిగి పొందుతాడు.<br>చివరిలో క్షేత్రయ్య ఋషిగా మారిపోతాడు. సస్య మేధానిధి, స్వయంప్రభ ఆశీర్వాదంతో సుఖ జీవనం గడుపుతారు.<br>ఇలా కథ సుఖాంతమవుతుంది. | 4. దేవయాని: ఈ కథ మహాభారతంలోనిది. బృహస్పతి కుమారుడైన కచుడు శుక్రాచార్యుని వద్ద విద్య నేర్చుకుంటాడు. దేవయాని శుక్రాచార్యుని కూతురు. కచున్ని ప్రేమిస్తుంది. అతను ఆమెను నిరాకరిస్తాడు. భగ్న ప్రేమ ఇందలి ఇతివృత్తం.<br>5. మెదడులో మెరుపు:<br>ఇందలికథానాయకుడు సోముడు, ఇతని ఆలోచనయే మెదడులో మెరుపు. వ్యవసాయ రంగంలో వచ్చిన కొత్త మార్పులు ఈ కథలోని ఇతివృత్తం.<br>6. శ్రేయసి: నిరంకుశ ప్రభుత్వం పడగొట్టి ప్రజారాజ్యం స్థాపించడం ఇందలి కథాంశం. నిర్మల ఇందులో కథా నాయిక. ఈమె హృదయ నిస్వార్థం. |

| | | |
|---|---|---|
| | | ఈమె ఎదుటి వ్యక్తుల కుట్రలను జయిస్తుంది. చివరలో వేదాంత తత్త్వాన్ని, మానవతా దృక్పథాన్నీ తెలుపుతుంది. ఒకరి సుఖం కంటే దేశ సుఖం ప్రధానమనే సందేశమిస్తుంది ఈ నాటిక. **7. పాత ఊరు-కొత్త దారి:** ఇందులో గ్రామాభ్యుదయం కనిపిస్తుంది. సమైక్య భావం, శ్రమశీలం గ్రామాలకుండాలనే ఆశయం ఈ రూపకం ఇతివృత్తం. **8. సుభాస చంద్రుడు:** మాతృదేశ స్వాతంత్ర్య సిద్ధికై సుభాస చంద్రుడు త్యాగనిరతితో వీరభావంతో సల్పిన పోరాట పటిమ ఈ నాటికలోని ఇతివృత్తం. **9. చాండాలిక:** బౌద్ధ జాతకాలలోనిదే ఈ చాండాలిక కథ. చాండాలిక కఅనేయువతి ఆనందుడనే భిక్షువును సర్వస్వంగా |

| | | |
|---|---|---|
| | | భావించి తుదకు ఆ దివ్యాత్మునిలో లీనమై పోవడం ఇందలి ఇతివృత్తం.<br>10. <u>అంధకారంపై విజయం:</u><br>ఇది దీపావళి ప్రాధాన్యన్ని వివరిస్తుంది. మరియు మన దేశంపై చైనా జరిపిన దురాక్రమణ గూర్చి దాన్ని తిప్పికొట్టిన మన వీరుల సాహసం గూర్చిన చిత్రణ ఈ రూపకంలోని ఇతివృత్తం.<br>ఈ విధంగా 'చిత్రకళా ప్రదర్శనం'లోని పది నాటికలూ కవితా సౌరభంతోనూ వస్తు వైవిధ్యంతోనూ కథాసం విధానంతోనూ సాగడం గొప్ప అద్భుతం. ఇలా ప్రతి నాటికా రచనలోనూ బోయి భీమన్న ప్రతిభ ప్రత్యక్షమౌతుంది. |

## తాత్త్విక చింతన :

భారతీయ తాత్త్విక శ్రేణిలో ప్రథముడిగా వివేకానందుడు కుల వ్యవస్థనీ అందులోని వైషమ్యాలను ప్రతిఘటించాడు.

శ్లో. జన్మనా జాయతే శూద్రహః
సంస్కారే నజాయతే ద్విజః [1].

పుట్టుకతో అందరూ శూద్రులే (అజ్ఞానులే), సంస్కరింపబడుటచే అతడు ద్విజాడు అవుతాడు. (ఛాందగ్యోపనిషత్తు) అన్నది పూర్వకవులు విషయములో వాస్తవము.

ఆనాటి వ్యాస వాల్మీకాదులు మొదలుకొని కవులందరిలోనూ ఏదో ఒక తత్త్వం లేకపోలేదు. ప్రతి సామాన్యుని జీవితానికి ఒక తత్త్వం అంటూ ఉండదు. కానీ ఆలోచనా శీలి అయిన మానవుడికే ఒక జీవిత తత్త్వం (Life philosophy) ఉంటుంది. ముఖ్యంగా తత్త్వకవులు సమాజంలో భాగంగా లౌకిక జీవితాన్ని గడుపుతూ జవానికి సన్నిహితులౌతారు. అలాంటి కోవకు చెందినవాడే బోయి భీమన్న. సనాతన ధర్మాన్ని ఆధునికమైన మానవీయమైన విలువలతో ముడివేస్తూ రచనలు చేశాడు బోయి భీమన్న. సామాజిక వ్యవస్థని, గ్రామీణ జీవితంలోని ప్రేమను గ్రహించి దాన్ని ఆదర్శంగా తన రూపకాలలో చక్కని తాత్త్వికతను ఏర్పరిచాడు భీమన్న. మనిషిని మనీషిని స్నేహపాశంలో బంధించి వేసే మానవత్వం యొక్క శక్తుల్ని తరచి చూచినప్పుడు ఆ దృశ్యాన్ని తన్మయత్వంతో అనుభవించగలం.

---

'కమ్యూనిజం' ప్రత్యేక సంచిక భారతదేశంలో కుల వ్యవస్థ - ౧౨ వ పుట

తెలుగులో తత్త్వ కవితకు ఆద్యుడు పోతులూరి వీరబ్రహ్మం గారు. అట్లే ఉత్తరాన కబీరుదాస్, సూర్‌దాస్. భక్తి ఉద్యమం సంస్కరణోద్యమంగా ప్రారంభమైంది. ఆ రోజుల్లోనే మతం, దానికి మూలమైన దేవుని మీదికే హేతువాదం, శాస్త్రీయ విజ్ఞానం పరోక్షంగాను ప్రత్యక్షంగాను తిరుగుబాటు నడిపాయి. దానికి ముందు డార్విన్ సిద్ధాంతాల వల్ల , ఫ్రాయిడ్ మనస్తత్వ శాస్త్ర సిద్ధాంతాల వల్ల మార్క్సు కనిపెట్టిన చారిత్రక భౌతిక తత్త్వాలతో కూడిన గతి తార్కిక సిద్ధాంతం చేత జాతీయత, దేశీయతపై పునర్విచారణ మొదలైంది. రాజా రామ్మోహన్ రాయ్‌చే పునరుజ్జీవన ఉద్యమం, సతీ సహగమనం, కందుకూరి వీరేశలింగం ద్వారావిధవా వివాహం మరియు స్త్రీ విద్య ప్రారంభ మైంది. స్వాతంత్ర్యం కోసం రాజకీయోద్యమాలు, సామాజిక స్వాతంత్ర్యం కోసం సంస్కరణోద్యమాలు జరిగినవి. మరి నేడు ఈ దేశంలో అశాంతి వుంది. మనిషి మనిషికి మధ్య సఖ్యత కొరవడింది. వాదాలు భేదాలతో ఓ మనిషి సాటి మనిషిని దూరం చేస్తున్నాడు. అలా జరుగకూడదు. మనిషి మనిషిచే గౌరవించబడాలి. ప్రేమింపబడాలి. అందుకని బోయి భీమన్న తన రచనల ద్వారా ప్రణయ రూపం, ప్రీయత తత్త్వాన్ని రసాద్వైతంగా బోధిస్తున్నాడు. పూర్ణ మానవత్వం, అద్వైతమూ వీరి భావనలో ఒకటిగా చేసి రూపకాలకు చక్కని తాత్త్వికతని కలిగించాడు. ఈ రూపకాల ద్వారా బోయి భీమన్న ను ఒక గొప్ప రసాద్వైత తత్త్వ మూర్తిగా కనిపిస్తాడు.

ఈ విధంగా భీమన్న రూపకాలు మొత్తం చూస్తే ఒక పూర్ణయోగాన్ని ప్రతిపాదించినట్టుగా మనకు అర్థం అవుతుంది. ఇంకా ఓ మాటలో చెప్పాలంటే

బోయి భీమన్న తనకున్నంతలో సరిపెట్టుకుని వ్యవస్థను వ్యతిరేకించక దాని పరిస్థితులను మాత్రం చక్కపెట్టుకుంటూ అంతర్ముఖుడై జీవిస్తున్నాడు.

## తాత్త్విక కవి బోయి భీమన్న ప్రత్యేక చింతన:

1. కుటుంబ జీవన మర్యాదను అనుసరిస్తూనే సమాజ శ్రేయస్సును ఆశించాడు.
2. అవినీతిని, అరాచకత్వాన్ని అంగీకరించలేదు.
3. లౌకిక వ్యవహార జీవితాన్ని ఆరాధించాడు.
4. సంసారంలోనే నివృత్తిని దర్శించవలేనన్నాడు.
5. జీవనపరంగా పెద్ద చిన్నా స్త్రీ పురుష భేదాలను పాటించలేదు.
6. కులమత భేదాలు లేవు. వీరికి మానవుడు విశ్వప్రతీక.
7. విగ్రహారాధనను, కర్మకాండలను నిరసించాడు.
8. వీరు పదార్థ ప్రాధాన్యవాదులు.
9. మూఢ విశ్వాసాలను. మంత్ర–తంత్రాలను ఖండించాడు.
10 వర్ణాంతర కులాంతర మతాంతర వివాహాలను ప్రోత్సహించాడు.

# భీమన్న వస్తు వైవిధ్యం

బోయి భీమన్న రూపకాలలోని వస్తువైవిధ్యం తెలుసుకొనుటకు ముందుగ రూపకోత్పత్తి, రూపక భేదాలు తెలుసుకుందాం.

**రూపకోత్పత్తి :** 'నాట్య' శబ్దము 'నట్' ధాతువు నుండి పుట్టినది. నాట్యము నృత్యముకు విస్తార రూపము. నాట్యము ఆధారంగా నాటకములు వచ్చినవి. నాటకములన్నియు గద్య పద్యాత్మకములయి యున్నవి. భారతీయ నాట్యమునకు మూలాధారము శివుడు. అలాగే గ్రీకు నాటకమునకు 'డయోనిసెస్' దేవత.

**రూపక భేదములు :** నాటకము దృశ్య మానమగుటచే రూపకమన బడుచున్నది. అవి పది విధములు :

1. నాటకము
2. ప్రకరణము
3. భాణము
4. ప్రహసనము
5. డిమము
6. వ్యాయోగము
7. సమవకారము
8. వీధి
9. అంకము
10. ఈహామృగము

**నాటకము :** ఇది ప్రకృతి. తక్కిన రూపకములన్నియు దీనికి వికృతులు. ఇందు వస్తువు ముఖ్యము. సుఖ దుఃఖములుండును. ఇందలి నాయకుడు ధీరోదాత్తుడు. ఐదు మొదలుకొని పది అంకముల వరకు ఉండును. రసవత్తరమైన కథ ఉండును. సంభాషణలు రమ్యముగా ఉండును. ఉదాహరణకు 'పాలేరు' నాటకం.

**ప్రకరణము :** ఇందలి వస్తువు లౌకికము, కల్పితము. ప్రధాన రసము శృంగారము. ఉదాహరణకు 'పైరుపాట' రూపకం.

**భాణము :** ఇందలి వస్తువు ఉత్పాద్యము. ధూర్త చరితము మరియు ఒక అంకముండును. శౌర్య సౌభాగ్య వర్ణనలతో ముఖ నిర్వహణ సంధులను, పది లాస్యాంగములును, భారతీ వృత్తియు నుండును.

**ప్రహసనము :** ఇందలి వస్తువు కల్పితము. శ్రామిక జనుల చరిత్రయై యుండును. హాస్యము ప్రధాన రసము. ఉదాహరణకు 'ప్రగతి' రూపకము.

**డిమము :** ఇందలి వస్తువు ప్రఖ్యాతము. మాయ ఇంద్రజాల యుద్ధాదులతో నిండి యుండును. ప్రధాన రసము రౌద్రము. నాలుగంకములుండును.

**వ్యాయోగము :** ఇందలి వస్తువు ప్రఖ్యాతము. స్త్రీ పాత్రలు తక్కువగా నుండను.

**సమవకారము:** ఇందలి వస్తువు ప్రఖ్యాతము. ప్రధాన రసము వీరము. మొదటి యంకములో కథ ఇరవై నాలుగు గడియలలోను, రెండు మూడు అంకములలోనిది ఎనిమిది, నాలుగు గడియలలో జరుగును.

**వీథి :** దీనిలో ఒకే అంకముండును. ఒకే నాయకుడు ఉండును. వస్తువు ప్రఖ్యాతము.

**అంకము:** ఉత్సృష్టికాంక మనియు పేరు. ఇందలి వస్తువు ప్రఖ్యాతము. కవి కల్పన ఇందు అధికము.

**ఈహామృగము :** ఇందలి వస్తువు మిశ్రమము. అంకములు నాలుగు. ఈ రూపకము గూర్చి మత భేదములున్నవి.

పాశ్చాత్యుల అభిమతము నందున రూపకాంగములలో మొదట లెక్కింప దగినది ఇతివృత్తము. అదేయే నాటకమునకు ప్రాణము. వంటిదనవచ్చును. పాశ్చాత్యుల అభిప్రాయయం ప్రకారం వస్తువు సంఘర్షణల నుండి పుట్టును. విలియం హెన్రీ హడ్సన్ మాటలలో Evey dramatic story arises out of some conflict - some kind of conflict is, howerver, the datum and the very back bone of a dramatic story. [1].

''నాటకాంతం హి.. సాహిత్య,''. కాబట్టి నాటకం కేవలం చదవడానికి మాత్రమే కాక ప్రదర్శించడానికి కూడ కావాలి. ఈ రెంటిని దృష్టిలో పెట్టుకుని రచన చేసినపుడు ఆ రచయిత యొక్క కల్పనా శక్తిని, కథా కదనా పటిమను నాటకీయతా ధోరణిని సంఘటనా సృష్టి పటిష్టతను ఉత్తమ సాహిత్యంగా గుర్తిస్తారు. ఉత్తమ సాహిత్యానికి ప్రధానమైనది ఇతివృత్తము. అదే కథా వస్తువు. ఇది బోయి భీమన్న రూపకాలలో కనిపిస్తుంది.

పురాణేతిహాసాదులను చదువునప్పుడు తన కనుల ఎదుట జరిగిన సంఘటనలు విజ్ఞప్తికి వచ్చినపుడు లేదా ప్రకృతిలోని రమణీయమైన దృశ్యములు చూచినపుడు తాను పొందిన ఆనందాన్ని , అనుభూతి భావాన్ని వ్యక్తము

1. 'విశ్వనాథ వారి నాటకములు – ఒక పరిశీలన' పేజీ నం. 19.

చేయుటకు ఆ కథనం కావ్యవస్తువుగా స్వీకరించబడును. ఇదియే బోయి భీమన్న విషయంలో జరిగింది.

వస్తు స్వభావాన్ని బట్టే నాటకాలు సాంఘికాలని, పౌరాణికాలని, చారిత్రకాలని పిలవబడుతుంటాయి. సాంఘిక రూపకమంటే సంఘానికి సంబంధించిన కథ కలిగిన నాటకమని అర్థం. సాంఘిక సమస్యాపూరితమైన వస్తు వైశిష్ట్యం కలిగిన రూపకాలు 1880 నుండి వచ్చాయి.

గురజాడ వారి 'కన్యాశుల్కం,' సుంకర వాసిరెడ్డి గార్ల 'ముందడుగు' "మాభూమి' మొదలగు వాటిలో ధనికుల కుతంత్రాలు, దొంగ సాక్ష్యాలు, పరస్త్రీ పట్ల వ్యామోహం కథా వస్తువుగా ఉంటే బోయి భీమన్న గారి 'పాలేరు' నాటకం ఆ కథావస్తువునే ఓ ప్రత్యేకమైన వైవిధ్యంలో రచించబడింది. అందులో ప్రత్యేకమైన పాత్రలను సృష్టించారు భీమన్న. నాటకిలో ఓ పాత్ర వెంకన్న. ఇతడు ఒక పాలేరు. కథానాయకుడు పాలేరు నాటక కల్పితమే అయినా ఇది ఎన్నో వాస్తవ జీవితాలకు మార్గదర్శకమైనది. పాలేరు తనాన్ని రూపుమావడం రచయిత ధ్యేయం. దానికి చదువే మార్గం అంటాడు భీమన్న.

**"విద్యలేని మనుష్యులు వింత పశువు**
**లనీ వినరే ? పశుత్వమ్మె మీకవ్వృతమగునె**
**బడికి పంపుడు, విద్య నేర్పుడు రవంత**
**ముందునకు బోవనిండు మీ ముద్దు సుతుల"** [1]

–ఇలా బోయి భీమన్న సామాన్య విషయాన్ని అసాధారణమైన తాత్త్విక ఉపమానంతో గంభీరంగా చెప్పాడు.

---

1. 'పాలేరు' నాటకం – పేజీ నెం. 10

వాసుదేవశాస్త్రి గారి ''నందకరాజ్యం'' తెలుగులో మొట్టమొదటి సాంఘిక నాటకం. అయితే 'పాలేరు' వెట్టిచాకిరి నిర్మూలన కోసం భీమన్న రాసిన మొట్టమొదటి సాంఘిక విప్లవ నాటకం అనవచ్చును. ముక్కుపచ్చలారని పసిపిల్లలు భూస్వాముల ఇళ్ళలో వెట్టిచాకిరి పేరుతో ఎంతటి దుర్భర జీవితానికి లోనయ్యారో ఆ నాటకం వల్ల అవగతమౌతుంది.

Acc No. 18395

'పాలేరు' నాటకంలో వస్తువైవిధ్యం వెట్టిచాకిరి నిర్మూలన అయితే 'కూలిరాజు' నాటకంలో కార్మిక సమస్యాపూరితమైన వస్తువు తీసుకున్నాడు. వాళ్ళ కూలిరేట్లు, పనివేళలు వైవిధ్యమైన రీతిలో నాటకీయత చేయబడినవి. కులభేధాలు లేని భారత జాతి నిర్మాణం ల్యాండ్ సీలింగ్, వయోజన ఓటింగ్, రాజకీయ ఆర్థిక సాంఘిక సామానత్వం. ముఖ్యంగా ఆడవారికి సమానహక్కు అనే కథావస్తువు తీసుకొన్నాడు. ఈ రూకంలో వైవిధ్యం గల పాత్ర 'జ్యోతి'. ఈమె కథానాయకురాలు. దళిత స్త్రీ. కథాగమనం ఈమె ద్వారా నడుస్తుంది. ఈ 'కూలి రాజు' రూపకంలో-

894-813109
BAL

**''అరకలు దున్నే అన్నల్లారా! ఊడుపు లూడ్చే [1].**

**ఒదినెల్లారా ! సంపదకంతా కర్తలు మీరె ! స్వారా**

**జ్యానికి రాజులు మీరే'' – అంటాడు భీమన్న.**

100 200

ఉదాత్త జీవిత తత్త్వనిరూపణకు భీమన్నను ప్రేరేపించిన ఆనాటి సాంఘిక దురాచారా సంఘటనల రూపమే ''కూలిరాజు'. అయితే భీమన్న మనస్సును ఆనంద డోలికలలో ఊగించిన ప్రకృతి సౌందర్యం వారి జన్మభూమి కోనసీమ పల్లె వాతావరణం 'పైరుపాట' గేయ రూపకానికి కారణభూతమైనది. భీమన్న దృష్టిలో పాట బ్రతుకులోని కమ్మదనానికి సంకేతం.

1. భీమన్న షష్టి పూర్తి సంచిక పేజీ నెం. 154

దేవులపల్లి కృష్ణశాస్త్రి కావ్యవస్తువు ప్రకృతి సౌందర్యం. అట్లే భీమన్న కావ్యవస్తువూ ప్రకృతి సౌందర్యమె గాని వీరి కావ్యవస్తువులో వైవిధ్యముంది. అదేమిటంటే గేయకథ, గేయసంభాషణ. అందుకే వీరి రూపకంలోని పాటలకు ఆలంబన పైరుచేలు, పచ్చికబీళ్ళు అచ్చటి గడ్డి, పిల్లల ఆటలు, కుఱ్ఱవాళ్ళ షికారూ.

**"మంచు బొట్టో, మధు బిందువో [1].**
**మనుగడ కంతే చాలని**
**కమ్మగ జీవించే యీ**
**గడ్డి పువ్వు కడకంటికి**
**పాల కడలి చూపి – తు**
**ఫాను రేపినా వేలా?**

అని భీమన్న అన్నపుడు తాను సృష్టించిన పాత్ర 'స్నేహ' యొక్క హీనస్థితి మరియు పేదతనం తెలుస్తుంది. పేదవారిలో నున్న గొప్పతనం ఎంతటిదో, గడ్డిపువ్వును 'సింబాలిక్' గా చేసి రచించిన 'పైరుపాట' కావ్య వస్తువైవిధ్యం తెలియజేస్తుంది.

1946 లో యస్. కాశీవిశ్వనాథం గారు హరిజన సమస్యలను కథా వస్తువుగా గ్రహించి 'ఇదీ భారతం' అనే గ్రంథాన్ని రచిస్తే బోయి భీమన్న అదే కావ్య వస్తువును 'చిత్ర కళా ప్రదర్శనం' అనే పది రూపకాల సంపుటిలో ఒక వైరైటీలో అదే కథా వస్తువుగా వైవిధ్యం గల పాత్రలు కల్పించి రసరమ్యంగా రచన చేశాడు.

'చిత్ర కళా ప్రదర్శనం' రూపకంలో కథావస్తువు ప్రేమ ప్రధానమైనది.

1. 'పైరుపాట' రూపకం పేజీ నెం. ౨

దీని నాటకీయత అద్భుతం. హాలులో ఉన్న చిత్రపటాల ద్వారా ఆ చిత్రాలే నటిస్తున్నట్లుగా చెప్పే కథ తీరు అమోఘం.

వసంత ఋతువును కథావస్తువుగా స్వీకరించి ''వసంత స్వయంవరం', ఉద్యానవనం కథావస్తువుగా గ్రహించి ''గులాబి ప్రసవించింది'', పౌరాణిక గాథను కథావస్తువుగా ఎన్నుకొని 'దేవయాని', దేశభక్తిని కథావస్తువుగా మలచి ''సుభాస చంద్రుడు', అస్పృశ్యతను కథావస్తువుగా ''చాండాలిక'' మొదలగు రూపకాలను వైవిద్యం గల పాత్రలతోను, సన్నివేశాలతోను రూపొందించి భీమన్న పలు రచనలు చేశాడు. వీరి అన్ని రచనలలోను భావ గాంభీర్యం శిల్ప నైపుణ్యముంది.

బోయి భీమన్న సమకాలికుడు పినిశెట్టి. ఇతని రచన ''కులం లేని పిల్ల'' ఈ కావ్య వస్తువు కులసమస్య. భీమన్న కూడ ఇదే కులసమస్య కావ్య వస్తువుగా స్వీకరించి ఒక వైవిధ్యాన్ని నిర్మించి ''పడిపోతున్న అడ్డుగోడలు' అనే రూపకం రచించాడు. దీని ఇతివృత్తం, ఒక హరిజన బాలిక తనతోటి బ్రాహ్మణ విద్యార్థి ఇంటికి వెళుతుంది. అక్కడ పొందిన అనుభూతిని వ్యంగ్యంగా హాస్యభరితంగా చిత్రించాడు బోయి భీమన్న. కుల తత్త్వాన్ని ఖండించాడు ఈ రూపకం ద్వారా.

1. Heridity was not highly valued. Kavasa, the son of a slave girl could became a sage. It is therefore clear that classes existed in Rigvedic society, but they had not yet developed into castes (The Cultural heritage of India - Page No. 226)

ఋగ్వేద కాలంలో భారతీయ సమాజంలో వర్గాలున్నాయని వాళ్ల

1. 'పాలేరు' నాటకం పీఠిక బాణాకర్ర పి. నెం. XX

వాళ్ల ప్రతిభను బట్టి ఒక వర్గం వ్యక్తి మరొక వర్గానికి మారడము జరుగుతూనే వుండెడిదని వర్గాలు, వర్ణాలు (కులాలు)గా మారడం అప్పటికింకి జరుగలేదని పరిశోధకులంటున్నారు.

పుట్టుకను బట్టి కులం ఏర్పడటం అనే ఈనాటి దుష్ట వ్యవస్థ స్మృతుల కాలం నుంచి వచ్చింది, శ్రుతుల కాలంలో లేదు – ఈ సందేశాన్నే భీమన్న తన రచనలలో 'పాలేరు', 'కూలిరాజు' నాటకాలలోనూ ప్రతిపాదించాడు.

1880 లోని వావిలాల వాసుదేవశాస్త్రి గారి 'నందక రాజ్యం' తొలి పద్య నాటకం. ఇది సాంఘికపరమైనది. భీమన్న పౌరాణిక పద్య మరియు గేయ రూపకం 'రాగవాసిష్ఠం'. ఇదే వీరి వైవిధ్య రచన. ఆంధ్ర రూపక వాఙ్మయమునకే తలమానికము – ''ప్రతాపరుద్రీయము'' – అయినా, 'రాగవాసిష్ఠం' భీమన్న రూపకాలలో మకుటాయమానమైనది. సాంఘిక చైతన్య ప్రభావం గలది. 'హరిజనులు ఆర్యులే' అనే సిద్ధాంతానికి త్రోవ చూపిన శ్రీ మంగిపూడి వెంకటశర్మగారి రచన 'నిరుద్ధ భారతంలోని–

**''వ్యాసముని చంద్రగన్న పరాశరుండు**
**మాలదానికి పుట్టి బ్రహ్మర్షియయ్యె**
**వేశ్యకును పుట్టి మాలెత బెండ్లియాడి**
**ఆ వశిష్ఠ మహర్షి బ్రహర్షియయ్యె''** 1

ఈ పద్యంచే ఆకర్షింపబడి అరుంధతీ విశిష్ఠుల కళ్యాణ చరిత్రను నాటకంగా వ్రాసినట్లుగా తన ప్రస్తావనలో భీమన్న చెప్పాడు.

దీనియొక్క ఇతివృత్త మూలబీజం పౌరాణికం. జాతి భేదంలేదని మానవ సమాజం వసుధైక కుటుంబమని, సమసమాజం కోసం 'రాగవాసిష్ఠం'

1. 'రాగవాసిష్ఠం' రూపకం – ప్రస్తావన పేజీ నెం. 5

రూపకం ఉన్నతమైన వస్తువైవిధ్యంతో కథా కల్పన పథకంతో సమర్థవంతంగా రచించాడు. అరుంధతీ వశిష్ఠుల ప్రణయ పర్యవసానం వర్ణ ధర్మానికి, కులవ్యవస్థకూ గొడ్డలిపెట్టుగా పరిణమింప చేయటమే ఇందలి కథా వస్తు వైవిధ్యం.

అస్పృస్యతా నివారణ సమస్య మీద ధర్మవరం గోపాలాచార్యుల గారి 'అస్పృశ్య విజయము' వస్తే, బోయి భీమన్న యొక్క 'బాలయోగి', 'ఆదికవి వాల్మీకి' రూపకాలు వచ్చాయి. ఈ రెండు రూపకాలలోని ఇద్దరు కూడా దళితులని, నిమ్నజాతులకు సంబంధించిన ఋషులని భీమన్న అంటారు. ఇంకా ఆర్యులూ, ద్రావిడులూ ఒకే జాతికి చెందినవారనే కథావస్తువును స్వీకరించి కల్పించి వైవిధ్యం గల నాటకీయతతో వ్రాశారు.

సాంఘిక వ్యవస్థ, జీవిత సంక్షోభం, దుష్ట సంప్రదాయాలు, మూఢనమ్మకాలూ ఆనాటి సమాజంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. వీటన్నింటి సమగ్ర స్వరూపాలే భీమన్న రూపకాలు.

సమాజంలోని అవ్యవస్థని మార్చటానికి భీమన్న చేసిన ప్రయత్నం "అసూయ" నాటక రచన. ఈ నాటకంలో ప్రబలంగా కనబడే నాటక వస్తువు విద్యార్థుల క్రమశిక్షణ. ఇందు విద్యార్థుల చదువు గురించి తీసుకోవలసిన శ్రద్ధను మరియు క్రమశిక్షణలేని విద్యార్థుల నడవడిని గూర్చి వర్ణిస్తూ తన తాత్త్విక చింతనను తెలిపారు.

ప్రతి తత్త్వవేత్తకు ఒక ఆలోచనా క్రమం, పరిశీలనా స్రవంతి ఉంటాయి. ఇది అంతస్సార మూల సూత్రం. వివిధ సామాజిక ఆర్థిక రాజకీయ నైతిక

సమస్యలకు తన చింతనను వర్తింపజేసి ఒక భావజాలాన్ని రూపొందించాడు. తాను రూపొందించిన గేయ రూపకాలలో ఒకటి ''మానవుని మరొక మజిలీ''. ఈ నాటకలోని ప్రధాన వస్తువు మానవ సమాజ పరిణామం. ఆటవిక యుగం నుండి అణుయుగం వరకు మానవ సమాజం పొందిన దశలను ప్రతీకాత్మక పాత్రల ద్వారా చిత్రీకరించాడు.

వస్తువు దృష్ట్యా, పరిణామం దృష్ట్యానే కాక సాహిత్య మూల్యాల దృష్ట్యా కూడ ఈ నాటకం ఎంతో గొప్పది.

1930లో అభ్యుదయవాదం రాజకీయంగానే కాక సాంస్కృత సాహిత్య నాటక రూపాలలో కూడ ప్రతిఫలించింది. కృష్ణ కౌండిన్యుడి గారి 'నందనూరు', కొడాలి గోపాలరావు గారి 'పేద రైతు', నార్ల వారి 'కొత్త గడ్డ', ఆత్రేయ గారి ''యన్.జి.ఓ'' మొదలగు నాటకాలు ప్రజాజీవితము వైపు సామాజికుల దృష్టిని మళ్ళించాయి. అట్లే బోయి భీమన్న రూపకం ''ప్రగతి'' చమత్కృతి ముందుకు నడిపించింది.

**''సత్య మద్వైతమని పల్కె శంకరుండు** [1]
**అగును నిజము రసాద్వైత మందు నేను**
**నిజమే సత్యమె సత్యమె నిజమె తెలిపి**
**అమృత పదవిని సమకూర్చునదియె ప్రగతి''**

ప్రగతి గురించిన తన దర్శనం అదియేనని అంటాడు బోయి భీమన్న.

మానవతా సిద్ధాంతాన్ని ఒక మహా సిద్ధాంతంగా పాశ్చాత్యులు తీర్చిదిదాదు. గ్రీకుదేశంలో 'బోరాస్'' అనే వేదాంతి సృష్టిలోని సమస్త వస్తువులకు మానవుడే ప్రమాణం అన్నాడు. మనవుడు అన్ని విధాల స్వేచ్ఛగా

1. ప్రగతి - రూపకం. పేజీ నెం. 1.

ఉండాలి. అతనికి వాక్స్వాతంత్ర్యం,ఆలోచనా స్వాతంత్ర్యం ఉండాలి. ఒక న్యాయమైన మార్గంలో పయనించే అధికారం అతనికి ఉండాలి. ఈ ఆశయాన్ని కథావస్తువుగా స్వీకరించి ప్రజా సమస్యల్ని వ్యంగ్య రూపంలో వైవిధ్యం గల పాత్రలతో 'ప్రగతి' నాటకాన్ని బోయి భీమన్న రచించాడు.

సాహిత్యం ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయాలి గాని చైతన్య రాహిత్యంలోనికి తోయగూడదు. ఇది శ్రీశ్రీ సిద్ధాంతం. దీనిని బోయి భీమన్న కూడ కదనలేదు. బోయి భీమన్న ప్రజా సమస్యల్ని తన సమస్యలుగా గ్రహించి తన రచనలలో ఇతి వృత్తాలుగా చేర్చి 'ధ్వని' ప్రాయంగా గేయ రూపకాలు వ్రాశాడు. ఈ 'ప్రగతి' రూపకంలో సృజనాత్మక గేయాలున్నాయి.

ఈ నాటకంలో నాయి పేరు 'ప్రగతి' దేశప్రగతికి ఏదో చేస్తున్నామనుకునే సామ్యవాద సిద్ధాంతాలు వల్లించే నాయకులకు, ఉపనాయకులకు ఈ నాటకం ఒక సావాలుగ నిలుస్తుంది.

వైవిధ్యం గల పాత్రలు, వైవిధ్యం గల సంభాషణ కలిగిన 'ప్రగతి' రూపకం ఎందరో ఆంధ్రు అభిమానాన్ని పొందింది. ఇది భీమన్న రచనా వైశిష్ట్యం అని చెప్పవచ్చును.

బోయి భీమన్న రూపకాల యొక్క కావ్యవస్తువు సాంఘికమ భారతీయ సంస్కృతి, జాతీయ సమైక్యత దేశ భక్తిని పెంపొందించునట్లు గాను మరియు సమాజంలోని సాంఘిక దురాచారాలనూ, సమస్యలనూ ఎత్తి చూపుతూ కల్పితవైవిద్య పాత్రలు కథకు అనుగుణంగాను సామాజికచైతన్యానికి దోహదకారికానూ నిలిచాయి.

''ఆనందములో పుట్టి అడుగడుగునా ఆనందమే దర్శకత్వం వహించి నడుపుతుండగా ఆనందమే లక్ష్యంగా మానవుడెలా ముందుకు సాగుతున్నాడో- ఒక ఆనందమయ రీతిలో చూపడం దృశ్య కావ్య ఉద్దేశ్యం''[1]

ఇలా బోయి భీమన్న తన రూపకాల యొక్క ఉద్దేశ్యాన్ని ఆనందంతోను సాంఘిక ప్రయోజనం కోరుతూను రచించిన తీరు అభినందనీయము.

---

ానవుని మరొక మజిలీ' - ఒక మాట అను పీఠికలో

# భీమన్న శైలీ విన్యాసం

శైలి అనేది ఒక కళ. కళ కళ కోసమే. "Art for arts sake may be seen as a kind of Aesthetico - Scientific detachment, and intellectual reaction agaisnt the Romantic lettingdown of the flair and flood of personal emotion" [1].

క్లుప్తంగా రచనలో భాషను వాడుకునే శక్తినీ, నేర్పునూ, ప్రత్యేకతను శైలి అనువచ్చును. శ్రీశ్రీ శైలి ఒక ఝంఝా మారుతంలా వుంటుంది. కొడవగంటి శైలి ఆలోచనా ప్రేరకమై యుంటుంది. అట్లాగే బోయి భీమన్న శైలి సరళమై వుంటుంది. శైలి అనేది ఒక స్వంత ముద్ర.

బోయి భీమన్న రచనా శైలి సూటిదనం. తేలికదనం వాక్యాలను వాడడమే కాక పద్య – పాటలతో రూపకం వ్రాయడం వీరి ప్రత్యేకత. బోయి భీమన్న శైలి ప్రధానంగా ప్రాచచీన సాహిత్య ఛాయల్లో నడుస్తూ ఆధునికతను ప్రబోధిస్తుంది.

నిత్యం వాడుకునే అత్యంత పరిచితాలైన పదాలే ఆయన రచనల్లో కనిపిస్తాయి. సరళమైన శైలిలో ఒక విజయం. సులభంగా చెప్పడం ఎంత కష్టమో కలం పట్టిన ప్రతివాడికీ తెలుస్తుంది. ఎంత లోతైన విషయమైన సులభంగా తేలికగా చెప్పగలడు బోయి భీమన్న.

మంచి శైలకి అవసరమైనవి హాస్యం, వ్యంగ్యం. సన్నివేశైలోని వైపరీత్యం

1. అభ్యుదయ - విమర్శ వేశేష – 121 వ పుట

హాస్యాన్ని పెంచుతుంది. సున్నితమైన హాస్యం సంస్కారులకే సాధ్యపడుతుంది. ఆయన రచనలలోని వ్యంగ్య రూపకం 'ప్రగతి'. ఇది నవరసభరిత నాటకం. ఇందులోని నాయిక పేరు ప్రగతి, నాయకుడు మార్గమిత్ర. వీరి మధ్య ప్రేమను పెంపొందించుతూ దేశంలోని నాయకుల ఉపనాయకులపై వ్యంగ్యంగాను, హాస్యభరితంగాను వ్రాశాడు.

ఉదహరణకి :

''దొర:- మీ నాన్న నా కిచ్చిన స్వేచ్ఛ ఎంత ?

ప్రగతి:- బంధం వేసిన ఆవుదూడ కిచ్చినంత.

దొర:- నువ్వు దాన్ని దుర్వినియోగం చేశావు, అవునా ?

ప్రగతి:- (నవ్వి) బంధం తెగక బోర్లా పడ్డాను. సరేనా. ఇక నీవు వెళ్లు [1].

ఇలా భీమన్న సంభాషణలని క్లుప్తంగా , సరళంగా వ్రాస్తాడు. ఇది అతని శైలి.

శైలి రచయిత యొక్క భావనకు సంబంధించిన నడక లాంటిది. అది గొప్పదైతే, పాఠకుడు దానితో పాటు నడుస్తాడు. అందువల్ల రచనకి శైలి అతి ముఖ్యమైందని చెప్పొచ్చు.

బోయి భీమన్న కవిత్వ రచనలలో పదాల కూర్పు ద్వారా నాద సౌందర్యాన్ని భాషలోని గాఢతనూ సాధించాడు. అందుకు నిదర్శనం ''పాలేరు'' నాటకంలోని శైలియే.

''సీ. ఒక వైపున సనాతన కుల దావాంధులు

శపియించి నిప్పులు జల్లుచుండ

1. 'ప్రగతి' - రూపకం - 33 వ పుట

ఒక వైపు ప్రగతికాముకులైన యువకులు
ప్రేమకాన్కలు సమర్పించు చుండ
ఒకవైపు భారతాభ్యుదయ నిరోధకుల్
నోటికత్తులు చాలా నూరుచుండ

ఒక వైపు జాతి ఏకోన్ముఖ మగుచుండ
దాస్య శృంఖలలు బద్ధలగుచుండ
కుటిల కుల భేద కుడ్యాలు కూల ద్రోసి
పూర్వవైభవ శిఖరాల బూజా దులిపి
తెలిసి జాతి నిద్దుర లేచి, నిలిచి నడువ
బాల బెండ్లాడె వెంకటేశ్వరుడు నేడు !'' 1.

బోయి భీమన్న రూపకాలలో ''కూలిరాజు'' కూడ ప్రసిద్ధి చెందిన రచన. ఇది పాఠకులను ఆకట్టుకొని త్రిప్పుకోగలుగతుంది. ఈ నాటకంలో ఓ చోట నిష్కల యోగి పాత్ర చేత చెప్పిన మాట.

''శక్తులు సళ్ళిన, వయస్సు మళ్ళిన సోదరుల్ని
కాక నెత్తురు నుండె
శక్తులు నిండె
ప్రజా సేవకులనే మనం యెంచాలి'' 2.

ఇది ''మహాప్రస్థానం'' లోని శ్రీశ్రీ కవిత,

'ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా చావండి'

అనే గేయాన్ని గుర్తు చేస్తుంది.

1. 'పాలేరు' నాటకం - 101 వ పుట. 2. 'కూలిరాజు' - రూపకం

బోయి భీమన్న రచనా శైలిని గురించి చెప్పడమంటె పెద్ద సాహసమే. ఎదురీతలాంటిదే – ప్రధానంగా రచనలోని అంశాలన్నింటినీ నిర్వహించేది శైలి. అంశాలన్నింటినీ వచనంలో నిర్వహించాలంటే భాష మీద అధికారం ఉండాలి. భాష మీది అధికారమే రచనా విధానాన్ని నిర్ణయిస్తుంది. ఆ విధానంలోని పద ప్రయోగం కౌశలం, పదబంధ నిర్మాణంలోని నేర్పు, వాక్య విన్యాసంలోని ప్రావీణ్యత అనేవి కలిసి శైలిగా రూపొందుతాయి. అట్టి శైలి గల రూపక సంపుటి ''చిత్ర కళా ప్రదర్శన''. ఇది భీమన్న కీర్తి ప్రతీక. ఇందు వాడిన భాష నేర్పు ఉత్తమమైనది.

ఉదాహరణ :-

''కంఠమున శివునిన్ ధరించిన విషయుమునై, నీ
కరుణకై మనుచుంటి నోయీ!
నీవ నన్ను ధరించి, ప్రకృతికి పురుషుడై, న
వ్యాధనులు నిర్మింపు మోయీ!''[1].

ఇలా బోయి భీమన్న పదాల ఎంపిక ద్వారా కలిగించే నాదం, భావం ఉన్నతమైన శైలిగా కనిపిస్తుంది.

''ముద్దులొల్కు భూ కాంతకు ముత్యాల్
ముగ్గులు పెట్టిన వాకిలి నేను
నింగి అద్దమున నా ప్రతిబింబమె
తొంగి చూడదా పాల పుంతవలె ?
రావోయి మధుదేవా! కై
కోవోయి నా సేవా! ''[2]

1. చిత్ర కళా ప్రదర్శన - 1 వ పుట 2. ''చిత్ర కళా ప్రధర్శన'' - 1 వ పుట.

అలా బోయి భీమన్న భాషలో, భావనలో, ఇతివృత్త నిర్వహణలో వర్ణనలు చేయడంలో గొప్ప కళాకారుడు. ఆయన రచనలన్నియూ వర్ణ చిత్రాలవలెనే వుంటాయి. అతను తన శైలి మాటలను రంగుల్లో ముంచి కుంచెతో బొమ్మ వేశాడా అన్నట్లుగా కనిపిస్తుంది అతని రచనా విధానం అతను గొప్ప సౌందర్య తత్త్వజ్ఞుడు.

బోయి భీమన్న ఉపయోగించిన వాక్య ప్రయోగం, అతని సామర్థ్యం చాలా గొప్పది. కనుకనే తాను మహాకవి కాగలిగాడు. ఈ మహాకవి వాడిన మాటలు చూడండి.

**"పొద్దు చిన్న చిన్న వెలుగు ముద్దలట్లు రాలె**
**ముళ్ళదారి మురికి దారి కళ్ళముందె రోడ్డయ్యె**
**ఒళ్ళు జళ్ళు మను చీకటి ఒక్కసారె వెలుగయ్యె"** [1]

బోయి భీమన్న రచన యందు అలంకారికత ఉన్నందున వారి యొక్క శైలి సౌందర్యం ఉన్నతమై నిలిచింది. ముఖ్యంగా పదాల కూర్పు సూటిగా స్పష్టంగా నిరాడంబరంగా సంగ్రహంగా ఉండుట చేత భీమన్న వచన శైలి గంభీరంగా ప్రసన్నంగా నిలిచింది. కనుకనే భీమన్న రచనలోని అంశాలను పాఠకులు గ్రహించడానికీ అనుభవించడానికీ అనువుగా ఉన్నాయి.

**"ఆశావతి: కోతలకు మొనగాడు**
**కూతలకు గిజిగాడు**
**చేతలకు మా బావ**
**కేతి గాడోయ్, దేవ!**

1. "చిత్ర కళా ప్రదర్శన" - ౨౫ వ పుట

తెలియకుండా వచ్చి
దిగి మ్రింగుతున్నాడు
పొట్ట పెండ్లామయ్యె
పొట్టి బావకు నేడు'' [1].

బోయి భీమన్న శైలి విషయం విశదంగా ఉంటుంది. ఆయన కళాత్మకంగా రచన చేయడంలో నేర్పరి. సూటిదనం, తేలికదనం ఆయన శైలి లక్షణాలు. ఈ గుణాలు కలిగిన నాటకాలో ఒకటి ''అసూయ''. ఇది విద్యార్థుల చదువు గురించి, వారి క్రమశిక్షణ గురించి వర్ణిస్తూ రచించాడు. ఆరవ రంగంలో ''రాత్రి'' పాత్ర చేత తన భావనాపటిమ శక్తిని తెలిపాడు.

రాత్రి : 'కిట్టమూ తనమూ గట్టు తెగినదా
కొట్టకు వవునో లోకం
మానవ ధర్మము మన్ను గలసెనా
మంచికి రోజులు కావా ?
పగటి దొంగలె ప్రజానాథులా
రౌడీదేనా రాజ్యం ?
ఏమోయి పభూ! ఏమి న్యాయం
ఎవడీ సృష్టికి కర్త ??'' [2].

ఇలా గొప్ప భావాన్ని బోయి భీమన్న శబ్ద ప్రయోగం ద్వారా తన శైలిని తెలియజేశాడు. వెన్నెముకలాంటి కథాంశం, చక్కని ప్రవర్తన లాంటి పాత్ర చిత్రణ, పాఠకుడ్ని ప్రేరేపించే నాటకీయత ఎంత గొప్పగా ఉన్నా కూడా శైలి బాగులేకపోతే పాఠకుడు రచనను చదవటం గాని, రూపకం చూడటం

'మానవుని మరొక మజిలీ' – 23 వ పుట 2. 'అసూయ' రంగం – ఆరవ రంగంలో

గాని చేయడన్న విషయం భీమన్నకు తెలుసు. కుకనే శైలిపై నున్న అధికారాన్ని ప్రేమతో జోడిస్తూ తన తాత్త్విక చింతనని తెలియజేశాడు. పోతే, ప్రేమ ప్రదర్శన ఎంత అసహ్యకరమో ప్రేమ లేకుండా సంసారం చేయడం అంతే అసహ్యం. భీమన్నకు ప్రేమ భౌతిక జీవితంతో ముడిపడియన్నదే. రొమాంటిక్ రచయితల మాదిరి ప్రేమలో మరో అతిలోక తత్త్వపు ప్రతిబింబం కాదు. 'సెక్స్' శరీర నైజం. ప్రేమ మానసిక ధర్మం. శరీర వాంఛలు తీరినట్లుగానే మానసిక వాంఛలూ తీరాలి. ప్రేమించే గుణం మనిషిలో ఉండాలి. ప్రేమించే గుణం మనిషిలో లేనపుడు. ఆ జీవి మానవ ధర్మానికి విరుద్ధం. ఇలాంటి సుప్రతిష్టతమైన అవగాహన గలది భీమన్న ధృక్పథం. ఈ విషయాన్ని ధృవీకరించడమే ఆయన సాహిత్య లక్ష్యం. ప్రేమకు సంబంధించిన యితవృత్త గల రూప(నాట)కాలలో ''రాగవాసిష్ఠం'' ఒకటి.

ఇందులో అరుంధతిపై గల ప్రేమ, వసిష్ఠుడు పడిన బాధనూ భీమన్న ఎలా రచించాడో చూడండి.

> **''ఆర్యా! విశ్వంభరం శివంకరం సుందరం అయిన రమణీమూర్తిని నిందించవద్దు. ఆమె ప్రేమమయి, రసధుని, ఆనందచేతన. ఈ సకల కళా కళ్యాణ సాక్షాత్కరింపజేసుకో. నీ నిస్సంగ ప్రకృతి నుంచి మరొక మెట్టు పైకెక్కి చూడు. నేను దర్శిస్తున్న ప్రేమ జ్యోతిని నీవు కూడ దర్శించగలవు. ప్రేమోపాసకుడు కానివాడు దైవోపాసకుడు కూడ కాలేడు.''** [1]

1. 'రాగవాసిష్ఠం' - రూపకం - ౭౧ వ పుట

ప్రేమకు సంబంధించినయితివృత్తమే ఆయన రూప(నాట) కాలన్నింటిలో వున్నది. అనుభూతుల ఫలితంగా ప్రేమా, వివాహము సంభవం అవుతాయి, అని భీమన్న 'పైరుపాట' ద్వారా తెలిపాడు. భాగ్యవంతుడైన 'శ్రీవత్స' పేదరాలైన 'స్నేహ'ను కులాంతర ప్రేమ వివాహం చేసుకుంటాడు. ఇలాంటి ప్రేమనే 'రాసాద్వైతం' అంటాడు భీమన్న.

''రసాద్వైతం' అనేది రసుజ్ఞుడైన భీమన్న భావించిన భావనా భావోపహారం. మహర్షులు సాధించిన మధు విద్యలా మనస్సంపన్నుడైన కవితను సాధించి ఆరాధించే ఆధ్యాత్మిక సిద్ధాంతానికి 'రసాద్వైతం' అని పేరుపెట్టుకున్నాడు''[1]

ఈ రసాద్వైత సిద్ధాంతం భీమన్న యొక్క సాహిత్య ధోరణియే అని చెప్పాలి. కవిత్వంలో భావకవిత్వ ధోరణుల నుండి ఆధునిక అభ్యుదయ ధోరణులు వచ్చినట్లుగా నవలా రచనలో యితివృత్తం శిల్పం, శైలి నవీన పదాలు బయలుదేరినవి. అట్లే మనోవిశ్లేషణ, తాత్త్విక చింతన, రాజకీయ సిద్ధాంత విశ్లేషణ మొదలైనవన్నీ నాటక రచన ప్రేరకాలైనాయి. ఇదంతా మనం భీమన్న శైలిద్వారా గమనిస్తాం.

అసలు శైలిని గురించిన అవగాహన పాశ్చాత్య సంస్కృతీ ప్రభావమే అని చెప్పాలి. బోయి భీమన్న శైలి ప్రధానంగా ఆలోచనాప్రేరకమైనది. ఆయన ముఖ్యంగా చేసింది గొప్ప సాహిత్య కృషి ఏమిటంటే. మానవ హృదయంలో ప్రధాన భాగమైన ప్రేమ. ఇది ముడుచుకుపోయిన 'టచ్ మీ నాట్' మొక్కలా (అత్తి పత్తాకు) కాకుండా పుష్పంలా వికసించి లతలా పచ్చగా ఉండాలనే ఆశతోను భీమన్న సరళమైనశైలిలో రచనలుచేశాడు. ప్రేమించలేని హృదయాలు తేమలేని లత కొమ్మలు. ఈ ఛాయలు 'పైరుపాట' రూపకంలో కనిపించవు.

1. భీమన్న సాహితీ షష్టి పూర్తి సంచిక – ౨౨ వ పుట

చిక్కని చక్కని హరితములై వికసించి శోభను తెలుపుతున్నాయి.

గడ్డి పిల్ల: ''పేరూ ఊరూ లేని
పేద పిల్లనై యుండి
అందని ఆనందాలకు
అఱ్రులుచాతు వెందుకో!

శ్రీవత్స: మేడలు మిద్దేలు వున్నా
మెత్తని పానుపులున్నా
హృదయం లేకున్నపుడు
వృథయేగద బ్రతుకంతా?''[1].

ఇలా కులాంతరమైన సమాజాన్ని జానపదుల పవిత్ర ప్రేమ జీవనాన్ని సుందరంగా చక్కని శైలిలో రచించాడు.

బోయి భీమన్న తానగా కాక ఇంకొకరుగా చెప్పడం కూడ ఒక గొప్ప శైలి. ఈ శైలి తన రచనలన్నిటిలోను కనిపిస్తుంది. ''పడిపోతున్న అడ్డుగోడలు'', ''బాలయోగి'', ''ఆదికవి వాల్మీకి'' మొదలగు ప్రసిద్ధ రూపకాలలోను తాను పొందిన అనుభూతి వ్యంగ్యంగాను హాస్యంగాను రచించాడు.

బోయి భీమన్న శైలీ విలక్షణత పాఠకులను శక్తివంతంగా ఆకట్టుకొంటుంది. ఇందులో సందేహం లేదు. కొంతవరకు ప్రాచీన శైలి మరియు సరళశైలి లోను వ్రాసిన రచనలు వీరిని సాహిత్య జగుత్తులో విరాట స్వరూపునిగ నిలబెడుతాయి. ఏది ఏమైనప్పటికీ గూడ బోయి భీమన్న జీవితం కంటే కళ శక్తిమంతమైనదని ఆ కళను ఎలా వాడుకోవాలో తెలిసిన కవి బోయి భీమన్న అని చెప్పవచ్చును.

ఆధునిక సాహిత్యంలో బోయి భీమన్న కు ఒక ప్రత్యేకమైన స్థానమూ, స్థాయీ ఉన్నాయి. ఎవరి మార్గ దర్శకత్వమూ లభించక పోయినప్పటికి నీ

1. పైరుపాట – రూపకం – 12 వ పుట

అంతరాంతరాల్లోంచి కవితావేశం సౌందర్యారాధనా యోగం అద్వైత భావాభిముఖంగా ప్రవహించింది. తెలుగు సాహితీ క్షేత్రాన్ని పునీతం చేసింది. ప్రతి తెలుగు గుండెను పారిజాత తరువులా పరవశింపజేసింది.

**ఈ శైలి విషయమ్మై మరికొన్ని ముఖ్య వివరాలు తెలుసుకొందాం.**

## <u>బోయి భీమన్న రూపకాలు:</u>

| | | శబ్దం | |
|---|---|---|---|
| శైలి | భాష<br>భావం<br>నాటకీయత | . | అలంకారిక వర్ణనాత్మక సంభాషణాత్మక<br>శైలి రచయిత యొక్క ప్రతిభకు సంబంధించిన నడక. దీనినే ఆంగ్ల వ్యాసాంగంలో 'స్టయిల్' అంటారు. |

**<u>భాష:</u>**

రచయితకు భాషపై అధికారముండాలి. భాష బాగా తెలిసినపుడే అతడు రచనానుగుణంగా, స్పష్టంగా వ్రాయగలడు. ఒక పేరాగ్రాఫ్‌లో ఒకే పదం పదే పదే పునరుక్తి కాకుండా చూసుకోగలగాలి. పేరాగ్రాఫ్ చాలా క్లుప్తంగా అందంగా ఏ మాత్రం భావం చెడకుండా వ్రాయగలగాలి. భీమన్న రూపకాలలో చక్కని భాష కనిపిస్తుంది. ఇది బోయి భీమన్న ప్రత్యేకత.

**<u>భావం:</u>**

ఒక రచయిత అధిక సంఖ్యలో రచనలు గావిస్తున్నపుడు ఒకే విధమైన భావప్రకటన అక్కడక్కడ కనబడే ప్రమాదం ఉంది. ఈ ప్రమాదం సంస్కృత

కవి కాళిదాసుకూ, ఆంగ్లకవి షేక్స్‌పియర్‌నకు కూడ తప్పలేదు. అట్లే బోయి భీమన్న విషయంలోనూ అనవచ్చును.

ఎంత గొప్ప రచన అయనాసరే అందులో పాఠకుడిని ఆకట్టుకోగలిగే మంచి సూక్తి, ఓ మంచి వాక్యం, ఓ చక్కని బావ ప్రకటన లేక పోతే అది గొప్ప రచనగా నిలువదు. ముఖ్యంగా శబ్దప్రయోగంలో రచయిత శ్రద్ధ చూపాలి.

ఉదాహరణకు :

"దొర:- యేం చేయాలి. సమాజంలో బ్రతకాలిగా. తప్పదు. సరేగాని, ఇప్పుడు నువ్వేం చేస్తావ్ ? నీడలేని అడదాని పట్ల పిల్లి కూడ పులి లాగే ప్రవర్తిస్తుంది. తెలుసుగా. మీనాన్నకు కోపం తగ్గే వరకు మా ఇంటికి రా పోదాం.

ప్రగతి:- (హేళనగా) ఏ ఇంటికి ?

దొర:- నీ ఇష్టం. ఏ ఇంటికైనా సరే. ఇప్పుడన్నీ ఖాళీగానే వున్నై.

ప్రగతి:- పులి కోరల నుంచి తప్పుకొని, సింహం నోట్లో దూరిన ట్టవుతుంది. వద్దులే బావా ! థేంక్సు" [1].

ఇలా ఒక సంఘటనని ఆహ్లాదకరంగా బోయి భీమన్న చిత్రీకరించడానికి అతని శైలియే కారణం.

నాటకీయత:-

కవిత్వమూ, భావుకత్వమూ, శైలీ, శిల్పమూ కలిసి నాటకీయతను సృష్టి స్తున్నాయి. వీటన్నింటికన్న వర్ణనద్వారా మంచి నాటకీయత వచ్చిన

1. ప్రగతి-రూపకం - 31 వ పుట

సంఘటన, ప్రేమలో హీరో హీరోయిన్లు కలుసుకునే దృశ్యం. బోయి భీమన్న రూప(నాట)కాలలో తిలకిస్తాం.

ఏయే పాళ్ళలో నాటకీయత ఉండాలి ? ఎంతెంత పాళ్ళలో పాఠకుల మేధస్సు ప్రభావితం అయ్యేలా వ్రాయాలి, అనేది బోయి భీమన్నకు బాగా తెలిసిన విద్య. రామాయణం, భారతంలోను గొప్ప నాటకీయత వుంది. ఉదాహరణకి:-

''సీత మాయలేడిని చూసినప్పుడు దానికోసం రాముణ్ణి పంపించి కొంత సేపటికి ''హా ! లక్ష్మణా!!'' అన్న కేక వినిపిస్తుంది. లక్ష్మణుడు అది రాక్షస మాయ అంటాడు. అప్పుడు సీత అతణ్ణి నిందిస్తుంది. లక్ష్మణుడు అన్నని వెతుక్కుంటూ బయలుదేరతాడు.

ఈ సంఘటన చదువుతున్నంత సేపూ పాఠకుల్లో ఉత్సుకత అలాగే నిలిచి ఉంటుంది. వారికి అది మాయలేడి కాదని, రాక్షసుడని తెలుసు రాముడు ఆ రాక్షసుణ్ణి చంపేశాడని గూడ తెలుసు. కానీ సీత లక్ష్మణుడ్ని పంపిస్తూ ఉంటే ' అయ్యో వద్దు, వద్దు' అని చెప్పాలనిపిస్తూ ఉంటుంది. ఈ విధంగా పాఠకుల్ని ప్రేరేపింప చెయ్యటమే నాటకీయత లక్షణం'' [1]

Alfred Sutro, Charles Lee, Lady Gregory, Horold Brighouse, F.Sladen - Smith, Allan Monkhouse మొదలగు ఆంగ్లరచయితల రచనల్లో కూడ ఈ నాటకీయత ఎక్కువగా కనబడుతుంది.

కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ నాటకాల్లోని మహాకవి బోయి భీమన్న రూపకాలలోను కూడ ఈ విధమైన నాటకీయత కనబడుతూ వుంటుంది. అయితే వారు నాటకీయత కన్న కవిత్వానికి, భావుకత్వానికి, శైలికి శిల్పానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు. అందువల్లే వారి రచనలు శాశ్వతంగా నిలబడిపోయాయి అని చెప్పవచ్చు.

1 'ప్యాపులర్ రచనలు చేయడం ఎలా' - ౨౫వ పుట

# భీమన్న పాత్ర చిత్రణ

నాటక విమర్శకులు పాత్ర చిత్రణను అప్రధానమని భావింప లేరు. నాటకీయతకు సంబంధించిన కథయు, సన్నివేశమును, సంభాషణ నాటక వస్తువునందు పాత్రలతో సంబంధించి యుండక పోయినచో అప్రౌఢములగునని భావించియుండిరి.

Henry Arthur - Jones మాటలలో "Story and incident and situation in theatrical work are unless relatated to character comparatively childish and unintellectual. They should indeed be only another phase of the development of character.......... [1] ఇలా 'హెన్రీ ఆర్థర్ జోన్స్' నాటకవము యొక్క ప్రధానాంశము గురించి పేర్కొన్నారు.

తోలు బొమ్మలాటలో బొమ్మలు కనబడునే గాని సూత్రధారుడు మాత్రం కనబడడు. అట్లే బోయి భీమన్న రూపకాలలోని పాత్ర చిత్రణయందు తన ప్రతిభ కనబరిచారే గాని కవిగా తాను మాత్రం ఎక్కడా కనబడలేదు. బోయి భీమన్న రూపొందించిన పాత్రలన్నీ సజీవ రూపాలై మనకు దర్శన మిస్తాయి.

ఈ దిగువ చూపిన భీమన్న రూపకాలలోని ముఖ్యమైన సజీవ పాత్రలు. ఇవేగాక మానసిక పరిస్థితుల, ప్రకృతిలోని వస్తువులు, భావములు, ప్రతీకలు కూడ వీరి రూపకముల యందు పాత్రలుగ చిత్రణ చేయమడియుండును.

1. 'విశ్వనాథ వారి నాటకములు : ఒక పరిశీలన' - ౧౦౬ వ పుట

# బోయిభీమన్న పాత్రల చిత్రణ

- కూలిరాజు
  - జ్యోతి
  - ప్రేమకుమార్
  - నిష్కాలయోగి
- పైరుపాట
  - స్నేహ
  - శీల
  - శ్రీవత్స
- రాగవాసిష్ఠం
  - వశిష్ఠుడు
  - అరుంధతి
- బాలయోగి
  - బాలయోగి
  - వెంకన్నశెట్టి
- ప్రగతి
  - ప్రగతి
  - మార్గమిత్ర
- పాలేరు
  - వెంకన్న
  - బాల
  - ఉపహారం
- అసూయ
  - రేరాణి
  - విశ్వం

"సామ్రాజ్ఞీ శ్వశురేభవ సామ్రాజ్ఞీ శ్వశ్రాంభవ
ననాందరి సామ్రాజ్ఞీభవ సామ్రాజ్ఞీ అధిదేవృషు"[1].

అన్న ఋగ్వేదంలో స్త్రీ గృహానికి మహారాణి అన్న భావం కనబడుతుంది. ఈ విధమైన స్త్రీ ఔన్నత్యాన్ని దృష్టిలో పెట్టుకొని రామాయణ భారత భాగవతాల మత పురాణేతిహాసాలన్నీ కూడ స్త్రీని గౌరవించాలని బోధిస్తాయి.

ఈ విధమైన సాహిత్య వాతావరణంలోని స్త్రీని తత్త్వదృష్టితో పరిశీలించి

స్త్రీని మాతృమూర్తిగా. ఒక సోదరిగా, భార్యగా ఆమెను దర్శించి ఆమెకు గల పూర్వపు గౌరవ మర్యాదలను పురుద్ధరించిన మహాకవి బోయి భీమన్న. వీరు ఆమె బాహ్య సౌందర్యానికి కాక అంతరంగ సౌకుమార్యానికి ప్రాధాన్యతనిచ్చి ఒక వివేకవతిగాను సబలగాను సాహిత్య జగత్తులో నిలిపారు. వీరి రూపకాలలోని పాత్ర చిత్రీకరణ పద్ధతి, పాత్రల వెనుక దాగిన వైఖరి పాఠకుల హృదయాలను స్పృశించడానికి దర్శనమిస్తాయి.

నాటకాల్లో రంగస్థలం మీద ప్రవేశించిన పాత్ర మొదటి నుండి చివరి వరకు ఒకే మాదిరిగా ప్రవర్తించాలి. అంటే పాత్రపోషణ (Characterisation) లో దాని స్వభావంలో మార్పు రాకూడదు. ఇక పోతే చిన్న చిన్న వాక్యాల ద్వారేనే పాత్ర పాఠకుని మనసులోకి చేరడానికి అవకాశముంది. అయితే నాటకీయత ఉన్న రూపకాలలో అంతగా ఉపయోగించలేదు కొందరు రచయితలు. సంభాషణ పాత్రోచితంగానే సాగాలి తప్ప వేరేవిధంగా కొనసా కూడదు.

ఉదాహరణకు :

'పాలేరు' నాటకంలో వెంకన్న, తెలివితేటలున్న కథా నాయకుడు. అలాగే భావకురాలైన వలబాల కథానాయికగా సృష్టించబడినది. ఈ రెం పాత్రలు కూడ మొదటి నుండి చివరి వరకు ఒకే విధంగా నడుస్తాయి.

ఒక సంఘటనలో ఒక పాత్ర చాలా ఉదాత్తంగా ప్రవర్తిస్తే మరొక సంఘటనలో అదే పాత్ర దానికి భిన్నంగా ప్రవర్తిస్తే అలా ఎందుకు ప్రవర్తించిందో రచయిత వివరంగా పాఠకులకి చెప్పవలసియుంటుంది.

ఉదాహరణకు :-

హరిశ్చంద్రుడు మొదటినుండి సత్యవంతుడు. సత్యం కోసం తన భార్యయైన చంద్రమతిని అమ్మేస్తాడు. తరువాత అతడు ఎంత మానసిక క్షోభని అనుభవించాడో రచయిత చెప్పకపోతే ఆ పాత్ర పట్ల పాఠకులకి సానుభూతి పోతుంది. అట్లే బోయి భీమన్న రచన 'రాగవాసిష్ఠం' లో వసిష్ఠుడు ఉదాత్తంగా ప్రవర్తిస్తూ తన ప్రియురాలు అరుంధతి దళిత కులానికి చెందినదని తెలియగానే మారిపోతాడు. తరువాత తన మార్పునకు చింతిస్తాడు.

''ప్రాచీనుడికి మతిలేదు. కాదు నాకు మతి లేదు. ఆ స్థితిలో నిన్ను విడిచిపెట్టి వచ్చిన నేను క్రూరుణ్ణి''[1] అంటూ మానసిక బాధను వ్యక్తంచేయడం వలన ఆ పాత్రపై పాఠకులకి సానుభూతి కలుగుతుంది.

పాఠకుడు ఎటువంటి సానుభూతినైతే ఆ పాత్రమీద చూపుతాడో, అలాంటి సానుభూతి చూపే పాత్ర మరొకటి ఆ రచన యందుండాలి. ఆ పాత్ర కథానాయిక అయితే మరీ మంచిది. పాఠకుల ఊహించుకున్న గుణాల్ని పాత్రలలో దర్శించడానికి ప్రయత్నిస్తారు కనుక పాత్రోచితంగా పేరు పెట్టడం అనేది అతిముఖ్యం. ఒక పాత్ర పేరు చదవగానే పాఠకుడి మనసులో ఒక విధమైన రూపురేఖలు ముద్రించుకు పోవాలి.

ఉదాహరణకు :

''పైరుపాట'' నాటకంలోని 'శ్రీవత్స' పేరు. ఈ పేరు చూడగానే న్యాధికుడు, భాగ్యవంతుడు అని తెలియవస్తుంది.

పేర్లు పెద్దవిగా కాకుండ చిన్నవిగా ఉంటే చదవడానికి సులుగుగా

1. 'రాగవాసిష్ఠం' - 47 వ పుట

ఉండగలవని, భీమన్న తన రచనల్లో చిన్న పేర్లనే ఎక్కువగా వాడినాడు. పాత్ర తాలూకు మనస్తత్త్వాన్ని, స్వభావాన్ని పాఠకులు లోతుగా అర్థం చేసుకొనే లాగు చిత్రీకరించాడు భీమన్న .కాని ఎక్కువ రూప(నాట)కాలు వ్రాయటం వలన ఒకే రకమైన పాత్రపోషణ కొన్నింటిలో కనబడటం జరిగింది. ఇది ఇంగ్లీషు రచయితలు సిడ్నీ షెల్టన్, అయాన్ రాండ్, జేమ్స్ హాడ్లీ ఛేజ్ మొదలగు వారి రచనల్లోనూ కనబడుతున్నది.

## వెంకన్న:

ఈ పాత్ర 'పాలేరు' నాటకంలోనిది. ఇది సమకాలీన సామాజిక దృక్పథం కలది. వాల్మీకికి రాముడు సమకాలీనుడు. వ్యాసుడికి ధర్మరాజు సమకాలీనుడు, బోయి భీమన్నకు వెంకన్న సమకాలీనుడు. ఈ విషయం 'పాలేరు' నాటకం ''బాణాకర్ర'' పేజీ నం. XII లో భీమన్నయే తెలిపినాడు. 'వెంకన్న' ఒక పాలేరు. బోయి భీమన్న స్వయంగా అనుభవించిన పాలేరు తనం యొక్క చేదు అనుభూతిని 'వెంకన్న' పాత్రలో లీనం చేశాడు. ఈ పాత్ర గుణగణాలు ఇలా ఉన్నాయి.

i) అమాయకత్వం

ii) చదువుపై పట్టుదల

iii) వనబాల ఎదుట నిర్మలమైన ప్రేమ

iv) ఉపాధ్యాయుని ఎడ గురుభక్తి

v) పెద్దల యెడ గౌరవం

vi) స్నేహితుల ఎదుట స్నేహశీలం

పాలేరు వెంకడు ఒక దళిత బాలుడు. చదుపై శ్రద్ధ కలవాడు. చదువు కోసం ఎన్నో బాధలు పొందాడు. భూస్వామి వద్ద పాలేరుగా ఉంటూ అజ్ఞానియైన తండ్రి చేత కష్టాలు అనుభవించి ఒక ఉపాధ్యాని సహాయంతో పెద్ద చదువులు చదువుతాడు. డిప్యూటి కలెక్టరు పదవి చేబడుతాడు. భూస్వామియైన కుబేర్రావు చేసిన తప్పులను మన్నించి ఊరికి ఉపయోగపడతాడు. మూఢ నమ్మకాలను వమ్ముచేస్తాడు. వెట్టి చాకిరీ తొలగిస్తాడు. సుందరం చెల్లెలు బాలను కులాంతర వివాహం చేసుకుంటాడు.

ఈ పాత్రలో భీమన్న దాగి ఉన్నాడు. వర్ణాంతర వివాహమే జాతి ఐక్యతకు సోపానం. పట్టుదల ఉంటే చదువనేది వస్తుంది. అనాచారం తొలుగు తుంది. అంటూ పాత్ర ద్వారా తెలియజేస్తాడు రచయిత.

గంభీరంగాను, సహజ సిద్ధంగాను పాత్ర చిత్రణ గావించి బోయి భీమన్న ప్రసిద్ధ నాటక కర్త అయినాడు.

బోయి భీమన్న ''పాలేరు'' లో 'వెంకన్న' పాత్రను నాయకునిగా సృష్టించాడు. ''కూలిరాజు'' లో 'పరంజ్యోతి' పాత్రను నాయికగా సృష్టించాడు. ఈ రెండు దళిత పాత్రలే. 'కూలిరాజు' లో నాయికకు 'పాలేరు' లో వెంకన్నకు ప్రాధాన్యత కల్పించాడు. ఈ రెండు పాత్రలకు సామ్యముంది. అట్లే ''కూలిరాజు'' లోని 'నిష్కలయోగి' కి ''పాలేరు'' లోని 'ఉపకారికి' స్వామ్యముంది. సామ్యము గల పాత్ర 'పరంజ్యోతి'.

## పరంజ్యోతి:

ఈమె 'కూలిరాజు' నాటకంలోని కథానయిక. అబల లాంటి ఆడ

పిల్ల కాదు. సబలయైన స్త్రీ మూర్తి. నాయకత్వపు లక్షణాలు గల మహిళ. మనస్సులోని భావాన్ని నిర్భయంగా చెప్పగల సాహస స్త్రీ.

'పరంజ్యోతి' ఒక కూలి పిల్ల. తన గ్రామంలో కూలి సంఘాన్ని నడుపుతుంది. భూస్వామి విశ్వనాథరావును, రౌడీనాయకుడు భయంకర రావును ఎదిరిస్తుంది. నిష్కల వీర్, మధుమూర్తి, మిత్ర అను వారి వలన కార్మి ఉద్యమాలు చేబడుతుంది. మధ్యలో ఎన్నికలు వస్తాయి. అందులో వ్యవసాయ కూలీ కాంగ్రెస్ గెలుస్తుంది. పరంజ్యోతి భారత అధ్యక్షురాలిగా ఎన్ను కోబడుతుంది. రౌడీ భయంకరరావు పశ్చాత్తపంతో ఆత్మహత్య చేసుకుంటాడు. భూస్వామి విశ్వనాథరావు కుమారుడు ప్రేమకుమార్ పరంజ్యోతిని ప్రేమిస్తాడు. పరంజ్యోతి ప్రేమకుమార్ ను వర్ణాంతర వివాహం చేసుకుంటుంది.

పాత్ర వెనుక దాగిన వైఖరి దాని సంభాషణ వలన తెలుస్తుంది.

ఉదాహరణకు :-

''నిరుద్యోగాన్నీ, నిరాశనీ, దారిద్ర్యాన్నీ, దాస్యాన్నీ, బాధనూ, బలహీనతనూ, అవిద్యనూ, అధర్మాన్నీ నిర్మూలించి మన ప్రజలందరికీ చాలినంత తిండీ బట్ట కొంపా కలిగిస్తా,''[1]. సాధారణమైన సంభాషణతో సజీవ పాత్రచిత్రణ గావించిన భీమన్న గొప్పతనం, పరంజ్యోతి పాత్రద్వారా గమనించగలం. ఇంకా ఈ జ్యోతి పాత్ర ద్వారా భీమన్న కోరుకున్నదేమిటంటే ఒక దళిత స్త్రీ మూర్తి భారతదేశానికి అధ్యక్షురాలు కావాలంటాడు. మనదేశం ప్రజాస్వామ్యమైనది, మతాతీతమైనది, లౌకికమైంది. ఇట్టి రాజ్యంలో దళితులకు ఉన్నత స్థానం లభించాలని కోరుకుంటాడు.

1. 'కూలిరాజు' నాటకం - 1[illegible]1 వ పుట

బోయి భీమన్న ''మానవుని మరొక మజిలీ'' రూపకంలో ''స్వయం ప్రభ'' పాత్ర చాలా గొప్పది. ఇది విశ్వశక్తి స్వభావం గలది. దీనిని నాయిక పాత్ర అనవచ్చు. ప్రకృతి పుట్టుకను గురించి, మానవుని అవతరణను గురించి ప్రతీకాత్మక పాత్రల కల్పనతో చిత్రణ జరిగింది. ఇది భీమన్న చమత్కృతి. తాత్త్విక చింతన తెలిపే పాత్ర ఇది.

## స్వయం ప్రభ

ఈ పాత్ర ధర్మ బోధన స్వభావం కలది. సస్య, క్షేత్రయ్య, భూలక్ష్మి, భోగయ్య, ఆశావతి, మేధానిధి, సూరన్న, చంద్రన్న ఇంకా ప్రజలను సంబోధిస్తుంది.

ఉదహరణకు :-

''గ్రామమ్మున కిది పునరా
గమనోత్సవము
ప్రేమమ్మున కిది కళ్యా
ణామృత రసము
పుణ్యపురుషుడై మళ్ళీ
పుట్టినాడు మానవుడు'' [1]

ఈ పై మాటల ద్వారా స్వయంప్రభ యొక్క స్వభావం తెలుస్తున్నది. సత్యానికీ, ధర్మానికీ అనుగుణంగా వ్యూహ పాత్రను సృష్టించి భీమన్న కీర్తి పొందాడు.

బోయి భీమన్న ''రాగవాసిష్ఠం'' రూపకంలోని పాత్రను పురాణోక్తంగా కల్పించుకొని నాటకశైలిలో చక్కగా చిత్రించాడు. అరుంధతి, వసిష్ఠుడు,

1. 'మానవుని మరొక మజిలీ' - రూపకం- 21వ పుట

సంధ్య, పరమశివుడు, ప్రాచీనుడు, శివోహం కులగిరి, గోష్పాదం, కుంభోదరు, మునులు ఇంకా ప్రజలు మొదలైన పాత్రలను చిత్రణ గావించి రూపకం రచించాడు.

**వసిష్ఠుడు:**

ఇతను ఆదర్శపురుషుడు. సాంఘిక దురాచారాన్ని ఎదిరిస్తాడు. కులభేద భావం ఎంత ఘోరమైందో తన ప్రేమ ద్వారా తెలియజేస్తాడు. చిన్న కులస్థురాలైన అరుంధతిని ప్రేమించి పెండ్లాడుతాడు. పరస్పర ప్రేమ అభేదమైనదీ అద్వైతమైనదీ అని తెలియజేస్తాడు. స్త్రీ, పురుష సమానత్వము అద్వైతమూ ఇదే శివ పార్వతుల యందునూ తమ యందునూ కలదని తెలియజేస్తాడు.

**అరుంధతి:**

ఆమె అస్పృశ్యురాలు కావచ్చు. కానీ ఆమె యొక్క సరళ స్వభావం నిర్మలమైంది. ప్రకృతి సౌందర్యం అంతా ఆమె అందంలోనే ఉంది. ముఖబింబం బ్రహ్మతేజమై వెలుగొందుచుండును.

**"ముఖ బింబమందు సంపుల్లమై బ్రహ్మతే**
**జము సహస్రాబ్జ తేజమున వెలుగు"** [1]

పై పద్యం ద్వారా భీమన్న అరుంధతి అందాన్ని ఎంత గొప్పగా చిత్రించాడో తెలిసింది. ఇంత అందచందమున్న అరుంధతి గుణంలోనూ, శీలములోనూ ఉన్నతమైనదిగా చిత్రించాడు రచయిత. వసిష్టుడు ఈమెను ప్రేమిస్తాడు. కాని ప్రాచీనుడు వీరి ప్రేమను అంగీకరించడు. మానసికంగా బాధిస్తాడు. అరుంధతి ధైర్యంగా ఎదుర్కొంటుంది. చివరకు అరుంధతి వశిష్ఠుడిని కులాంతర వివాహం చేసుకుంటుంది.

1. 'రాగవాసిష్ఠం' రూపకం - 46 వ పుట

చిన్న కులస్థులనే భావనతో ఉన్నతమైన గుణం కలవారిని సాంఘిక అసమానతతో చూడటం విచారకరం అనే అభిప్రాయాన్ని అరుంధతి పాత్ర చిత్రణ ద్వారా తెలియజేశాడు భీమన్న. కొత్త దంపతులకు మార్గదర్శిగా నేటికినీ ఆకాశాన తారయై వెలసింది అరుంధతి.

"Tradition traces her (arundhati's) birth and parantage to a family of out castes, but, by her pativratya she became to be respected as the greatest woman that vedic India ever produced" అని శ్రీ బి.హెచ్. సత్యనారాయణ గారు భవభూతి ఉత్తర రామ చరితలోని అరుంధతి పాత్ర పోషణను పరామర్శిస్తూ త్రివేణిలో పేర్కొన్నారు.

విశిష్టమైన స్త్రీ పాత్రలు చిత్రించడంలో భీమన్నకు ఓ ప్రత్యేతకత కలదు. ఇతనికి వివిధ చిత్తవృత్తులు గల మగ పాత్రలు సృష్టించుటకంటెనూ ఆడ పాత్రలను సృష్టించుటలో ఎక్కువ శ్రద్ధయున్నట్లు వీరి రూపకాల ద్వారా తెలుస్తుంది. ఇంకా వీరు వర్ణిస్తూ చిత్రించిన పాత్రల్లో ''చాండాలిక'' ఒకరు.

## చాండాలిక:

ఈమె 'చిత్ర కళా ప్రదర్శనం' కావ్యంలోని 'చాండాలిక'' రూపకంలో నాయికామణి. ఈమె అత్యున్నతమైన శీలం కలది. కాళిదాసుని శకుంతల కన్న– అని చెప్పొచ్చు. 'నలోపాఖ్యానం'లోని దమయంతి కన్న సుందర పాత్ర 'చాండాలిక'. ఈ పాత్ర గురించి యిదివరలో ఎందరో ఎన్నో వ్రాశారు. 'చాండాలిక' అంటరాని కులానికి చెందినది. ఆ రోజుల్లో అంటరానితనం అంటురోగంలా భావించేవారు. ఒక శాస్త్రీయ అవగాహన, ఆదర్శభావం కలిగిన ఆనందుడు ప్రేమిస్తాడు చాండాలికను. చాండాలిక ప్రేమిస్తుంది ఆనందుణ్ణి.

1. 'నాగవాశిష్టం' - ప్రస్తావన - 11 వ పుట

చాండాలికను ఒక మానవతా మూర్తిగా ప్రేమ స్వరూపిణిగానూ చిత్రించాడు భీమన్న . చాండాలిక సజీవమైన పాత్ర. ఈ పాత్ర స్వభావం ప్రేక్షకుల మరియు పాఠకుల హృదయాలను కదిలిస్తుంది.

''చిత్ర కళా ప్రదర్శనం' లోని ''దేవయాని'' రూపకంలోని నాయిక పాత్ర పేరు దేవయాని. ఈ పాత్ర చిత్రణ రమ్యంగా చిత్రించాడు భీమన్న.

## దేవయాని:-

ఈమె శుక్రాచార్యుని కుమార్తె. కచుని ప్రేమిస్తుంది. దేవయాని మహాగర్వోద్యమ స్థాని. ఈమెకు తోచిన భావము దాచుకొను అలవాడు లేదు.

**''నేల నీరు గాలి వెలుంగు బైలు లేక**
**మనిన మనవచ్చుగాని ఆత్మగతమైన**
**ప్రేమయే లేక జీవింతురెవరు ? దయను**
**కచుని బ్రతికించి తెచ్చినన్ గావు తండ్రి!''[1]**

పై సంభాషణ వల్ల తెలుస్తున్న ఈ పాత్ర కల్లకపటమెరుగనిదని. స్వభావం నర్మలమైనది. ప్రేమమూర్తి దేవయానిగా పాత్ర చిత్రణగావించాడు. భీమన్న.

దేనికదే ఒక వ్యక్తిత్వం భాసించే నేపథ్య పాత్రలు ''చిత్రకళాప్రదర్శనం లోని రూపకాలలో దర్శనమిస్తాయి. సమాజంలోని ఒక తరహా వ్యక్తులకు ప్రతినిధులు మాత్రమే అని అర్థం తెలిపేలా బోయి భీమన్న పాత్రల చిత్రన చేశాడు. బోయి భీమన్న పాత్రచిత్రణలో ప్రాచీన కవుల ప్రభావం కనబడుతుంది. అదీ అమోఘమైన, అద్భుతమైన రీతిలో సాగిన రచన అని అనవచ్చును.

1. 'దేవయాని' రూపకం - 42 వ పుట

బోయి భీమన్న రూపకాలలో కొన్ని యదార్థ గాథల నాయిక నాయక పాత్రలు గూడ చిత్రణ గావించాడు. అవి సుభాస చంద్రుడు, బాలయోగి, ఆదికవి వాల్మీకి.

**"పరతంత్ర్యపు గాఢాంధకారమందు**
**పర్వ చంద్రుడు తోచె సుభాస చంద్రు**
**డిక తరింతు నుషస్సు వీక్షింతు నంచు**
**భారతము రాల్చె ఆనంద భాష్ప శతము"** [1]

అని అన్నప్పుడు భీమన్నలో నున్న దేశభక్తి ఎంతగొప్పదో కనిపిస్తున్నది. తనలోని భక్తి భావాన్ని 'సుభాస చంద్రుడు' పాత్ర చిత్రణలో కనిపిస్తుంది. యదార్థ గాథల పాత్ర చిత్రణ గావించి చరితార్థుడైనాడు భీమన్న.

ఇంక తాను సృష్టించిన స్నేహ, శీల మరియు శ్రీవత్స పాత్రలు 'పైరుపాట' రూపకంలో సుందరంగాను ప్రేమ మూర్తులుగాను కనిపిస్తాయి.

**స్నేహ:**

ఈమె మాల పిల్ల. కూలి రైతు. అయాయకత్వం ఈమె సొగసు అయితే పేదరికం ఈమె అందం. ఈమెను సహజసుందరంగా చిత్రించాడు భీమన్న. ఈమె ప్రేమ హృదయం నేటికి సమాజ వ్యక్తులైన కొందరిలో కనిపిస్తుంది. ఈమె శ్రీవత్సను ప్రేమిస్తుంది.

**"స్నేహా" యని పిలిచి మనసు**
**స్నిగ్ధం చేశేశావు**
**పడగొట్టిన గుండె తేనె**
**వర్షంతో తడిపావు!** [2]

1. 'సుభాస చంద్రుడు' రూపకం - 103 వ పుట. 2. 'పైరుపాట' - రూపకం - 24 వ

పై సంభాషణతోనే 'స్నేహ' పాత్ర గుణం ఏమిటో తెలుసుకోగల్గుచున్నాం. భీమన్న చిత్రించిన ఈ పాత్ర అతి అద్భుతం అని చెప్పక తప్పదు.

**శీల:–**

ఈమె మితభాషి. పలికిన ప్రతి మాటనూ తూచి పలుగుతుంది. ఈమె 'స్నేహ' స్నేహితురాలు. ఉప-నాయిక అనవచ్చును. ఈమె స్నేహను గాఢంగా ప్రేమిస్తుంది. స్నేహలాగా కూలిపిల్ల. అయినా లౌక్యం తెలిసినట్టిది. కనుకనే స్నేహకు హితవు చెప్పుతుంది శీల. భీమన్న ఈ పాత్రను కోమలమైన చిత్తవృత్తి గల పాత్రగా చిత్రించాడు.

**శ్రీవత్స:–**

ఇది గంభీరమైన నాయక పాత్ర. ఇతను అగ్రకుల విద్యావంతుడు. మరియు విశాలభావాలు కలవాడు. ఇంకా ప్రకృతి సౌందర్యాధకుడు. పాలాల్కోకి షికారుకని వచ్చి స్నేహను ప్రేమించి పెళ్ళి చేసుకుంటాడు. ఎంతో అందంగా, ఆకర్షణీయంగా ఈ పాత్ర చిత్రణ గావించాడు భీమన్న.

> **''పెళ్లైన వాళ్లే ఎక్కువ ప్రమాదకరం బావా! ఇంద్రుడు, రావణుడు, సైంధవుడు, కీచకుడు వగైరా ప్రసిద్ధ దుష్టులంతా పెళ్లైన వాళ్ళే. బేచిలర్‌లని యాభైశాతం నమ్మవచ్చు. వివాహితుణ్ణి నూరుశాతం నమ్మగూడదు''** [1]

పై సంభాషణ ''ప్రగతి'' రూపకంలోనిది. దీనిని కథానయిక 'ప్రగతి' పాత్ర చేత బోయి భీమన్న చెప్పించాడు. ఈ సంభాషణ చేత 'ప్రగతి' పాత్ర యొక్క చిత్రణ కొంత మనకు అవగాహన అవుతుంది.

1. 'ప్రగతి' రూపకం - 33 వ పుట.

## ప్రగతి:

ఈమె పదహారేళ్ళ నృత్యగాన కళావిద్యార్థిని. కథానాయకుడు మార్గమిత్రను ప్రేమిస్తుంది. ఈమె ప్రేమ మూగప్రేమ. అయినప్పటికినీ కాస్త లౌక్యం తెలిసినట్టిది. కొందరు ఈమె అందచందాలకు వ్యామోహితులౌతారు. వారినందరిని చాకచక్యంతో ప్రతిఘటిస్తుంది. పరిస్థితులను బట్టి త్రాగుతుంది, నటిస్తుంది. అపాయాన్ని ఉపాయంతో ఎదుర్కొంటుంది. ఎన్నో శ్రమల కోర్చి శీలాన్ని రక్షించుకుని చివరకు మార్గమిత్రను పెళ్లాడుతుంది.

ప్రతిఘటన స్వాభావం గల పాత్రలో నాయికను సృష్టించి సినిమా ఫక్కీలో నడిపిన తీరు ప్రశంసనీయం. భీమన్న పాత్ర చిత్రణా సామర్థ్యం చాలా గొప్పది. వీరి 'ప్రగతి' రూపకంలో ముఖ్యమైనపాత్రలు పది కలవు అందులో కొన్నింటిని పరిశీలిద్దాం.

## మార్గమిత్ర:

ఇతను కథానాయకుడు. స్వతంత్ర్య భావాలు కలిగిన యువకవి. ఇతనికి మరో పేరు గౌతమీ పుత్ర. నృత్య గాన కళారాధకుడు. ఆదర్శభావం ఇతని ఊపిరి. పవిత్రమైనది ఇతని ప్రేమ. ఇతను ప్రగతి' ని ప్రేమిస్తాడు. చివరకు పెళ్ళాడుతాడు.

బోయి భీమన్న ఈ పాత్రను సాదాసీదాగా అతి సుందరంగా చిత్రించి కీర్తిని సంపాదించాడు.

## ప్రచార్:-

ఇతను ఫోటోల వ్యాపారి. మోసకారి, వంచకుడు. ఇతడు కథానాయిక ప్రగతిని వశపర్చుకోవటానికి ఫోర్జరీ ఫోటోలు తయారుచేసి నాయిక కుటుంబాన్ని అగౌర పరుస్తాడు, కష్టాల పాల్జేస్తాడు.

రచయిత బోయి భీమన్న ఈ పాత్రపై తీసుకున్న శ్రద్ధ ప్రశంసనీయం. చిత్రణ అద్భుతం అని చెప్పాలి.

## శ్రీధాం, దొరబాబు, కృష్ణర్పణం :

ఈ ముగ్గురును దుష్ట త్రిమూర్తులు. నాయిక ప్రగతి' ని నానా హింసలు పెడతారు. అవకాశం అందినప్పుడల్లా అవమాన పరుస్తారు. 'ప్రగతి' శిలాన్ని దోచుకోవడానికి పోటీదారులౌతారు. అలా ఆ పాత్రలను చిత్రీకరణ చేశాడు. రచయిత. చివరకు ప్రగతి చేత ప్రతిఘటింపబడుతారు. నాయిక చేత చావు దెబ్బ తింటారు.

## అబ్బులు; సుబ్బులు; బుద్ధమూర్తి:

వీరిలో ఎవరెవరో మన ప్రజలు స్ఫురిస్తూ ఉంటారు. ప్రేక్షకుల్లో కొందరు భుజాలు తడుముకుంటారు. పాఠకుల్లో కొందరు నాలిక కరుచు కుంటారు. ముఖ్యంగా ఇవి నేపథ్య పాత్రలు పాత్రలన్నీ కల్పితాలైనా, పాత్ర చిత్రణలో సిద్ధహస్తుడు భీమన్న.

## రాజా:

ఇతను 'అసూయ' రూపకంలో కథానాయకుడు. విద్యార్థి కాంగ్రెస్ నాయకుడు. క్రమశిక్షణ గలవాడు. తన నడవడి తోటి విద్యార్థులకు మార్గదర్శకం కావాలని కోరుకునేవాడు. ఇతని గురించి ఇంకా...

**''చూడ చక్కని వాడు, సుందరా కారుడే**
**శోభాయ మానుడే మా రాజా**
**కలువ కన్నుల వాడు చలువ చూపుల వాడు**
**చెలువంపు చెలికాడె మా రాజా''** [1]

1. 'అసూయ' రూపకం – రంగం 1

ఈ రచయితకి తన పాత్రలన్నింటి పైనా 'సింపతీ' వుంది. కాని ఇంకా అతని హృదయంలో ఓ మూల చెప్పలేని బాధ వుంది. దాన్ని తన భావనాశక్తితో ఉదాత్తం చేసి పాఠకుల ముందు పెట్టారు.

భీమన్న మరో రచన 'పడిపోతున్న అడ్డు గోడలు'' రూపకంలో వైవిధ్యం గల పాత్రలు రూపొందించాడు. వ్యంగ్యంగా, హాస్యభరితంగా రచించిన ఈ రూపకంలోని పాత్రలన్నీ కల్పితాలే. కానీ కళాత్మకాలు. ముఖ్యంగా ఇవన్నీ సజీవ పాత్రలే అని చెప్పవచ్చును.

"Life is short, Art is long" అని సామెత ఉంది. అట్లే సాహిత్యం మీద విమర్శ ఉంది. "Diversity of opinion about a work of Art shows that the work is new, complex and vital. When critics dis-agree the artist is inaccord with himself oscarwilde " [1] - (గురజాడ సమకాలికుడు.)

ఈ విమర్శను కాదనలేడు భీమన్న. కనుక భీమన్న ప్రతిమాటా సిద్ధాంతమే. ప్రతి మాటా ఒక సందేశమే. ప్రతి పాత్రా ఎవరి జీవితనికో ప్రతిబింబమే. తన రూపకాలలో అతి హృద్యంగమమైన సంభాషణలూ, నాటకీయతా గుర్తించగలిగిన వారికి భీమన్న నాటకాలను పలువురను మెప్పించగల రీతిలో వ్రాయగలడని అనిపించి తీరుతుంది.

## కొన్ని ముఖ్య విషయాలు:

1. వీరి రూప(నాట)కాలలో పాత్ర చిత్రణ చాలా గొప్పగా ఉంది. మంచివి, చెడువి, సంధిగ్ధ పాత్రలు స్పష్టంగా (Clear) చెప్పబడినాయి.

---

1 'కన్యాశుల్కం నాటక కళ – 264 వ పుట

2. చిన్న చిన్న పాత్రల ప్రభావం భీమన్న రచనలలో చాలా ప్రాదాన్యత వహించాయి.
ఉదహారణకు :'పాలేరు' లోని ''ఉపకారి'', 'కూలిరాజు' లోని ''నిష్కల మోగి''.

3. ఒక పాత్ర యొక్క ఉదాత్తతని పాఠకులకి వదలివేయాలంటే దాని గురించి ఎంతతక్కువ వ్రాస్తే అంత మంచిది. అలాంటి పాత్రే – 'ఉపకారి' (పాలేరు నాటకం లోనిది).

4. పాత్రలకి పేర్లు పెట్టేటప్పుడు పాఠకులకి కన్ఫ్యూజన్ ఉండేటట్లు పేర్లు పెట్టరాదు. అదేవిధంగా పాత్రపేరు పాత్ర స్వభావానికి తగినట్లుగా వుండాలి. ఈ విషయంలో బోయి భీమన్నది పై చేయిగా భావించవచ్చును.

. ఒక రూప(నాట)కంలో . వచ్చిన పాత్రలు తరువాత రూప(నాట)కాల్లో అదే విధమైన స్వభావాన్ని కలిగియుండేటట్లు చిత్రీకరించడం భీమన్న రచనల్లో జరుగలేదని చెప్పవచ్చును.

6. ఒక పాత ఎలాంటిదో రచయిత చెప్పటం కన్నా ఒక నాటకీయమైన సంఘటన ద్వారా చెప్పటం జరిగింది .
ఉదాహరణకు :- 'ప్రగతి' రూపకం.

7. సంఘటన వ్యూహాలు సంఘటనలా కాకుండా పాఠకులు ఊహించలేని రీతిలో ఉండి, దాని ద్వారా పాత్ర యొక్క స్వభావం బయట పడితే రచయితకి కీర్తికి లభించినట్లే. భీమన్న ఈ విషయంలో చాలావరకు కృతకృత్యులైనారు.

8. పాప్యులర్ నాటకాలకి నాటకీయమైన సంఘటనలు తప్పనిసరి. వాటికిమిగతా అంశాలు తోడైతే అది మంచి 'నాటకం' గా నిలుస్తుంది.

ఉదాహరణకు:- భీమన్న గారి 'రాగ వాసిష్ఠం''.

# భీమన్న సాహిత్య రస పోషణ

సంస్కృతంలో కావ్య శాస్త్ర గ్రంథాలు రచించిన ఆచార్యులందరు రసాన్ని ఆనందరూపంగా పరిగణించారు. కావ్య పఠనం వల్ల సాహితీ హృదయులు తన్మయులైపోతారు. ఆ తాదాత్మ్యంలో కలిగే ఆనందమే 'రసం' అని తాత్పర్యం.

రూప(నాట)కాన్ని చూడటం వల్ల, కావ్యాదులను చదవడం వల్ల కలిగే ఆనందమే 'రసం' అని భావం. ముఖ్యంగా ఆనందాన్ని అనుభవించే స్థితికి రసమని వ్యవహారం.

## రస స్థాయి దశలు

| రసానికి గల పేర్లు | రసానికి గల అర్థాలు |
|---|---|
| శృంగారం | మానసికోల్లాసం |
| హాస్యం | ఆహ్లాదం |
| కరుణ | ఆస్వాదం |
| రౌద్రం | ఆనందం |
| వీరం | భౌతికానందం |
| భయానకం | విశుద్ధ ఆనందం |
| భీభత్సం | మాదకత |
| అద్భుతం | తన్మయత్వం |
| శాంతం | చమత్కారం. |

పైన తెలిపిన రస విషయమంతా లోకమార్గానికి సంబంధించింది కాదు, కావ్య మార్గానికి సంబంధించింది . కావ్య విమర్శకులూ కావ్యాస్వాదాన్ని ఆహ్లాదరూపంగా పరిగణించారు. విక్టర్ హ్యూగో, కాల్డ్‌వెల్, వర్డ్స్‌వర్త్ షెల్లీ మొదలైన వారంతా కావ్యాస్వాదాన్నా ఆహ్లాద రూపంగానే నరూపించాడు. అట్లే బోయి భీమన్న కూడా తన రచనల ద్వారా నిరూపించాడు. అరిస్టాటిల్ కూడ కావ్యాస్వాద సందర్భములో pleasure అనే మాటను చాలా సార్లు వాడారు.

"A good play does not busy intself trying to enunciate moral values it assumed them and gets on with its own work of accurate observation" [1]. అని ప్రముఖ నాటక రచయిత హోవర్డ్ విండ్సె వాఖ్యానించారు. ఇంకా రసం గూర్చి ఇలా చెప్పబడింది -

**'మధుర, రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః**
**యేన మాద్యంతి దీమంతో మధునేవ మధువ్రతాః'** [2]

అని కావ్య దర్శనము ప్రథమ పరిచ్ఛేదములో రసమంటే మాధుర్యమని, మాధుర్యమనేది ఒక గుణమని, అది వాక్కు (శబ్దం)లోనూ ఉండవచ్చునని చెప్పబడినది.

మనదేశంలో ప్రప్రథమంగా 'రస' శబ్దాన్ని వాడింది భరతముని. రసం ఒకరకమైన ఆనంద చైతన్యం. శబ్దార్థాల ద్వారా విశుద్ధ భావ భూమికలో ఆత్మ చైతన్య (ఆనందమయ) ఆస్వాదమే రసం. ఈ రసాన్ని భీమన్న రూపక(నాట)కాలో మనం ఒక సౌందర్యంగా దర్శిస్తాం.

1. 'వ్యాసాంజలి' - వ్యాస సంపుటి । ౫ వ పుట-2. కావ్య దర్శనము - ప్రథమ పరిచ్ఛేదము.

ఉదాహరణకు:–

''సర్వ సమ్మత సర్వ సమతా
సావ్య భారత భారతీ
సస్య పుష్కల శ్యామ సుందర
స్వర్ణ గర్భా భారతీ
సకల సుకళా సార సారస్వత
సరస్వతీ భారతీ
శాంతి సౌఖ్య వసంత భూమీ
జన్మ భూమి భారతీ'' [1]

భావమూలకమైన కావ్య సౌందర్యం యొక్క అనుభూతియే (ఆనందమే) రసం. దీన్ని భీమన్న ఈదిగువ కవితలో పొందుపరిచాడు.

''విశాల వినీల వినువీధులలో విహారములు చనలేదా
రెక్కలేల నీకు? పక్షీ!
వసంత లతాంత హృదంతముల పాడలేవే మధురంగా
కంఠమేల నీకు? పికమా!
సమస్త వస్తు సమృద్ధి మధ్యనే సౌఖ్యము లేదా నీకు
బ్రతుకేలా ఓ మనిషీ?'' [2]

బోయి భీమన్న సమయానుసారముగా రసపోషణ చేస్తాడు. ఏ రసము ఎచట వ్యక్తీకరించవలయునో అతనికి బాగా తెలుసు. కనుకనే 'రాగవాసిష్ఠం' లో వసిష్ఠుని పాత్ర ద్వారా ప్రకృతి సౌందర్యాన్ని ఇలా వర్ణించాడు.

1. 'అసూయ' – రూపకం మొదటి రంగులో 2. 'అసూయ' రూపకం మొదటి రంగంలో

"ఇందిందిరానంద తుందిలమ్ములు, సుంద
రామంద మంజీర రవళి గాగ;
మంద మారుత చలన్మాకంద నవదళ
స్తబకమ్ము, శాటీ ప్రశస్తి గాగ;
తరు శిరస్సమంత వీర పుష్పరస బిందు
రుచి లసన్మణిహార రోచిగాగ;
కిసల మాలయ కళాకృతి రామెత్తుకో
కిల గీతి ప్రియ నాట్యగీతి గాగ;
ఉదయ భాను సదా గమనోత్సవమున
నాట్య మాడగ సాగె సంధ్యాకుమారి
మకుట కుసుమ రజమ్ములు మహికి రాల
మహి రజమ్ములు మకుట సుమాల జేర!" [1]

వీరి రచనల్లో కనబడే మరొక విశేషం ప్రేమ. సృష్టి సమస్తాన్ని ప్రేమ దృష్టితో వీక్షించడం వల్లనే ప్రకృతి సౌందర్యం కనిపిస్తున్నది.

"ఆకు రాల్చి మోడైన తాటాకు కొంప
అట్లె యున్నది వికసింపనైన లేదు
తమ్ముల మొగాలు ఇంత భత్యము లేదు
కార్మికుని బ్రతుకేమి మాఘమ్ము గాక" [2]

బోయి భీమన్న చిత్రించిన శృంగార రసం విలక్షణమైనది. మధుర భావోపేతమైనది. రసములన్నింటిలోనిది అత్యంత మధురము మరియు ఆనందజనకమూయై యున్నది. 'పాలేరు' నాటకంలోని ఓ మచ్చుతునకయైన

'రాగవాసిష్ఠం' రూపకం - ౯ వ పుట 2. 'కూలిరాజు' రూపకం - ౮ వ పుట

ఈ పాట చూడండి :

వెంక: కలువ పువ్వా విరిగె, చెం
గలువ నవ్వా పిలచె
ఎవరే వలచిరి నన్ను?
ఎవరే పిలిచిరి నన్ను

బాల: ఆశా సుమ వల్లికల, ఉ
య్యాలలు గట్టితినోయీ
హృదయ పీఠినిన్నుంచి, ఊ
పించెద రావోయూ'' [1]

బోయి భీమన్న గావించిన మరొక శృంగార రస చిత్రణ 'రాగవాసిష్ఠం' లో భగ్న ప్రేమికుడైన వసిష్ఠుడి చేత చెప్పించిన పద్యం.

'' తలిరాకు కిటికీల దరిచేరి యేపు చూ
పులు మాటి మాటికి పలుకరించు
చూపులా అవి ? కావు సూటిగా నా యాత్మ
సారసమ్మును చీల్చి షట్పదములు
చెంగల్వ మోవి చీల్చిన కావి లేనవ్వు
ఎండలు గాయు నా గుండెలోన
గుండె గాదిది – హోమ కుండము, పలుకొక్క
నేతి బొట్టుగ మండు నిప్పులందు
నీరజాస్యనాకు నిత్యాగ్ని హోత్రమై

1. 'పాలేరు' రూపకం – 103 వ పుట

నమిలి మ్రింగ సాగె నన్ను నన్ను!

ప్రణయ యజ్ఞమందు ప్రాణాలను యజించి

సోమ పానమగుదు సుగతి సెదవి'' [1]

ఇక 'పైరుపాట' గేయరూపకంలోను బోయి భీమన్న శృంగార రసాన్ని అతి సున్నితంగా సుకుమారంగా పోషించాడు.

ఉదాహరణకు :

''ఎదర తనుంటేనే నా

యెద ఎంతో పొంగుతాది

ఎక్కువ నా కెందుకూ ?

ఇతరము నాకెందుకూ ?

ఎందుకు రమ్మన్నాడో

పెందల కాడే!

పచ్చని పువ్వుల గుత్తుల

పట్టుచీర కట్టుకొని

ఆపచేను నన్ను చూచి

అపహాస్యం చేస్తున్నది'' [2]

బోయి భీమన్న మరొక రూపకంలో శృంగార భావ చిత్రణ ఇలా చేశాడు. ఇది అసమాన్యమైనది. తిలకించండి:

''తావిగా నిను వలచి

పూవునై వికసింతు

తేనెగా నిను పిలిచి

1. 'రాగవాసిష్ఠం' – రూపకం – ౮౨ వ పుట 2). 'పైరుపాట' – రూపకం – ౬4 వ పు

తీయనై ప్రవహింతు

నీ వలపునే గ్రోలి జీవింతురా స్వామి

నీ లీలతో నేల పాలింతురా!

చీకట్ల యొడిలోని

చిరుత సంజను నేను

నీ వెలుగు జల్లుకై

నిండుటంజలి నేను

నీమూర్తి నాలోన నిలిపేనురా స్వామి

నీ ముద్దుతో జగము నింపేనురా !''[1]

బోయి భీమన్న అంతరాంతరాల్లోని కవితావేశం సౌందర్యారాధన, అద్వైత తత్త్వాధారంగా శృంగార రూపాన్ని ధరించుకున్నది.

ఉదాహరణకు చిత్ర కళా ప్రదర్శనంలోని కవితలు:

''నేను బాల రసాల లతనోయ్

నేను మాధవ నీకు జతనోయ్

ఉగాదికి రుచుల గాదెను నే

జగానికి మధురిమ నోయ్''

ఈ వగరు పిందెలా

నీ వలపు రసధునులు

ఈ తేనెటీగలా

నీ తలపు దూతికలు

నవ్వరే యెవరైన

నవ కవులు వింటే ?''[2]

1. 'మానవుని మరొక మజిలీ' రూపకం - 4 వ పుట 2) 'చిత్ర కళా ప్రదర్శనం' లోని వసంత స్వయంవరం - 14, 15 పుటలు

బోయి భీమన్న ''రసోవైసః'' అను సూక్తి నెరిగినవాడు అగుటచే రసస్వరూపుడగు భగవంతుని గూర్చి భక్తి రసపూరితమైన కవితలు వ్రాశాడు.

**''ఈ యెడాలిలో మబ్బు నీడలా**

**ఓయాసిసులా, దేవా?**

**నడిసంద్రములో జడి వర్షములా**

**నౌకాశ్రమమూ, దేవా?**

**వేసవి నడి మధ్యాహ్నములో – చలి**

**వేంద్ర గట్టితివె, దేవా**

**పడగొట్టిన యీ పాంథుని నోటికి**

**పాయసన్నమూ, దేవా'' [1]**

పూర్వం జగన్నాథ పండితుడు లౌకిక సుఖం, బ్రహ్మానందం, కావ్యానందం అని ఆనందాన్ని మూడు విధాలుగా భాగించి కావ్యానందానికి ఇతర ఆనందాలకి భేదం ఉందని చెప్పాడు. అనగా రసం కావ్యానందం. ఈ ఆస్వాదం ఆనందమయం. అంటే రసం. ఒక రకమైన ఆనంద చైతన్యం. శబ్దార్థాల ద్వారా విశుద్ధ భావ భూమికలో ఆత్మచైతన్య (ఆనందమయ) ఆస్వాదమే రసం.

అలౌకికం హృదయ గమ్యం, ఆధ్యాత్మికం బుద్ధి గమ్యం కావటం చేత ''రాగవాసిష్ఠం'' రూపకంలో సహృదయుడు పొందే రసానుభూతి సగం అలౌకికం, సగం ఆధ్యాత్మికం ఉంది. ఉదాహరణకు:–

**''నీవే గతివి – నీవే పతివి**

**నిఖిలావని కో దేవా!**

**కమ్మని తేనెకు, కరకు ముల్లునకు**

**కాడవు నీవే వో దేవా!**

---

1) పాలేరు నాటకం ౩౫ వ పుట

**జీవన పతి! నా జీవనగతిలో**

**పూవులు పుడికిన దీ వేనా!**

**కరుణకు పట్టిన ధరణీ హస్తము**

**కరువున నింపుట తగవేనా!**

**ప్రణయమె మొలవని పాటి నేలలో**

**ప్రణవ కోకిలా రవమా!''[1]**

బోయి భీమన్న రచనలలో కావ్య శరీర స్థానీయమైన శబ్దం ఉంది. ఆత్మయైన రసం ఉంది. ఈ రస ం గూర్చి ఆనాడు సాహిత్య దర్పణకారుడైన విశ్వనాథుడు రస స్వరూపానికి చెందిన వివేచనల సారాంశాన్ని ఈ క్రింది శ్లోకంలో పొందుపరిచాడు.

**''సత్త్వోద్రేకాద ఖండ స్వ ప్రకాశానంద చిన్మయ:**

**వేద్యాంతర స్పర్శశూన్యో బ్రహ్మాస్వాద సహోదరః।**

**లోకోత్తర చమత్కార ప్రాణః కైశ్చిత్ప్రమాతృభిః**

**స్వాకార వద భిన్నత్వేనాయ మాస్వాద్యదే రసః ॥''[2]**

(చిత్తంలో సత్త్వోద్రేకం కలిగిన దశలో విశిష్ట సంస్కారాలతో కూడుకున్న సహృదయుడు అఖండ స్వప్రకాశానందమూ, చిన్మయమూ, ఇతరాలయిన

అన్ని రకాలయిన జ్ఞానాలచేత వినిర్ముక్తమూ బ్రహ్మాస్వాద సహోదరమూ, లోకోత్తర చమత్కార ప్రాణమూ అయిన రసాన్ని నిజస్వరూప భిన్నంగా ఆహ్వాదిస్తాడు.) బోయి భీమన్న 'ప్రగతి' రూపకంలో విశ్వనాథుడు వివేచించిన రససారాన్ని గమనిస్తాం. లోకోత్తర చమత్కార ప్రాణమూ అయిన రసాన్ని పొందుతాం కూడా.

---

1. 'రాగవాసిష్ఠం' - ౯౧ వ పుట (౨).'మిసిమి' - మాసపత్రిక - జనవరి, ౧౯౯౨ సంచిక

''ముచ్చట గొలిపే కత్తికి
వచ్చి నెత్తురాహారం
ఉరిమే తరిమే మేఘం
కరుణా రస హృది కాదా ?''[1]

పై కవిత యందు కరుణరసము నింపారు. ఇది సుకుమారమైన రసము ద్రవింపజేయునది. కనుకనే కరుణ రసం దీని పేరు. భీమన్న రూపకాలలో ''పైరుపాట'' రసభరితం. దీనిలోని మరికొన్ని రసాలు రుచిమూడండి.

''పంపరమ్మ దీవించి
వచ్చని లత కూనలార
పైరు గాలి సందిట్లో
పవళించిన పైరు లారా!''[2]

''ఎన్ని రాత్రులీ యొంటరి
తిన్నె పైని కూర్చుండి
నా మది మడతలను విప్పి
మీ ముందర పరచితినో''[3]

పై కవితల యందు అద్భుత రసాలు నింపి బోయి భీమన్న రస హృదయాన్ని తెలియజేశాడు. అద్భుత రసము విస్మయ మనెడు స్థాయి నుండి వచ్చినది ''శేష'' రసమని కూడ పిలుతురు.

బోయి భీమన్న కనబరచిన ''శాంతరసం'' 'చిత్ర కళా ప్రదర్శనం' లోని 'గులామి ప్రసవించింది' రూపకంతో చూస్తాం. ఈ శాంత రసము 'శమ' యను స్థాయి నుండి వచ్చినది. దీని వలన ఆత్మజ్ఞానమను స్థాయి కలుగును.

---

(1). 'ప్రగతి' రూపకం 80 వ పుట (2). 'పైరుపాట' 84 వ పుట 3. 'పైరుపాట' రూపకం – 85 వ పుట

ఉదాహరణకు 'గులాబి ప్రసవించింది' లోని కోకిల పాత్ర పలుకులు:

ముగ్ధ సుందర లత ఛరించెడి
మూగి వేదనకు శ్రుతి కలిపి
ఆత్మ వేదన ననుభవించెడి
అఖిల వనమును గొంతు నిలిపి
నాద రూపము నొసగి ప్రకటన చేతు నేను
నన్ను ఎవరేమన్న నేనిది మానలేను.
పరుల దుఃఖము లెక్క చేయని
పాడు కులమును కొంద్రు గాని
పాడు తనమున కోటి దుఃఖాల్
గూడు కట్టుక యుండు టెరుగరు
గుండె నిండే పొంగి పొర్లే మందులన్నీ
గొంతు వెల్వడు చుండు పాటల రీతి చిన్నీ''[1]

బోయి భీమన్న యొక్క భీభత్స రసం జుగుప్సా స్థాయి నుండి పుట్టినది. ఇది చూచుటకు వీలు కానిది. ఈ రసాన్ని 'చిత్రకళాప్రదర్శనం' లోని మొక రూపకం ''అంధకారంపై విజయం'' లో చూస్తాం.

''అంధకారం! అహకారం
గంధకాగ్ని జ్వాలలు
భరత సుందర నందముపై
నరక సేవలు దాడులు
నరుని న్యాయపు టెల్లమీద

1) 'గులాబి ప్రసవించింది' రూపకం - 25 వ పుట

వరక దైత్య విజృంభణం
పాలు త్రాగి – రొమ్ము గుద్ది
పచ్చి నెత్తురు పీల్చడం

రోగ కారక విష క్రిమిగా
రోజు రోజుకు పెరిగి పోతూ
చోటుచాలక తిండి దొరుకక
పేటు రేగిన దురంతరం

అందినవి దిగమ్రింగు కొంటూ
అసుర మూకలు హద్దు దాటిరి
మానవత్వపు గుండెలోకి మారణాస్త్రాల్ పేల్చిరి'' –[1]

''మానవత్తపు మేటి విలువలు
మంచి చెడ్డలు మంట గలిపె
ప్రాణదేవత పంచశీలకు
పక్కటెముకలు విరిగెను

నాగరికత నాశమయ్యెను
వాల్క సాచెను రక్త దాహం
తోడి మనుజుని విరుచుకొని తిను
దుర్జనత్వం బలిసెను'' [2]

ఇక 'అసూయ' రూపకం తిలకించినపుడు ఆరవ రంగంలో రచయిత ''రౌద్రరస పోషణ' కనిపిస్తుంది. 'రౌద్ర రసము క్రోధము నుండి పుట్టినది. శత్రువు నాశనము చూచునది రౌద్రము. ఈ కవితలో చూడండి:

1. అంధకారంపై విజయం – 168 వ పుట 2) అంధకారంపై విజయం – 170 పుట

''కిట్టని తనమా గట్టు తెగినదా
కొట్టుకు పోవునో లోకం
మానవ ధర్మము మన్ను గలిసెనా
మంచికి రోజులు కావా?
పగటి దొంగలే ప్రజా నాధులా
రౌడీ దేనా రాజ్యం
ఏ మోయీ ప్రభూ! ఏమి న్యాయం
ఎవడీ సృష్టికి కర్త??
మా వెరుగని ఈ ప్రాణి గున్నకు
కొమ్మలు విరచే ఘోర తుఫాను
క్రూరమైన పులి కోరల నుండి
లేడికి రక్షణ లేదా??'' [1].

బోయి భీమన్న చిత్రించిన భయానక రసం విలక్షణమయినది.ఇది భయము నుండి పుట్టిన రసము. ఇందు వికృత శబ్దమును వినుట, కనుట జరుగుతుంది. భీమన్న గారి ''రాగవాసిష్ఠం'' రూపకంలో ఆ రసం మనకు కనిపిస్తుంది.

''చింత నిప్పులు వోలె వర్షించు చున్న
చండ భాను కరాలు శీర్షమున దాల్చి
ఆశ్రితుల కిందు కలశాల అమృత మొసగు
శివుని దలపి,చుచున్నవీ చెట్లగవములు'' [2]

1. 'అసూయ' రూపకం ౬ వ రంగం – 2. 'రాగవాసిష్ఠం' – రూపకం ౨౧ వ పుట

బోయి భీమన్న కవిత్వము వలచి వరించినది. అతని 'పాలేరు' రూపకంలో రసభావోల్లాసం సహృదయులు అలౌకిక రస భవాలకు సహపంక్తి భోజనం. ఇందులోని సీరరసం తిలకించినపుడు భీమన్న వీర రూపంతో పాటు అతని తాత్త్విక చింతన కూడ కనిపిస్తుంది. వీరరసము ఉత్సాహమను స్థాయీ భావము నుండి ఉత్పన్నమైనది. ఉత్తమ, ఉదాత్త, త్యాగము మొదలైన రీతులలో ప్రవర్తింపవచ్చును.

అందుకు ఉదాహరణ ఈ పాట:

**"ధైర్యము విడిచెదవా, వీరా!**
**ధర్మము మరచెదవా!**
**పరకను పాముని భయమొందుదువా**
**పిడివాడవై పరువెత్తుతువా**
**బానిసత్వమని బాధ పడుదువా**
**స్వేచ్ఛా జీవిక అందరానిదా**
**ఓ యువ వీరా! ఉత్తేజముతో**
**సాగిన నీ దాస్యము విడిపోదా ?**
**నిస్పృహ యేలా ? నీ హృదయములో**
**సోమరితనముకు చోటీయకుమా**
**విక్రమింపుమా వీరుడవై**
**విజయము నీదేరా"** [1]

'పాలేరు' రూపకంలో రచయిత కనబరచిన భావప్రకటన, రసపోషణ ప్రశంసనీయములై, మనోజ్ఞములై యున్నవి. ఉదాహరణకు 'దుఃఖ రసము' లోని గీతిక :

---

1 'పాలేరు' రూపకం - 26 వ పుట

''పైన మబ్బే లేదు, పైరు గాలే లేదు
మండు వేసవి లోన మాడిపోనేలా
రాలిపోవే మొగ్గా – రాలిపోవమ్మా !
ఇన్నాళ్ళు తన ప్రేమ కన్నీటి ధారచే
నిన్ను పెంచినావాడు నిర్దయాత్మకుడయ్యె
ఏలనే బ్రతుకింక రాలిపోవమ్మా!
లావణ్యమే పోయి జీవనంబే అరి
చీడ పట్టి కృశించి చితికి పోనేలా
రాపోవే! నేడే రాలిపోవమ్మా!''[1]

ఇక హాస్యరసం. ఇది నవ్వు నుండి పుట్టినట్టి రసము. ఆనందమును కలిగించునది. నవ్వించునది. ఇది కూడ 'పాలేరు' నాటకంలో కనిపిస్తుంది. రచయిత భీమన్న 'పాలేరు' రూపకాన్ని రసభరితంగా రచించాడు. అందులో ఓ హాస్య పాట :

'' పట్నమెల్లి పోదామె నాబుల్లి సీతా! మనం
పెళ్ళి చేసుకుందామె నా చిట్టి సీతా
పట్నమెల్లి పోదాము
పెళ్ళి చేసుకుందాము
పని చేసుకునీ బం
గారంలా బతుకుగాము
వొంటి నిండ నగలెడలా, బంగారు [illegible]
కంటి నిండ కనబడలా, పువ్వుల గొవ్వామ్మా'

1. 'పాలేరు' నాటకం – 87 వ పుట జ. [illegible]

బోయి భీమన్న కే లం రూపకల్పన యందే కాదు; భావ చిత్ర యందునూ అసమాన్యుడు. ఇతను చిత్రించిన మరో హాస్య సన్నివేశం 'ప్రగ రూపకంలో చూస్తాం.

''జారిందే పైట కొంగు జంగుపిల్లి
ఊడిందే రైక ముడి ఊసరవెల్లి
నీ కళ్ళు
నేరేడు పళ్ళు
నీ వొళ్ళు
గులామి ముళ్ళు
కుదిరింది బేరం పందులో
ఎక్కింది దారం సూదిలో
తలకు బండ
మొలకు జెండ
మొగసిరి మొనగాడు
మొదలెడితే గిజిగాడు'' [1]

ఇక పోతే బోయి భీమన్న రూపకాలలోని కథను ఓ ప్రక్కన వుంచి ద్యాలు పాటలు మనం విన్నప్పుడు గాని చదవినపుడు గాని పొందే ి గురించి వివేచిస్తే మనకు కొన్ని విశేషాలు తెలుస్తాయి.

1. ౧౦ – 14 వ పుట

1. రస హృదయుడైన పాఠకుడు పాత్రల్లో తాదాత్మ్యన్నిభజించి రసానందాన్ని పొందుతున్నాడు.

2. సాహితీ హృదయుడిందులో అలౌకికార్థాల వెనుక ఆధ్యాత్మిక భావన, చేస్తున్నాడు.

3. పాఠకుడిందులో ప్రాతిభాసికమైన స్థితికంటే అతీతమైన ఆత్మానందస్థితిని అందుకోగలుగుతున్నాడు.

4. భీమన్న రూపకాలలోని తాత్త్విక చింతనని గ్రహించి పాఠకుడు గాని, ప్రేక్షకుడుగాని ఆ తత్త్వం వెనుకనున్న సచ్చిదానంద రసానుభూతిని పొందుతున్నాడు.

ముఖ్యంగా బోయి భీమన్న శృంగారమును, హాస్యరసమును, వీరరసమును అద్భుతంగా పోషించాడు. తాత్త్విక గేయూల ఆధునిక ఆంధ్రకవులలో బోయి భీమన్న కొక ప్రత్యేక స్థానం కలదు.

"రసేనైవ సర్వం జీవతి కావ్యం
నహి రస శూన్యం కావ్యం కించి దస్తి
రస ఏవ వస్తుతః ఆత్మా."



# భీమన్న శిల్ప వైభవం

అలంకారికులు కావ్యమును 'దృశ్య' మని, 'శ్రవ్య' మని రెండు విభాగాలుగా చేశారు. దృశ్యమనగా చూడదగినది, శ్రవ్యమనగా వినదగినది. డా.బోయి భీమన్న గారు దృశ్య నాటకాలు వ్రాశాడు. దృశ్య నాటకములకు పర్యాయపదం రూపకాలు. వీరి ప్రతి రూపకాములో పాటలు, పాద్యాలు ఉన్నాయి. అందువల్లనే ఇవి సాహిత్య సంగీత సరస రసాత్మకాలు. పఠితలకు పరమరమ్యాలు.

క్రీ.శ. 1880లో వావిలాల వాసుదేవశాస్త్రు గారు ''నందక రాజ్యం'' అను తొలి తేటగీతి పద్య సంభాషణగా నాటకం వ్రాశారు. వీరి రచనలు దృష్టిలో నిలుపుకుని నాటి ప్రజా సమస్యల్ని కవిత్వానికి ఇతివృత్తంగా స్వీకరిస్తూ కవిత్వాన్ని వాచ్యమాధ్యమంగా కాకుండా 'ధ్వని' గర్భితంగాభీమన్న రూపకాలు వ్రాశాడు. అంతే కాదు, వీరి నాటక సాహిత్య శిల్ప వైభవంలో ఒక విధమైన ప్రత్యేకత కనబడుతుంది. వీరి రచనలు పరిశీలిస్తే మనకు ఈ దిగువ విషయాలు తెలుస్తాయి.

పటములో తెలిపిన విషయమంతా ఒక సమర్థుడైన కవి తన భావ చిత్రణ కోసం, రచనారక్తి కోసం ఉపయోగించే ప్లాన్ (Plan) లాంటి సాహిత్య శిల్పమని భావించవచ్చు.




బోయి భీమన్న రచనలో శిల్పం అంతర్లీనంగా మిళితమై ఉంటుంది. అంటే పూలదండలో దారం మాదిరిగా అని చెప్పొచ్చు. శిల్పం అనే పదానికి సరియైన నిర్వచనం ఇవ్వడమే కష్టమే. శిల్పం అంటే ఒక జీవకళ.

నేర్పరియైన చిత్రకారుడు ఒక చిన్న బియ్యపు గింజపై గాంధీగారి బొమ్మ వేశాడు. అది సాలార్ జంగ్ మ్యూ జియంలో నేటికినీ చెక్కుచెదర కుండా ఉంది. బియ్యపు గింజపై బొమ్మ వేయడం మహాద్భుతం అనేది ఎంతో చిత్రమైన విషయం. అలా విచిత్రంగా, అద్భుతంగా వ్రాయండం అనేది ఒక శిల్పం. ఇది ఒక విధంగా రూపం లాంటిది. ఆకారం లాంటిది. ఈ రూపం, ఆకారం సహజమైన వరాలు. అవే సహజమైన అందాలు కూడా. శిల్పం సహజమైన అందమైతే అది స్వతః లభించవలసిన సంపద.

**<u>శిల్ప పరమైన కొన్ని ముఖ్య విషయాలు:</u>**

1. సమర్థుడైన శిల్పి చెక్కిన రాతి బొమ్మలో జీవకళ ఉంటుంది. ఆ జీవకళయే శిల్పం. భ్రమ, భ్రాంతి కల్గించేది శిల్పమైతే ఆ శిల్పంలో కవి తన అప్రతిమానమైన కౌశలాన్ని ప్రదర్శిస్తాడు.

2. కథానాయకుని లేదా కథానాయిక పరంగానో కథ చెప్పడం ఉత్తమమైన శిల్పమైతే ఆ శిల్పాన్ని బోయి భీమన్న 'పాలేరు' నాటకంలో కథానాయకుని పరంగా అద్భుతంగా కథ సాగించాడు.

3. కథ ఎక్కడి నుండి ప్రారంభమైందో తిరిగి ఆ కథ అక్కడికే వచ్చి ముగించబడటం అనేది మరోకరకమైన శిల్పం.

ఉదాహరణకి :-

" దున్నపోతు దున్నపోతు ! దుక్కిలెందుకు వన్నవ్ ?
వసులోడు కాయంది నన్నేమంటవ్
వసలోడా, వసలోడా ! వసులెందుకు కాయవ్ ?
పటేలు జీతమియ్యంది నన్నేమంటవ్
పటేల! పటేల ! జీతమెందుకియ్యవ్ ?
పోల దొరకంది నన్నేమంటవ్ ?
పోల, పోల ! ఎందుకు దొరకవ్ ?
వడ్లోడు చెక్కంది నన్నేమంటవ్.
వడ్లోడా, వడ్లోడా ఎందుకు చెక్కవ్?
బాడిసె తెగంది నన్నేమంటవ్
బాడిసె, బాడిసె ఎందుకు తెగవ్ ?
కమ్మరోడు సర్వంది నన్నేమంటవ్
కమ్మరోడా, కమ్మరోడా! ఎందుకు సర్వవ్ ?
తిత్తి ఊదంది, నన్నేమంటవ్

**తిత్తి, తిత్తి! ఎందుకు ఊదవ్?**

**దున్నపోతుచావంది, నన్నేమంటవ్''**

పై కవిత దున్నపోతుతో ప్రారంభించబడి దున్నపోతుతో ముగించబడినది.

4. నాటకం కొన్ని రంగాలుగా విభజింపబడుతుంది. ముఖ్యంగా ఆ రంగాల పరిశీలన ఇలా వుంటుంది.

మొదటి రంగం పూర్తి కాగానే రెండో రంగాన్ని అవే పాత్రలతో కాకుండా వేరే పాత్రలతో మొదలు పెడితే అప్పుడు రచన బాగా రక్తి కడుతుంది. ఈ రక్తి కట్టడం కూడా ఒక శిల్పమే. ప్రేక్షకుడు, పూర్తయిన మొదటి రంగంలో జరిగింది చూసి అదే టెన్షన్‌లో రెండవ రంగాన్ని కూడా చాలా అసక్తిగా చూస్తాడు. ఇక రెండవ రంగ, ముగింపు కూడా ఓ రకమైన సస్పెన్స్‌తో పూర్తి చేసి, ఎక్కడైతే మొదటి రంగం ముగుస్తుందో అక్కణ్ణుంచి మళ్ళీ కథ ప్రారంభించి, దాగిన సస్పెన్సు విప్పి మళ్ళీ మరొక సస్పెన్సు ముడివేసి వేరే రంగంలోకి ప్రవేశించాలి. ఇట్లా నాటక రచనలో ఒక రకమైన శిల్పాన్ని అంటే టెక్నిక్‌ని ఉపయోగించడం ఆంగ్ల రచయితల రూపకాలలో గమనిస్తాం. ముఖ్యంగా షేక్స్‌పియర్ నాటకాలలోనూ మరియు బెర్నార్డ్‌షా యొక్క రచన 'ఆర్మ్స్ అండ్ ది మ్యాన్' నాటకంలోనూ చూస్తాం. అదే మాదిరిగా బోయి భీమన్న రూపకాలలోనూ ఈ శిల్పవైభవం కనిపిస్తుంది.

"An image is that which presents an intellectual and emotional complex in an instant of time" [1]. అన్న మాటలకు అక్షరాలా ఉదాహరణ ప్రాయమైన కవితలు భీమన్న రచనల్లో కనిపిస్తాయి. నిర్మాణ శిల్పంలో ప్రత్యేకత కలిగిన 'పాలేరు' రూపకంలో –

1. దివి ౨౮౦౧౦.౯౧ 'ఉదయం' దిన పత్రికలోని 'ఆధునిక తెలుగు కవిత్వంలో శిల్ప దృష్టి నూతన అభివ్యక్తి - వ్యాసంలో )

''పుణ్య భారత భరతీ పుత్రులార
కన్న బిడ్డ లజ్ఞానాంధకారమందు
ఒకరి నొకరు పట్టి కొట్టుకొనుచుండ
విద్య అనియెడు కాగడా వెలుగు జూపి
ఏల రక్షించుకొనరు మీ బాలికులను'' [1]

ఇలా భీమన్న సామాన్య విషయాన్ని అసాధారణమైన తాత్త్విక ఉపమానంతో గంభీరంగా చెప్పాడు.

తాత్త్వికంగా ఆలోచించనపుడు బోయి భీమన్న జ్ఞానమార్గం సామాన్యులకు సుబోధకం కాదని భక్తిమార్గం అందరకీ అందుబాటులో ఉంటుందని భావించి తన రూపకంలో 'ధ్వని' ప్రధానమైన పాటలు, పద్యాలు వ్రాశాడు.

ఉదాహరణకు :

''అకట దూలీ అలసిన బ్రతుకున
ఆశే ప్రాణము – దేవా!
కాలే కడుపుకు – మండే నూడిద
కమ్మని కూడో – దేవా'' [2]

ఇక అభివ్యక్తి వాహికలు లేకపోతే రచన వట్టి వచనమై పోతుందనే స్పష్టమైన భావన డా. భీమన్న గారికి ఉండటానికి తాను వ్రాసిన క్రింది పద పాదాలు సాక్ష్యం చూడండి –

---

పాలేరు' రూపకంలో - 10 వ పుట 2. 'పాలేరు' రూపకం - 14 వ పుట

**'' ఈ యెడారిలో మబ్బు నీడలా**

**ఓయాసిసులా దేవా!**

**నడి సంద్రములో జడి వర్షములో**

**నౌకాశ్రయమా దేవా! ''[1]**

ఒక రచనగానీ, కవితగానీ పఠితల మీద ప్రభావం చూపటంలో అందులోని అభివ్యక్తీ, శిల్పమూ ప్రధాన పాత్ర వహిస్తాయి. ఏ నాటి సాహిత్యంలోనైనా ఇవే ప్రధానాంశాలని పరిశీలన వల్ల తెలుసుకోవచ్చు.

**''అయం నిజః పరో వేతి**

**గణనా లఘు చేతసాం**

**ఉదర చరితా నాన్తు**

**వసుధైక కుటుమ్బకమ్''**

వీడు నావాడు, పరాయివాడు అన్న భావన సామాన్యులకు మాత్రమే ఉంటుంది. ఉదార పురుషులకు ఈ విశ్వం ఏక కుటుంబంగానే దర్శనమిస్తుంది. మహాకవి డా. భీమన్న రచనల్లో ఈ పరమాదరణీయ భావమే ప్రాచుర్యం వహిస్తుంది.

'విశ్వ ప్రేమ' – భీమన్న రచనల్లో కనబడే మరొక విశేషం. సృష్టి సమస్తాన్ని ప్రేమ దృష్టితో వీక్షించడం వల్లనే ప్రకృతి సౌందర్యం ఆయన దర్శనంలో పురులు విప్పుకుని కనువిందు చేస్తుంది.

1). 'పాలేరు' రూపకం - ౨౨ వ పుట

ఉదాహరణకు :

''ఆకు రాల్చి మ్రోడైన తాటాకు కొంప
అట్లె యున్నది వికసింపనైన లేదు
తమ్ముల మొగాలు ఇంట భత్యమ్ము లేదు
కార్మికుని బ్రతికేమి మాఘమ్ము గాక'' [1]

ఇలా చెప్పే తీరును, (Way of Style) అదే శైలిని బాపు గీసిన బొమ్మలా, దేవులపల్లి లలిత లలిత పద చలితంగా, శ్రీశ్రీ కవితఘోషలా విలక్షణమైన శిల్పంతో కవితా సృష్టి చేయడం కొద్ది మందికి మాత్రమే సాధ్యం అట్టి కవుల కోవలో శిరః శిఖరీయమానుడు డా. బోయి భీమన్న.

వీరి కావ్యాలలో జీవిత చిత్రణ కళ్ళకు కట్టినట్లుగా సహజ గంభీరం గానూ పూలమాల గూర్చినట్లు గా ఒద్దికగానూ ఉంటుంది. ఈ కవితను పరిశీలించండి.

''కప్పుపై ఆకులన్నియు గాలికెగిరి
పోయె, వానలచే కూలిపోయె గోడ
ఎండి పోయిన శ్రమికుని గుండె వోలె
క్రూర దారిద్ర్య మీ యింట కొలువు తీర్చె'' [2]

శబ్ద, అక్షర విన్యాస, శీర్షికా చమ్కరాల నుంచి భావచిత్ర, ధ్వని ప్రతీకల వరకు అభివ్యక్తి సౌందర్యాన్ని ఎన్ని రీతుల్లో సాధించవచ్చునో ఆ అన్ని రీతులా కవితాపారమార్థికతనుసాధించిన కవి డా. బోయి భీమన్న. తెలగు సాహిత్య వినీలాకాశంలో 'ఉజ్జ్వల తార' గా వెలుగగొందుచున్న గొప్ప భావుకుడు డా. బోయి భీమన్న.

1. కూలిరాజు రూపకం - ౮ వ పుట 2) 'పాలేరు నుండి పద్మశ్రీ వరకు' - ౫౮4 వ పుట

వీరి రచనా శిల్పం రంగుల్లో ముంచి కుంచెతో బొమ్మ గీసినట్లు, తెరమీద బొమ్మ కదలాడినట్లు పఠిత మనస్సును అలవోకగా ఆకట్టుకొంటుంది.

భీమన్న ''పైరు పాట'' రూపకంలో కథానాయకుడు ''శ్రీవత్స కు ముళ్ళు గుచ్చుకొన్న సందర్భములో కారిన నెత్తురు బొట్టు గూర్చి-

''గొబ్బి ముల్లు కాబోలు
గుచ్చుకొన్న దా వ్రేలికి
గూకుతున్న పొద్దల్లె
పాకిందదే నెత్రుబొట్టు'' [1]

భావ సౌందర్యానికి ఆటపట్టైన 'పైరుపాట' లో శ్రీవత్స కథానాయకుడు తన ఆరాధనా భావభారతిని తలపులలో అభివ్యక్తం చేస్తూ వ్యంగోక్తిలో చెప్పిన ఈ క్రింది పంక్తులు భీమన్న అద్భుత భావ చిత్రణా పరిణితిని వెల్లడిస్తున్నాయి.

''ప్రత్యక్షంగా తానై
వచ్చిన శిల్ప భారతిని
తలపైన లేక అజం
తా గుహలకు పర్వెత్తితి
చిత్తంలో ప్రతి దెబ్బా
స్తుతి దెబ్బగా మలచిన
మానవమూర్తిని మించి
మహిత శిల్పమేమున్నది

1 'పైరుపాట' రూపకం - 17 వ పుట

చాలు, చాలు ఇకనైనా
చాలింతును స్వప్నయాత్ర
స్నేహరూప వసంతాన
చేకొందును మధు పాత్ర'' [1]

బోయి భీమన్న ''పైరుపాట'' లో పెక్కు వర్ణ కవితలను ధ్వని వైచిత్రితోను, భావ పరిపుష్టితోనూ చిత్రించి ప్రత్యేకతను నిరూపించుకున్నారు

సీ.'' తలిరాకు కిటికీల దరిజేరి యేపు చూ
పులు మాటిమాటిక పలుకరించు
చూపులా అవి ? కావు సూటిగా నాయాత్మ
సారసమ్మును చీల్చుషట్పదములు
చెంగల్వ మోవి చీల్చిన కావి లేనవ్వు
ఎండలు గాయు నా గుండెలోన
గుండె కాదిది – హోమకుండము, పలుకొక్క
వేతి బొట్టుగ మండు నిప్పులందు
నీరజాస్య నాకు నిత్యాగ్ని హోత్రమై
నమిలి మ్రింగ సాగె నన్ను
ప్రణయ యజ్ఞమందు ప్రాణాలను యజించి
సోమ పాన మగుదు సుదతి పెదవి'' [2]

పద్మశ్రీ బోయి భీమన్న ''రాగవాసిష్ఠం' నాటకంలో వసిష్ఠుని పాత్ర ద్వారా అరుంధతిపై గల ప్రేమను ఊసీస పద్యంలో అద్భుతముగ, చిత్రించి పఠితల మనస్సును రంజింపజేశాడు. వీరు చెప్పిన భావలలో కొన్ని పాతవే

1) 'పైరుపాట' రూపకం ౮౨ వ పుట    2. 'రాగవాసిష్ఠం' రూపకం – ౮౩ వ పుట

కావచ్చు. కానీ వాటిని వ్యక్తం చేయడంలో వీరి భావవైశిష్ట్యం కొత్త కాంతులతో దీప్తివంతమవుతుంది. ''రాగవాసిష్ఠం'' లో సంధ్య పాత్ర ప్రత్యేకమైనది.

**''పెళ్ళి పందెరలోని మల్లె పువ్వువు నీవు**
**మింటి జంటలలోని మేటి తావు నీవు**
**పార్వతీశ్వర మిథున ప్రతిబింబ దీప్తితో**
**పాలించవే తల్లీ పతి గూడి జగము''** [1]

మల్లెపూవుతో అరుంధతిని పోల్చడం అతి ప్రాచీనమైన ఉపమానం. ఈ భావననే కవులు పెక్కు అలంకారాలు ద్వారా వ్యక్తం చేశాడు లోగడ. ఆ పోకడలోనే డా .భీమన్న భావధార జాలువారినప్పటికీ 'మింటి జంటలలోని మేటి తారవు నీవు'' అని చెప్పడంలో నవ్యత చోటుచేసుకుంది.

ఇక 'ప్రగతి అనే రూపకాన్ని పరిశీలించుదాం. బోయి భీమన్న ఈ రూపక పీఠికలో ''తనతో పాటు తన సమాజాన్నీ జాతినీ శ్రేయోమార్గం లో నడిపించడానికి చేసే కృషివల్ల లభించే సంపూర్ణ సత్ఫలితమే ప్రగతి'' అంటాడు. నిజమే ఈ నాటకం కళా సౌందర్య సుమాలంకృతమైనదే. అందుకు సాక్ష్యం –

**''రాతి నుంచి రమణీయ శిల్పమా**
**మట్టి నుంచి మాణిక్య దీపమా**
**ఎవరే, ఎవరే మీరు!**
**ఇంత శోభ నెట తెచ్చారూ?**
**బురద పొలమె పరమాన్న కలశమా**
**పచ్చిక బీడె పాల మీగడా**

1. 'రాగవాసిష్ఠం' రూపకం - 115 వ పుట

ఎవరే, ఎవరే మీరు!
ఇన్ని రుచులు మాకిచ్చేరు ?
చేతి వ్రేళ్ళలో సృజనా శక్తి
భావ వీధిలో ప్రతిభాదేవీ
ఎవరే, ఎవరే మీరు !
ఇంత ప్రగతి సాధించేరు? [1]

మహాకవి భీమన్న తన భావ గాఢతను కేవలం వాచ్యంగానే అవిష్కరించక ధ్వన్యాత్మక శిల్పంతో రమణీయంగా అభివ్యక్తంగా చేశాడు. గుణాత్మక కవితాశోభకు డా॥ బోయి భీమన్న కవితలు మానవతా పరిమళ భావ పారావారాలు.

'ప్రగతి' రూపకంలో బోయి భీమన్న బ్రతుకు మాధుర్యాన్ని అక్షరక్షరంలోనూ ప్రత్యక్షం చేస్తూ ఆశాహ్వాసుదీపికల్ని ఎట్లాప్రకాశవంతం చేశారో గమనించండి –

"కలలలోనే జీవించేవా
కలల నుంచి మేల్కోవా?
కలలు తుడిచీ కళ్లాపు చల్లీ
విరివై సిరివై విరియవా
కలలను మలిపి కళలుగా నిలిపి
కల కాలము మన లేవా?
శిలయే నీవా శిల్పము కావా
గతిలో ప్రగతిగ పదమిడవా

1. 'ప్రగతి' రూపకం – ౩ వ పుట

**కలలే కళలై, ఉలులే పులులై**

**శిథిలాలయమై చెదరి పోదువా**

**మనిషి కావా, మధువులు తేవా**

**జాతికి జీవనమీవా?''** [1]

ఈ విధంగా సాదృశ్య పరంపరతో సన్నివేశాన్ని పఠితకు ప్రత్యక్షం చేయడమే కాక ఆ ఘట్టానికి రసస్ఫూర్తిని కలిగించారు బోయి భీమన్న.

భావాన్ని బలంగా, గాఢంగా చెప్పటంలోని కవి సామర్థ్యం వ్యక్తం అవుతుంది. భావం పాతదే అయినా చెప్పే విధానం లోనే కవి ప్రత్యేకత వెల్లడవుతుంది. భీమన్న సంగీత నృత్య నాటకం ''మానవుని మరొక మజిలీ'' లో ఈ ప్రత్యేక కవితా చిత్రణను గమనిస్తాం. పదాలు, భావాలు కదను తొక్కుతూ ఒక అపూర్వమైన అనుభూతి విభూతితో జిజ్ఞాసువులను పరవశింపజేస్తాయి. ''వాగర్థావివసంపృక్తౌ'' అన్న కవి కులగురువు కాళిదాసు భావాలకు ఈ పంక్తులు పట్టాభిషేకం చేసివిగా ఉన్నాయి. కవి సృజించటమే కాదు; ఆ సృజించి పద పెన్నిదులు జన జీవన శ్రేయోగమనానికి జీవన గంగా సుధా క్షీరాల్ని అందించగలగాలి. అప్పుడే కవి వాక్కు స్థాకమయ్యేది; కార్యం చలితార్థమయ్యేదీనూ. భీమన్న తాత్త్విక బంధనా పరిపూర్ణతకు ఈ కవితలు స్థాయీ దీపికలు.

**''ఝుం-ఝుం-ఝుం-ఝుంకారంతో**

**కదిలిం దదిగో కైలాసం**

**ఘణ్-ఘణ్-ఘణ్-ఘంటాధ్వనితో**

**దుముకిం దదిగో ద్యోగంగ**

1. 'ప్రగతి' రూపకం - ౨౮ వ పుట.

కుహ్-కుహ్-కుహ్ కుహ్ కుహ్రవంతో
వాసించిందదె వాల్లభ్యం
చిట్-చిట్-చిట్-చిట్-చిన్మాధురితో
చిందిందదె పర సౌందర్యం
కలకల విసిరిందదిగో విశ్వం
జల జల కురిసిందదిగో అమృతం
వెలవెల బోయిందదిగో రాత్రి
తెల తెల సారిందిదిగో ధాత్రి'' [1]

బోయి భీమన్న కవిత్వంలో శబ్ద ప్రయోగం ఒక కళగా భాసిస్తుంది. ఒక రమణీయమైన అర్థ స్ఫూర్తిన్ని వెలారుస్తుంది. అలాంటి కవిత 'మానవుని మరొక మజిలీ' లో కనిపిస్తుంది. ప్రకృతి తత్వాన్ని తెలిపే పాత్ర 'స్వయం ప్రభ''. ఈ పాత్ర భీమన్న భావ వ్యక్తకరణ విశిష్టతకు దర్పణంగా నిలుస్తుంది.

''తిమిరాల కోమరు పందిరులలో, నాస్వామి
వెలగి నీ చిరునవ్వు చివురించెరా
నీ కోర్కె క్రొమ్మెరవు నెరసులో, నా స్వామి
విశ్వ రాజీవమే వికసించెరా!
వరదయై పారు నీ కరుణలో స్వామి
పరసమైన నాగుండె స్పందించెరా
పక్వమై యున్న నా ప్రణయాన, నా స్వామి
రమ్యమైన నీ యేపె రాణించెరా!

1. 'మానవుని మరొకమజిలీ' రూపకం - 5 వ పుట

రస్యమౌ నీ పరిరంభాన, నా స్వామి
పులకించి భూదేవి పుష్పించెరా
నీ రసాస్వాద నా స్ఫారమ్మై, నా స్వామి
శ్రీదేవిగా వెలసి క్రీడించెరా'' [1]

డా॥ బోయి భీమన్న శిల్ప ప్రాధాన్యాన్ని, అభివ్యక్తి అంతర్యాన్ని బాగా గుర్తించాడం. ఇతను దేశభక్తిని దృష్టిలో పెట్టుకుని ''చిత్ర కళా ప్రదర్శన'' అనునృత్య నాటికల సంపుటిని రచించాడు. అందులో ''సుభాస చంద్రుడు'' రూపకమొకటి. దానిలోని భావావేశాన్ని గమనిస్తే -

''పారతంత్ర్యపు గాఢాంధకారమందు
పర్వ చంద్రుడు తోచె సుభాస చంద్రు
డిక తరింతు నుషస్సు వీక్షింతు నంచు
భారతము దాల్చెఆనంద భాష్ప శతము'' [2]

పద్మశ్రీ బోయి భీమన్న తాత్త్విక చింనను పరిశీలించినప్పుడు వీరి సాహిత్య వాతావరణంలోని 'స్త్రీ' పవిత్రమూర్తిగా కనిపిస్తుంది. ఆమె బాహ్య సౌందర్యానికి కాక అంతర్య సౌకుమార్యానికి ప్రాధాన్యత నిస్తాడు. ఆమెను గౌరవాదరాలతో అవలోకించిన ఉదార చింతనాపరుడు డా॥ భీమన్న. వీరి 'చిత్రకళా ప్రదర్శన' రూపక సంపుటిలో నున్న 'చాండాలిక' రూపంలో నాయిక చేత చెప్పించిన కవిత చూచినపుడు స్త్రీ ఎడ తనకున్న గౌరవం తెలుస్తుంది.

''ఎక్కడి వీ వూహలు నాకు
అనంత విశ్వంలో ఆడుకొంటున్న
అందమైన భావాలన్నీ

1. 'మానవుని మరొకమజిలీ' రూపకం - 7 వ పుట 2. 'సుభాస చంద్రుడు' రూపకం - 103 వ పుట

దర్శనమిస్తున్నాయి
నా మేల్కొన్న చిత్తం కంటికి
ఆడదై పుట్టిన అదృష్టం నాది'' [1]

ఈ విధమైన అపురూప భావాలతో స్త్రీని పురుషుని కంటె ఉన్నతంగా చూపాడు. కనుకనే భీమన్న రచనలందు స్త్రీ పాత్రలు గొప్ప ప్రాధాన్యం వహిస్తాయి. వీరి కావ్యలందు స్త్రీలు ధైర్య సాహసాలకు పట్టుగొమ్మలు.

మొత్తం మీద నాటక కర్త బోయి భీమన్న తాను నమ్మిన సిద్ధాంతాన్ని సహజంగాను, సౌందర్యోపేతంగానూ ప్రతిపాదించగలడు. భీమన్న ''ఆది కవి వాల్మీకి'' నాటకంలోని కవితలు, ఆయన కవితా హృదయానికి సూచికలు.

''రాముడే పురుషుడు సీత ప్రకృతి యౌను
ప్రణయ ధర్మాల మధ్య పోరాట మిద్ది'' [2]

★★★

''శోకమునకు ఇంత లోకమేలెడు శక్తి
ఎవరి వలన కలిగే ఏల కలిగె?'' [3]

ఈ పద్యంలోని కవితాంశ పాఠకుని హృదయాన్ని ద్రవీభూతం జేస్తుంది. వీరి రచనల్లోని 'కరుణ' రస ప్రాధాన్యాన్ని కళ్ళ ముందుకు తెస్తుంది. మానవత్వ మనుగడకు కొత్త గూడులను నిర్మిస్తుంది.

కవి స్వతహాగా జన్మిస్తాడు తప్ప ప్రయత్న పూర్వకంగా ఏ వ్యక్తీ కవిగా రూపొందలేడన్న విషయం భీమన్నకు బాగా తెలుసు ప్రాచీనాలంకారికుల భాష్యమూ ఇదే. కవి వలెనే యోగీ జన్మతః రూపొందుతాడంటారు భీమన్న. ఈ ఉద్దేశ్యంతోనే ఆధ్యాత్మిక మనస్కులై అంతర్ముఖుడైన 'బాలయోగి' జీవితాన్ని నాటకంగా రూపొందించాడు. పద్యాలూ, గేయాల సమ్మిశ్రితమీ నాటకం.

1. 'చాండాలి' రూపకం - 152 పుట - 2. 3. భీమన్న సాహితీ షష్టిట పూర్తి సంచిక - 100 వ పుట

**"ఎవరు వెలుపల లోపల ఎవరు తలప**
**ఎవరు తనవారు పెరవార లెవరు ధరణి**
**తనకు రాధకు మధ్య బాంధవ్యమేమి**
**ప్రాణమొకటన్న జ్ఞానమె బ్రహ్మతాను"** [1]

ఈ కవితలో పదలాలిత్యము తో పాటు, పద గాంభీర్యమూ వుంది. ఇంకా వైదిక సాంప్రదాయానికి సంబంధించిన సాహిత్య సంపర్కమూ వుంది. ఈ విధంగా వైదిక వాఙ్మయంతోటి తన అనుబంధాన్ని, అభిమానాన్ని అభివ్యక్తం చేసుకొంటాడు డా॥ బోయి భీమన్న.

అవిచ్ఛిన్నతా గుణాత్మకమైన నవ్య లక్షణాలు ప్రతిభావంతంగా ద్యోదకమైనపుడే ప్రగతి భావం ప్రాదుర్భవిస్తుంది. ఆధునిక తెలుగు కవిత్వంలో ఈ లక్షణం ముమ్మరంగా కనబడుతుంది. క్రప్షెంకో "We should not confuse tradition with stagnation" అని అంటూ కళా సృష్టి, సంప్రదాయమూ 'goes in hand in hand the appearance of new form and processes' అని ప్రకటిస్తాడు. వీటి నెవరు సాధిస్తారన్న దానికి ఆయన 'The progressive development of art is to a great extent a function of the artistic discoveries made by individual talented artistes" అని సమాధానం చెప్పాడు.

ఒక నూతన దర్శనంలోనూ, అభివ్యక్తిలోనూ సాంప్రదాయమూ, ఆధునికతా రెండూ కలగలిసే ఉంటాయి. ప్రతిభావంతుడైన కవి, నూతన అభివ్యక్తి పద్ధతుల్ని అన్వేషించగలుగుతాడని పై విమర్శకుని అంతర్యం. బోయి భీమన్న కవితా పోకడకు ఈ నలుకులు బహుదా అన్వర్థాలు.

---

[illegible] – 17[illegible] వ పుట

తత్త్వవేత్త అయిన బోయి భీమన్న విద్యార్థుల జీవితానికి తోడ్పడే 'అసూయ' అనే రూపకం ఒకటి వ్రాశాడు. అందులోని భావజాలాన్ని చూడండి.

**''సత్యము న సత్యముగ చూప జాలు నొకడు**
**లేని అపవాదులెన్నొకల్పించు వొకడు**
**మంచివానిని పడద్రోయు నెంచునొకడు**
**మానవత్వము నాశనమయ్యె నేడు''** [1]

తాను వివిధ జీవితానుభవాల్నీ, ఆశించే మానవతా విలువల్నీ తన రూపకాలన్నింటిలోనూ శిల్ప సౌందర్యం ఉట్టి పడేట్లుగా అనుభవగ్రస్తం చేస్తాడు. డా॥ బోయి భీమన్న.

మతాచారం ముఖ్యం కాదు నైతిక జీవనమే ముఖ్యమన్న తాత్త్విక సూత్రాన్ని భీమన్న తన''పడిపోతున్న అడ్డుగోడలు'' రూపకంలో ప్రతిపాదించాడు. ఇది వ్యంగ్య హాస్య రస భరితమైన రచన. భీమన్న కల్పనాచాతుర్యానికి ఈ నాటకం ధ్వజకేతనం.

విలక్షణ పద్య నిర్మాణ శిల్పంలో భీమన్న నేర్పు ''జీవన రహస్యము'' అనే శీర్షికలో కనిపిస్తుంది. భీమన్న, రచనా దక్షతలో పెద్దన కు తమ్ముడిగా కనిపిస్తాడు. ఇరువది పంక్తుల చంపకమాల వృత్తాన్నిద్విరుక్తటకార ప్రాసతో డిపించిన అసాధారణ తీరు గమనించదగ్గది.

మొత్తం మీద భీమన్న తన రూపకాలన్నింటిలోనూ ఆశావాదానికి పట్టం కట్టారు. విభిన్న మానవ కాంక్షల్నీ, వైవిధ్య ప్రవృత్తుల్నీ వెల్లడిచేసినా, మానవ గమనం శాంతి సుఖదాయకలై సాగిపోవాన్న ఆశయానికి ప్రాధాన్యం ఇస్తాడు.

1. 'అసూయ' రూపకం - 167 వ పుట

ఇంకా వీరి రూపకాలన్నీ కళాత్మకాలు. పద్యాలూ, పాటలతో కూడిన నవరసభరిత నిత్య సంస్కరణాత్మకాలు. వ్యంగ్యం, హాస్యం, శిల్పం ఒక దానితో ఒకటి పోటీపడి రూపక నిర్మాణ లక్ష్య సంసిద్ధికి చేదోడు వాదోడుగా నిలుస్తాయి.

డా. బోయి భీమన్న రూపకాలలో సమకాలీన సమగ్ర జీవితం కళ్ళకు కడుతుంది. మన చుట్టూ రోజూ ఎదురయ్యే సంఘటనలే సహజాతి సహజంగా దర్శనమిస్తాయి. తెలుగు నాట డా॥ బోయి భీమన్నది రూపక రచనారంగంలో ఆనాడూ, ఈనాడూ, ఏనాడైనా అగ్రాసనమే. కవిగా ఆయన పేరూ ఆచంద్రతారార్కమే.

# భీమన్న సాహిత్య తత్త్వం

తెలుగు సాహిత్య జగత్తులో సృజనాత్మక రచనా శక్తి, విమర్శనా శక్తి కలిగిన వ్యక్తి పద్మశ్రీ బోయి భీమన్న. ప్రముఖ తెలుగు పండితుడు, కవి, నాటక రచయిత, విమర్శకుడు అయిన డాక్టర్ బోయి భీమన్న అనేక గ్రంథాలు రచించాడు. ఆధునిక, సాంప్రదాయ రీతులలో కవిత్వాన్ని వ్రాశాడు.

బోయి భీమన్న రచనలు ఎక్కువ శాతం ప్రేమ, ప్రకృతి అందాలు, కులాతీత సమాజం వైపుకు మొగ్గు చూపేవిగా ఉంటాయి. ముఖ్యంగా ఆయన సాహిత్య తత్త్వ రసాద్వైతం. ఆయన వ్రాసినంతటి విశిష్టంగా విలక్షణంగా బహుశ యే అధునిక కవీ వ్రాసి వుండడు. ఆయన బాల్యం నుండే కవిత్వ వ్రాయడం మొదలుపెట్టాడు. ఆయన ఆలోకనం ఎంతో విస్తృతమైంది; అధ్యయనం బహు విపులమైంది. డా॥ భీమన్న స్పృశించని ఇతివృత్తంగానీ, ఆయన ప్రయోగించని ప్రక్రియగానీ లేదు.

బోయి భీమన్న భావుకతకూ, అభ్యుదయ దృక్పథానికీ, ప్రకృతి సౌందర్య చిత్రణకూ, ప్రణయారాధనకూ పూచిన పూబంతులు వీరి కవితలు. జాతీయ భావ తత్పరతతో పాటు, ఆంధ్ర భాషాభిమాన తీవ్రత గూడా భీమన్న గారి కవిత్వంలో దర్శనమిస్తుంది.

"పచ్చని పొలముల పచ్చి బాలెంత మా
బంగారు తెలుగు తల్లి
తీయని ఫలముల తీపి లేమావి మా
తీ దీయు తెలుగు తల్లి
జీవ తటాకమ్మ శీతల చ్ఛాయ మా
శ్రీ లక్ష్మి తెలుగు తల్లి
పుష్కలాకృతి అన్నపూర్ణమ్మ మముగన్న
పూబోణి తెలగు తల్లి" [1]

ప్రణయాన్ని ప్రణవంగా ఆరాధిస్తున్న కవితోపాసకులు బోయి భీమన్న. ప్రణయ కవిత్వం తాత్త్విక శిఖర స్థాయి నదిగమించింది. ఇందుకు ఈ దిగువ కవితయే ఉదాహరణ:

"ఎదలోనె నీవుండ
ఎదుట చీకటి యేమి ?
బోర్లించు మాత్రాన
బొమ్మ యేమైపోవు ?
మొగ్గ తొడిగిన మావి గున్న
ఫలమేమి
సిగ్గుపడి కాయకున్న?" [2]

ఈ కవిత ద్వారా మనకు కవి యొక్క మధుర బాధ యేమిటో తెలుస్తుంది. కవి ప్రేమమూర్తి, రసాద్వైతి.

ప్రేమను ప్రకృతి పరంగా వర్ణించి స్త్రీ పురుష ప్రేమ సమానమని ఇరువురి సమానత్వము అద్వైతమని ''రాగవాసిష్ఠం'' రూపకం ద్వారా భీమన్న తెలిపాడు.

నీ పాద నిర్మల నీరేజములలోన
ప్రకృతి చైతన్యమే పల్లవించె
నీ తనూవల్లి కానేక భంగిమలలో
ప్రకృతి శాబల్యమే పరిమళించె
నీ ప్రసన్నేక్షణానీక రేఖలలోన
ప్రకృతి రాగములె రూపము ధరించె
నీ మంజు మంజుల ప్రేమావతరణలో
ప్రకృతియే నైజసారము తరించె
నీవు ముందుకు పోవగా, నీడవోలె
నిన్ననుసరించి వచ్చుచుండినది ప్రకృతి
ప్రకృతి ననుసరించిన త్వదభ్యర్థి నేను
అద్దరిని నీవు, ప్రకృతి కిద్దరిని నేను ॥''[1]

కవి తనలో కలిగిన అనుభూతిని రసవత్తరంగా వెల్లడిస్తాడు. ఆ నేర్పే కవిని సామాన్యుని కంటె విశిష్టుణ్ణి చేస్తుంది. కవిలో కలిగిన స్పందన హృదయం నిండా వ్యాపించి తననే విధంగా కలిచివేసిందో భీమన్న రమణీయంగా ఈ కవితలో చెప్పాడు.

'చీకటి మాయ పొర చిట్లి
ఎఱ్ఱబారిన నెత్తురు మడుగులో

1. 'రాగవాసిష్ఠం' రూపకం - (30) వ పుట ) పాలేరు నాటకం 24 వ పుట

కేరనున్న బాల సూర్యుని కేకకు
ఉలిక్కిపడి తలెత్తింది మొగ్గ
అద్భుతపడి చూచింది వెలుగును
పూదోట పురిటి గదిలో
ఎర్రటి సూర్య దీపం వెలుగును'' [1]

'అనాది కొసనుండి అనంతంలోకి' అన్న కవితా సంపుటిలో రసవత్తం గా సాహిత్య తత్త్వాన్ని తెలిపే ఎన్నో కవితలు వ్రాశాడు భీమన్న.

లోకంలోని జీవుల సుఖదుఃఖాలను భావోద్వేగాన్ని వర్ణించే కవి భావాలకు ఆలంబన వాక్యం. వాక్యనిర్మాత అయిన కవి కోరికననుసరించి శబ్దం ధ్వనిస్తుంది. శబ్ద ధ్వని కలిగిన కవితలు ''పాలేరు'' నాటకములో అనేకమున్నాయి. అందులో ఒకటి -

''కాళ్లబడి పోయెటి గడ్డి పూలారా
సుందరాంగుల జటా శోభ మీకున్నదా
లోతు సంద్రాలలో పాతుకున్న మణీ
భారతమాతను గొల్చు భాగ్యమ్ము కల్గునా?'' [2]

'పాలేరు' నుండి పద్మశ్రీ వరకు' అనే గ్రంథంలో భీమన్న అంటాడు. 'నా సాహిత్యమే నా జీవిత చరిత్ర' అని. నిజమే భీమన్న సాహిత్యం జీవితంలో ఒక భాగం. అతని సౌందర్యానుభూతి, కల్పనా చాతుర్యం ఒక విశేషమే.

''మృత్యువు నుంచి జీవం కురిసింది
అమావాస్య నుంచి నెలవంక మొలిచింది
షడ్వర్గ యాతన నుంచి షడ్రసోపేతంగా
మళ్ళీ ఒక ఉగాది విరిసింది.'' [3]

---

1) పాలేరు నుండి పద్మశ్రీ వరకు - (30)వ పుట 2)పాలేరు నాటకం 24వ పుట, 3) గుడిసెలు కాలిపోతున్నై 125 వ పుట

ఇది ఎంత చక్కని ఊహ. జీవం మృత్యువు నుండి కురియటం, నెలవంక అమావాస్య నుండి మొలవటం.

బోయి భీమన్న కవితా తత్త్వం సాహిత్యాభివృద్ధికి చేసిన దోహదం చాలా విలువైనది. భాషలో, ఛందస్సులో, భావనలో, శాస్త్ర దృక్పథంలో అన్ని విధాలా అంతకుముందున్న గతానుగతిక సంప్రదాయాన్ని యెదిరించినట్టిదే.

**''కూడు, గుడ్డ, కొంప మూడే సుమీ నేడు**
**నరులు కోరుచున్న వరము లెల్ల**
**కోటి విద్యలైన కూటి కొసవేయన్న**
**మాట మంత్రమయ్యె మానవులకు''** [1]

సారళ్యం, వ్యావహారిక ప్రయోగం ఉన్న భాష కావ్య భాషగా ఉండాలన్నది వీరి దృక్పథం. దానినే ''దీపసభ'' కావ్యంలో చూపాడు.

జీవితాన్ని సాహిత్యంలతోను, సాహిత్యాన్ని జీవితంతోను సంగమింప జేసుకుని ప్రగతిపథం వైపు సాగిపోతున్న కవి డా॥ బోయి భీమన్న. మానవాభ్యుదయం పట్ల ఆయన అభినివేశం అత్యంత తీవ్రమైనది. ఆయన హృదయం కారుణ్య సంభరితమైన, దృష్టిమాత్రం కుంటువడని కార్య శీలం వైపే. స్తబ్ధులను, ప్రమత్తులను అచ్చమైన స్వచ్ఛమైన వాక్శరాలతో ఎట్లా హెచ్చరిస్తున్నాడో చూడండి-

**''నా కవితా లక్ష్యం**
**చీకట్లో బ్రతికే వాళ్ళను మెప్పించడం కాదు**
**వాళ్ళను తిట్టైనా కొట్టైనా సరే**

1. 'దీప సభా కావ్యం -

అక్కడ నుంచి లేపడం

అరుణోదయం కేసి తరమడం''.

ప్రధానంగా భీమన్న ఆర్ద్ర హృదయం కలవాడు. మంచి భావుకులు, తత్త్వ చింతకులు. వస్తువు యేదైనా సహజ గంభీరంగా రూపకల్పన చేస్తాడు. వీరు ముఖ్యంగా ప్రణయ తత్త్వాన్ని అందించాడు. ఉదాహరణకు 'రాగవైశాఖి'' కావ్యంలో –

అరమోడ్పు కనులలో అరుణార్క రశ్మిలో
రగిలి నీ పెదవులే రక్త పుష్పములయ్యె!
తొలి వసంతపు సుధా కలశ కన్యక లివ్వి
నవరసములూరనీ – నాపండ్ల తోటలో [1]

రస పోషకంగా రమణీయ కల్పన కావించడం కవి ప్రతిభా విశేషం. బోయి భీమన్న దృష్టి కరుణ శృంగారాలు ప్రధాన రసాలు.

కరుణతో వాత్సల్య మధువును
కురిసి దాహము తీర్చినావు
నెరలు తీసిన నరుని గుండెలు
చెరకు తోటలు పెంచినావు
తండ్రివో ఈ ధరణి కంతకు
తల్లివో ఈ చల్లదనమునకు
ఎవరవో నీవెవరవో
ఎంత మంగళ మూర్తివో?

---

1. 'రాగవైశాఖి' కావ్యం ౨౬౦వ పుట

అంటూ 'బాలయోగి' రూపకంలో కరుణ రసాన్ని కలిగిన సాహిత్య తత్త్వాన్ని చూపించాడు భీమన్న.

కవి మదిని ఆరాటపెట్టిన అనుభూతియే కవితా రూపం పొందుతుంది. అలాంటి అనుభూతి లోని కవిత ఒకటి.

**''కష్టానికి ఫలమేమిటి**
**కన్నీరొక్కటి తప్ప**
**ఇచ్చే వాడినే దోచి**
**పుచ్చు కుంటదీ లోకం''** [1]

కవి గ్రహించే అలంకారికత అతని భావననీ అతని మానసిక స్థితినీ, ఆలోచనా క్రమాన్ని, వ్యక్తిత్వాన్ని తెలియజేస్తుంది. మానవ స్వార్థ ప్రవృత్తుల పట్ల, దోపిడీ వ్యవస్థ పట్ల, స్వప్రయోజన సంకుచిత పోకడల పట్ల డా॥ బోయి భీమన్న మేధ ఎంత నిశితంగా ప్రతిస్పందిస్తుందో, వాక్కు ఎంత ఖండితంగా సానదేరుతుందో ఈ పంక్తులు గమనిస్తే తెలుస్తుంది. ఇంత నిర్మోహమాటంగా, నిర్భీతంగా లోకవికార నైజాన్ని వెల్లడించడానికి కేవలం కవితాఉధృతి ఒక్కటుంటే చాలదు. సత్య సంధత, ధర్మనిబద్ధత నేపథ్యంగా గల విశిష్ట వ్యక్తిత్వమూ ఉండాలి. దీనికి త్రికరణ శుద్ధితో ఉద్యమించే నేతృత్వమూ తోడుకావాలి. ఈ అన్ని లక్షణాలూ పుష్కలంగా స్థావరం ఏర్పరచుకొన్న నిర్మల మనస్కుడు డా॥ బోయి భీమన్న. ప్రజా జీవనాన్ని అతలాకుతలం జేసే భస్మాసుర హస్తాలపై భీమన్న కలం, గళం ఎంత తీవ్రస్థాయిలో ఉందో గమనించండి.

**''పూరి గుడిసెల్ని సృష్టించింది మేడలైతే**
**మేడల్ని నిర్మించింది పూరి గుడిసెలే**
**స్వార్థానికి అమాయకత్వం బలి**
**అమాయకత్వానికి స్వార్థం పులి''** [2]

---

1. 'పైరుపాట' - రూపకం - 2. 'గుడిసెలు కాలిపోతున్నై' -

ఇలా సామాజిక సమస్యపై వ్రాసిన రచనలు చాలా ఉన్నాయి. భీమన్న అభ్యుదయ వాదియని మనం అతని రచనలు పరిశీలించినపుడు తెలుస్తుంది

'పైరుపాట' రూపకంలో భీమన్న తన అభ్యుదయ భావాన్నిలా తెలియజేస్తారు.

''మేడలు మిద్దెలు ఉన్నా
మెత్తని పాలువులున్నా
హృదయం లేకున్నపుడు
వృథయే గత బ్రతుకంతా'' [1]

మానవులందురూ ప్రేమాభిమానాలతోను, ఆనందంతో సమానులై జీవించే మార్గాన్ని కల్గించే రసస్పష్టిగా రసాద్వైత తత్త్వ సృష్టి చేసిన కళాస్రష్ట బోయి భీమన్న. 'అకాండ తాండవం'లో ఇలా అన్నారు.

''ఘల్లు ఘల్లున మ్రోయవలసిన
గజ్జెవె పాదమ్ము కరుతువె ?
రింగు రింగున ఎగురవలసిన
కొంగువె గొంతుక బిగింతువె ?''

సాహిత్య తత్త్వానికి భాష, భావము, శైలి ప్రధానమైనవి. వాటిని రక్షిస్తూ రచించిన జానపద పాటలు లయసుద్ధముగా వ్రాశాడు 'ప్రగతి' కావ్యంలో.

'జారిందే పైట కొంగు, బంగు పిల్లీ
ఊడిందే రైక ముడి, ఊసరవెల్లీ'

---

'పైరుపాట' రూపకం –

''నీ కళ్ళు
నేరేడు పళ్ళు
నీ వొళ్ళు
గులాబి ముళ్ళు
కుదిరింది బేరం సందులో
ఎక్కింది దారం సూదిలో
తలకు బండ
మొలకు జెండ
మొగసిరి మొనగాడు
మొదలెడితే గిజిగాడు.''[1]

వంటకం నుండి వెలువడిన కమ్మటి వాసన నోరూరించే విధంగా కావ్యంలోని శబ్దమాధుర్యాన్ని సహృదయులు గ్రహిస్తారని భీమన్న గారి అభిప్రాయం. కావ్య మాధుర్యం గూర్చి చెప్తూ భీమన్న 'కవిత' ఒక ప్రక్రియకు ప్రేయసి కాదు' అంటూ చమత్కరించాడు.

''కవిత ఒక ప్రక్రియకు ప్రేయసి కాదు
ఒక భాషకు పరిమితం కాదు
ఒక స్వేచ్ఛాసుందర మధుర భావన అది
కవిత్వం వ్రాసేదీ చదివేదీ కాదు
ఆస్వాదించి, ఆనందించేది'' [2]

మానవ జీవితాన్ని ప్రేమించి మానవతకు గుర్తింపు ఇచ్చి మనుష్యుడిలా మహానుభావుడనే చైతన్యం కలిగించేట్టు చేయటం సాహిత్యమూ, కళా నిర్వర్తింపవలసిన పనులు.

1. 'ప్రగతి' కావ్యం - 14 వ పుట  2. 'గుడిసెలు కాలిపోతున్నై

భీమన్న మతాన్ని నిరసించినా మత మూఢాచారాల్ని తెగ నాడినా, వేదాంత భాష్యకారుడిగా రూపుదిద్దుకున్నాడు.

**''నేను మనిషిని మనషిని నీవు; మనము**
**బోధి సత్త్వని విశ్వైక బుద్ధిజాలము**
**ఇర్వురము ఒక్కటే భేదమేమి లేదు**
**భేద మెంచుట పాపం బెంచుకొనుట''** [1]

భాషలో మృదుత్వం కనిపిస్తున్నది. వ్యావహారిక ప్రయోగముంది. భీమన్నది నిత్యానంద రసాద్వైత భావకవిత్వం. అటువంటి మధుర తర రాగరంజిత రసహృదయం నుండి 'అంధకారంపై విజయం' గేయరూపకం వచ్చింది. దీని ద్వారా మానవత్వపు విలువలు కాపాడమంటున్నాడు.

**''మానవత్వపు మేటి విలువలు**
**మంచి చెడ్డలు మంట గలిపె**
**ప్రాణ దేవత పంచశీలకు**
**పక్కటెముకలు విరిగెను**
**నాగరికత నాశనమయ్యెను**
**నాల్క సాచెను రక్తదాహం**
**తోడి మనుజాని విరుచుకొని తిను**
**దుర్జనత్వం బలిసెను''** [2]

మానవ జీవితంలో ఎంత క్షుద్రత్వం నిండిపోయిందో, ఆలోచనలలో ఎంత కర్కశత్వం చోటు చేసికొందో, శ్రుతులు తెగిన సమాజవీణ ఎంతగా

1) చాండాలిక - 120 వ పుట 2) అంధకారంపై విజయం' - రూపకం 170 వ పుట

అపశ్రుతుల్ని ఆలాపిస్తున్నదో ఆ భీభత్స జీవన వైవిధ్యాన్నంతా ఈ పాదల్లో సమీక్షిస్తున్నాడు డా॥ భీమన్న. ఇంతటి అవాంఛనీయ నైజాలను వెల్లడించే సందర్భములో గూడా డా॥ భీమన్న స్వీకరించిన భాష ఎంతో సరళమైనది; పదకూర్పు కుసుమ పేశల సమం. భావం సుందరతమం. సంక్లిష్టపద ప్రయోగం గానీ, అస్పష్ట భావ విన్యాసం గాని భీమన్న కవితలో కాగడాలు పెట్టి వెతికినా కానరాదు. బోయి భీమన్నలోని ప్రత్యేకత ఇదే.తిక్కనలా అలలు అలలు పదాలతో అనల్పభావాన్ని అభివ్యాపితం చేయడం భీమన్న సాహిత్య త్త్వంలోని ప్రధానాంశం. నాటి నన్నయ కాలం కావ్య భాష మధ్యకాలంలో లేదు. మధ్య కాలం నాటి భాష నేడు లేదు. నేటి భాషా స్వరూపం రేపటికి మారవచ్చు. జీవితం మాదిరిగానే భాషకూడా పరిణామ శీలమైనది. తత్పరిణామ ఫలితమే ''చిత్ర కళా ప్రదర్శన' లోని జీవద్భాషా స్వరూపం. భీమన్న తన రచనలకి ఈ శిష్ట వ్యవహారికాన్ని ఎంచుకున్నాడు.

చిత్ర కళాప్రదర్శనంలోని 'వసంత స్వయంవరం' రూపకంలో వసంతుడి పాత్ర ద్వారా బోయి భీమన్న ప్రేమనిలా తెలియజేశాడు.

**''నీ పూల నవ్వు వె**
**న్నెల కాయునె కాని**
**వెన్నెలల కడలిలో**
**విషము దాగిన దమ్మి**
**చేదు విషమోలమ్మి**
**చెరరా కోలమ్మి''** [1]

1. 'వసంత స్వయంవరం' - రూపకం - 18 వ పుట

బోయి భీమన్న దృష్టిలో వాచ్యార్థం కంటె వ్యంగ్యార్థానికే ప్రాముఖ్యం ఎక్కువ. ''పాత ఊరు-కొత్త బాట'' రూపకంలో భీమన్న భావపరంపర ఎంత గొప్పదో చూడండి.

**''మేఘ వనములు వెదికి త్రవ్వి**
**మెరుపు తీగలు తెచ్చినారట**
**దారి పొడవున పూచి మల్లెలు**
**ఊరె వికసించె!''** [1]

'ఎరుకయ్య' పాత్ర ద్వారా తన అనుభూతిని సుందరంగా తీర్చిదిద్దాడు.

వ్యవహారంలోని సజీవ భాషకు సాహిత్య గౌరవం కలిగించాలని భీమన్న అభిప్రాయం. కనుక 'చిత్రకళా ప్రదర్శన' అన్న రూపకం ద్వారా సాహిత్య తత్త్వం యేమిటో తెలిపాడు. భౌతిక, వైజ్ఞానిక, కళాత్మక ఆధ్యాత్మిక అనే చతుర్ముఖ కోణాలతోనే మానవ జీవనం సమగ్రమవుతుందనీ, ఇందులో ఏ కోణం లోపించినా బ్రతుకు శృతి సవ్యంగ వుండదనీ భీమన్న భావిస్తూ, కళాత్మక దృష్టి వేదికలైన లలిత కళల ప్రాముఖ్యాన్ని ఎంత నిగారింపు శైలిలో అభివ్యక్తం చేస్తున్నారో చూడండి. కళవిహీనం అయిన జీవనం సూర్య గోళం లేని ఆకాశం వంటిదని కళాస్రష్టలెందరో వ్యాఖ్యానించటమూ జరిగింది.

**''మానవుని కానంద**
**మార్గాలనేకం**
**కళ అందులో అమృత కలశం**

1) 'పాత ఊరు - కొత్త దారి రూపకం - ౨౩ వ పుట

లలిత

కళ అందులో అమృత కలశం

శిల్పులే చిత్రాలు

చిత్రాలే శిల్పులు

ఒకరిలో ఒకరుండి

ఉన్నతుల కెగయుగా

కళ అందులో జీవ కలశం

లలిత

కళ అందులో జీవకలశం" [1]

ఈనాటి పలాయనవాద సాహిత్యం వల్ల కలిగే హానినీ, వ్యాపార క్షుద్ర సాహిత్యం కలిగించే కీడునీ, అసలుసిసలైన సాహిత్య ప్రయోజనాన్నీ, ప్రమాణాన్నీ గుర్తిస్తారని బోయి భీమన్న ఆశిస్తూ ఎన్నో రచనలు చేశాడు. మధుగీత, రాగవైశాఖి, అఖండ తాండవం, రాఖీలు, బొమ్మ, గుడిసెలు కాలిపోతున్నై, దీపసభ మరియు 'అనాది కొస నుంచి అనంతత్వంలోకి వంటి కమనీయ రస గుళికలు జాలువారినాయి. అందులో 'అనాది కొస నుంచి అనంతత్వం లోకి' కావ్యంలో వ్యంగ్యార్థక కావ్యధ్వని అంతస్సూత్రంలా అల్లుకుపోయి ఉంది.

" పూల కంటె లెక్కకు ముళ్ళె ఎక్కువ

ఈ నా గులాబీ తోటలో

అందుకని

ముళ్ళతోట అననా దీన్ని"

---

1. 'చిత్ర కళా ప్రదర్శన:- రూపకం - ౨ వ పుట

బాధా పరితప్త హృదయాల మీద కావ్య అమృతం తొలకరిలాగా వర్షించాలి. ఎంత ఎక్కువమంది చైతన్యాన్ని సంతరించుకుంటె అంత శీఘ్రంగా మార్పు వస్తుంది. ఈ మార్పు తీసుకు రావడమే భీమన్న సాహిత్య ఉద్దేశం.

సాహిత్య మంగళ ప్రదమైనదిగా ఉండడం భీమన్న అభిమతం. జనులు సుజనులై సమాజమును వినయ నీరాజనం చేయవలెను. అదీ సాహిత్య లక్ష్యం. వీరి రచనలలో ఆశాతత్త్వం, ఉత్సాహం నిండి ఉంటాయి.

**''కవీనాం మానసం నేమి ! తరతి**
**ప్రతిభౌ సాయత్**
**పోతన పయాం సేవ!**
**భవగాని చతుర్దశ''**

కవుల మనసు బహుదొడ్డది. మహాసాగరాన్ని సైతం చిన్న పడవతో చుట్టివచ్చినట్లు, తన భావనాశక్తితో సర్వలోకాలను పరామర్శచేయగలడు కవి. అటువంటి కవిహృదయానికి నా నమస్సులు అన్నది అర్యోక్తి. డా॥ భీమన్న తన అమేయ భావనాశక్తితో లోకంలోని సమస్త విషయాలనూ పుక్కిట పట్టగలడనీ, ఆ విషయాలనే పరిత హృదయు సంస్పందనంగా, అందంగా ఆవిష్కరింపజేయగలడనీ ఈ క్రింది పంక్తుల ద్వారా వెల్లడవుతుంది.

**ఓహో**
**ఉషస్సు విరిసిందోహో**
**వెన్నెల కడలిని వెన్న జిడ్డునా**
**గోవును చేరిన గొల్లభామనా**

చీకటి మలచిన చెందోవ బొడ్డున
వేకువ మొలచిందోహో! ॥ఓహో॥

మందారమృత మకరందాలు
పారిజాత సుమ పరిమళాలు
సౌగంధిక మృదు సౌందర్యాలు
సారెగ తెచ్చిందోహో ॥ ఓహో॥
పాల కడలిలో పాప సెజ్జపై
మేలు కొల్పు గీతాలను మెచ్చి
మాతన సృష్టిని చేత నందుకుని
మాతగా వచ్చిందోహో ॥ ఓహో॥
పుష్ప కామినుల వాంఛలు తీరగ
పుంస్కోకిలముల పుణ్యము పండగ
ప్రణ వాత్మకుతో బాల మానవుని
ప్రభుతకు తెచ్చిందూహో [1] ॥ ఓహో॥

ఆనందకరంగా ప్రణవ నాదంగా రూపొందించిన బోయి భీమన్న గేయం లయబద్ధమైన సాహిత్య తత్త్వంగ గోచిరిస్తున్నది. ''మానువుని మరొక మజిలీ'' లోని పై పంక్తుల ద్వారా.

సత్యం ఎంత నిసర్గ సుంధరమో, ధర్మం ఎంత శాశ్వతానంద కరమో . చూడడానికి ప్రగాడమైన అంతర్దృష్టి అవసరమంటాడు బోయి భీమన్న.

భీమన్న దృష్టిలో ప్రత్యేకంగా రూపకసహిత దేవుడు లేడు. కాని

1. 'మానవుని మరొకమజిలీ' రూపకం - 10 వ పుట

విశ్వచైతన్యానికి నేపథ్యశక్తిగా పరమాత్మ స్వరూపం ఉంది. మండూకోపనిషత్తూ వెల్లడించే సత్యమూ ఇదే; ఓంకారమ్ ఈ సృష్టిసమస్తానికీ తేజస్వంతమైన శక్తి రూపంగా భాసిల్లుతూ ఉందనీ, అదే విశ్వచేతనకు త్రికాలా తీతమైన వాఖ్యానంగా పరిఢవిల్లుతూ ఉందనీ ఆ ఉపనిషత్తు వివరిస్తుంది. డా॥ భీమన్నది గూడా సృష్టి సమస్తాన్నీ హేతుబద్ధంగా చూసే ఉపనిషత్ దృష్టి; శివుడైనా, విష్ణువైనా, బ్రహ్మైనా దృశ్యమానమయ్యే జగత్ సర్వానికి పరిపోషక తేజోశక్తి బీజాంశాలు మాత్రమే. ఈ అంశాలే ప్రతి జీవిలోనూ బింబ ప్రతిబింబ రూపాల్లో ప్రకాశిస్తూ వుంటాయి. ఈ తేజస్వంత ఆత్మ స్వరూపాలన్నీ పరమాత్మకు ప్రతినిధులుగా వెలుగొందే ఏకోన్ముఖ దీపికలేనన్నది భీమన్న తాత్పర్యం; ఇదే ఆయన అద్వైత భావనా సరళి.

సముద్రం పరమాత్మ అనుకుంటే క్షణక్షణానికీ పుట్టి మరలా సముద్రంలో కలసిపోయే అలల వంటివి జన్మలంటాడు భీమన్న. మొత్తం మీద బోయి భీమన్న ఆస్తికుడు. అందుకు ఆధారం "మానవుని మరొక మజిలీ"[1] లో 'స్వయం ప్రభ' పాత్ర ద్వారా మనకు తెలుస్తుంది.

**"కార్మికుడో, కర్షకుడో**
**ధార్మికుడో, ధీమంతుడో**
**విప్లవలత కొస కొమ్మల**
**వికసించిన వాడె శివుడు**
**శివతేజము లక్ష్యముగా**
**జీవులెల్ల నొక్కటిగా**
**ఆనందోత్సాహాలతో**

1. 'మానవుని మరొకమజిలీ' రూపకం - 21 వ పుట

**అరుగుడింక గ్రామమునకు''** [1]

ఈ మధ్య భీమన్నగారు భగవద్గీతకు భాష్యం వ్రాశాడు. కొన్ని ముఖ్యమైన శ్లోకాన్ని తీసుకుని టీకా తాత్పర్యం వ్రాశాడు.

**''నరుణ్ణి కర్మణ్యుణ్ణి క్రియా శీలుణ్ణి**
**స్వధర్మ రాకోన్ముఖుణ్ణి చేయడానికి**
**పుట్టిన ప్రభోత గీత – భగవద్గీత''** అంటాడు భీమన్న.

''భగవద్గీత'' సర్వ మానవాళికి సంబంధించిన జీవన శాస్త్రం. మానవుడు ప్రశాంతంగా, రాగద్వేషరహితుడుగా, కర్తవ్యోన్ముఖుడిగా, ఫలాపేక్షవిముఖుడిగా ఏ విధంగా ధర్మబద్ధ మనుగత సాగించాలో వ్యాఖ్యానించేదే భగవద్గీత. వర్గ, మతరహిత ప్రబోధ వాణి ఇది. విశ్వమానవాళి శ్రేయోజీవనాన్ని ప్రతిపాదించే సార్వకాలీన స్థిర సత్యాలను వెల్లడించే ''గీత'' ను అనుసరిస్తే ఏ మానవుడు తన తలరాతకు తల పట్టుకోవల్సిన ఆవశ్యకత ఏర్పడదనే భీమన్న ఉద్ఘాటిస్తాడు. డా॥ భీమన్న తర్కం కేవలం వాద కర్కశ పరిమితమైంది కాదు. సర్వమానవాళి హితాపేక్షే భీమన్న హేతుదృష్టి.

''మౌలికంగా సాహిత్యాని కుండవలసిన ప్రధాన గుణం సమకాలీనత. ౦మకాలీనతను ప్రతిబింబించని రచన ఎంత గొప్పదైన అది సాహిత్యమనిపించుకోదు; ప్రజలకు ప్రాతినధ్యమూ వహించదు.

కవి ఏ కాలంలో జీవించాడో ఆ కాలానికి చెందిన సాంఘిక, రాజకీయ, ౦ంస్కృతిక, ఆధ్యాత్మిక విషయాలన్నీ అతిడి రచనల్లో ప్రతిఫలించాలి. అట్టి గుణం వుండడం వల్లనే వేద పురాణ రామాయణ భారతాదులు 'క్లాసిక్స్'

అయ్యాయి., సజీవ సాహిత్యాలైనాయి.'' అంటూ భీమన్న తన 'పాలేరు' నాటకంలోని పీఠికలో చెప్పాడు.

ఆధునిక ధోరణుల వాళ్ళందరికీ వాళ్ల స్వేచ్ఛా భావన గురించి 'కాడ్వెల్' గారిలా అన్నారు.

"Man becomes free not by realising himself in opposition to society but by relaising himself through society and the character association in itself imposes certain comman forms and conbentions which are the badge of his freedom."

బోయి భీమన్నలో ఆధునిక దృష్టిలోని వ్యక్తి చేతన చాలా బలంగా చోటు చేసుకుంది. ఆయన గతకాలపు వ్యవస్థల్నివేటినీ ఆమోదించలేదు. కనుకనే భీమన్న సాహిత్య తత్త్వం సత్య సౌందర్యాల సమన్వయం.

మొత్తం మీద భీమన్న రసాద్వైత భావకవిగా అభ్యుదయ కవిగా రెంటికీ భిన్నమైన వేదాంత భాష్యకారుడిగా మనకు స్పష్టంగా కనిపిస్తున్నాడు. ఆయన తన భావ ప్రకటనకు పద్యాన్ని, గేయాన్ని, వచన కవిత్వాన్ని, వ్యాఖ్యానాన్ని ఆయుధాలుగా వాడుకున్నాడు. వివిధ సాహితీ ప్రక్రియల ద్వారా ప్రధానమైన రచనలు తెలుగులో చేసిన బోయి భీమన్న వంటి కవులు చాలా అరుదు.

# సామాజిక దృక్పథం

ఆదికవి నన్నయ నుండి ఆధునిక కవి బోయి భీమన్న వరకు విశ్వ శ్రేయస్సు దృష్టిలో నిలుపుకొని సాహిత్య సృష్టిని చేసినవారే. నన్నయ జగత్ యొక్క హితము కోరి రచన చేశానని తెల్పితే, బోయి భీమన్న ఆర్థిక అంతరాలు లేని మానవ సమాజం కొరకు రచన చేశానని తెల్పుతాడు. కాకపోతే నన్నయది ప్రబోధ దృష్టైతే భీమన్నది సంస్కరణ దృష్టి.

సాహిత్యము నాటక రంగానికి , నాటక రంగము సమాజానికి ఏ విధంగా పరస్పరం తోడ్పాటు నందించుకొనుచున్నది భీమన్న తన రూపకాల ద్వారా నిరూపించాడు. తాను సమాజంలో వినూత్న భావచైతన్యం కలిగించాడు. వీరి నాటకాల వల్ల సమకాలీన సామాజిక పరిస్థితులు సంపూర్ణంగా తేటతెల్లమవుతాయి. ''సమకాలీన సమస్యల్ని ప్రస్తావిస్తూ సమాజ వికాస పరిణామానికి మానవ జాతి సమిష్టి సంక్షేమానికి తోడ్పడేదే గొప్ప నాటకం' అన్న ఆర్థర్ ముల్లర్ పలుకులు డాక్టర్ భీమన్న నాటకాలకు అన్వర్థాలు.

బోయి భీమన్నగారు సమాజంలోని సమస్యను అవగాహన చేసుకొని, సమసమాజ లక్ష్య దిశగా తత్త్వాన్వేషణ చేశారు. కులవ్యవస్థకు నిరక్షరాస్యతయే కారణమని ఎంచాడు బోయి భీమన్న.

1945 నుండి సాంఘిక సమస్యలపై పెక్కు రచనలు వచ్చాయి. మరెందరో నాటక రచయితలూ వచ్చారు. వారిలో ప్రముఖంగా చెప్పకోదగ్గ వ్యక్తి బోయి భీమన్న. మానవ జీవన గమనాన్ని ఆసాంతం వక్రగతికి మళ్ళించే

ఆనాటి సాంఘిక దురాచారాలను సంకుచితమైన సాంప్రదాయాలను నిరోధించడానికి, నిర్మూలించడానికి 'పాలేరు' రూపకం వ్రాశాడు.

కుల వ్యవస్థ ద్వారా సంక్రమించిన సాంఘిక దురాచారం అస్పృశ్యత. దాన్ని రూపుమాపే రచనలు చేయటం మానవతా చింతన ఉన్న ప్రతి రచయితా ప్రథమ కర్తవ్యం. అంటరానితనం అమానుషమైన కృత్రిమ దురాచారం. ఈ దురాచారాన్ని ఎత్తిచూపి, మానవులంతా ఒకటేనన్న దృక్పథంతో వ్రాయబడ్డ 'పాలేరు' రూపకంలో భీమన్న ఇలా అంటాడు.

**సీ॥ మాలను గావించి – పాలేరుగా జేసి**
**కామందు కాలికి గట్టినావు**
**అంటరాదని చెప్పి పెంటల పాల్జేసి**
**నీచుల మను పేర నిల్పినావు**
**చదువు సంధ్యలు లేక జంతువులను బోలె**
**ఊరి వెల్పల చావ నుంచి నావు**
**అజ్ఞాన తిమిరాల యడుగున బడద్రోసి**
**బరిగేసి యెదనొక్కి పట్టినావు**
**వెలుగు జూపవు, నేర్పవు మెలగు సరళి**
**దాస్యముం బాపుకోనీవు ధైర్యమూని**
**మనిషిగా నన్ను మననీవు మహిని కేల**
**చంపుకొని పొమ్ము చాలింతు జన్మమింక. "** [1]

భీమన్న బాధాతప్త హృదయం నుండి వెళ్ళుకొచ్చిన వేదాక్షరాల శాఖా ర్వాలలే పై పంక్తులు. ఇదే రూపకంలో భీమన్న వయోజన విద్యను

---

1. 'పాలేరు' నాటకం – ౨౮ వ పుట

ప్రస్తావించాడు. వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించాడు.

ఉదాహరణకు :

"గోచి పెట్టుట నేర్పుగోగానే బిడ్డకు
చేతికి కర్రిచ్చు రైతులారా
నడువ నేర్చుటతోనే బుడతని గొంపోయి
పాలేరు తనముంచు మాలలార
పసిబిడ్డ తెచ్చు సంపాదన కాశించు
మనుగడలే మాపు జనకులార
వంట యిల్లొకటె ప్రపంచమ్ముగా జేసి
తనయుల నేడ్పించు తల్లులార
జాతిశక్తి విహీనమై చచ్చుచుండ
కన్నులను మూసి కొంటిరే గాఢ నిద్ర!
శక్తికంతకు మూలము చదువు కొన
బడికి పంపుడు మీ వంశవర్ధనులను" [1]

బానిసత్వ బ్రతుకుకు అవిద్యయే ముఖ్య కారణము అంటాడు భీమన్న. దేశం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో సౌఖ్యవంతం కావాలంటే ప్రజలు విజ్ఞానవంతులు కావాలనీ, వయోజనులందరూ విద్యావంతులు కావాలనీ పేర్కొంటాడు భీమన్న.

సీ॥ ఒక వైపున సనాతన కుల దివాంధులు

---

1 'పాలేరు' నాటకం - 7 వ పుట

శపియించి నిప్పులు జల్లుచుండ
ఒక వైపు ప్రగతి కాముకులైన యువకులు
ప్రేమ కాన్కలు సమర్పించుచుండ
ఒకవైపు భారతాభ్యుదయ నిరోధకుల్
నోటికత్తులు చాల నూరు చుండ
ఒక వైపు జాతి ఏకోన్ముఖ మగు చుండ
దాస్య శృంఖలలు బ్రద్ధలగు చుండ
కుటిల కులభేద కుడ్యాలు కూల ద్రోసి
పూర్వవైభవ శిఖరాల బూజా దులిపి
తెలిసి జాతి నిద్దుర లేచి నడువ
బాల బెండ్లాడె వెంకటేశ్వరుడు, నేడు'' [1]

అభ్యుదయ యువకులు కులాంతర వివాహాల ద్వారా కులభేద కుడ్యాలను కూలదోయాలనీ, అప్పుడే హైందవ ఏకజాతిగా శక్తివంతంగా రూపొందగలదన్న తన ఆశయాన్ని భీమన్న వ్యక్తం చేస్తూ తన 'పాలేరు' నాటకంలో వర్ణాంతర వివాహాన్ని ప్రవేశపెట్టాడు.

'కింగు లేక విశా లేక
శీలమే పాత్ర కారణం
కృమయః కిం నజాయంతే
కుసుమేషు సుగంధిషు''

సుగంధ భరితమైన పుష్పాలలో క్రిముల వంటివే ఈ కులాలు. గుణం ప్రధానం గాని, కులం కానే కాదు అంటుంది పై శ్లోకం. అయినా కొందరు

1. 'పాలేరు' నాటకం - 101 వ పుట

స్వార్థపరులు స్వలాభం కోసం సృష్టించిన ఈ కులం జాతినే విభజించి బలహీన పర్చటం భీమన్న వంటి సాత్వికుని హృదయాన్ని ఎంతగా క్షోభ చెందించిందో పై పంక్తులు వెల్లడిస్తున్నాయి.

కులాల అంతరాలవల్ల ఒక జాతి సంఘటిత శక్తి కోల్పోయిందన్న బాధ వారి రచనల్లో ప్రతిఫలిస్తుంది. సంఘశ్రేయస్సును కాంక్షించి సంకుచిత తత్త్వాన్ని తొలిగించడం ఆవశ్యకమన్న అభిప్రాయం వీరి రూపకాల్లో ధ్వనిస్తుంది. మూఢ విశ్వాసాలతో కొన్ని సాంఘికమైన కట్టుబాట్లు, ఆచారాలు దురాచారాలుగా మారాయనే దృష్టి "కూలిరాజు" నాటకంలోనూ కనబడుతుంది.

"కులమత వర్గ భేదములు
కూలిచి, వాటి కతీతులై ధరా
స్థలి నీరులెల్ల నొక్కటని
చాటుడు సర్వజనీన స్వామ్య సం
కలిత ప్రణాళిక పథక
కర్తలు కార్మిక నాయకుల్ సమ
ర్థులు తన మోట్లో సంగి రయి
తుల్ గెలిపింపుడు శాంతికాములై" [1]

ఇలా బోయి భీమన్న సామాజిక స్పృహతో రచనలు చేస్తూనే కవిత్వాన్ని సాంఘిక ప్రయోజన దిశవైపు మళ్ళించాడు. తన భావాలను తాత్త్విక చింతనతో కవితామయం చేసి వెలువరించాడు.

'మనకు స్వాతంత్రమే వచ్చింది గాని ఇంకా స్వరాజ్యం రాలేదు. దాన్ని

[1] 'కూలిరాజు' నాటకం 10 - వ పుట

మనం సాధించవలసి వుంది'' [1]. అంటాడు భీమన్న

ఇక కులాన్ని గురించి ఆలోచిస్తే అతి ప్రాచీన కాలంలో నుంచీ చాతుర్వర్ణ వ్యవస్థ ఉన్నట్లు తెలుస్తోంది. వృత్తి ప్రాధాన్యాన్ని బట్టే ఈ విభాగం ఏర్పడిందన్న నగ్న సత్యాన్ని అందరూ అంగీకరిస్తారు.

అసలు వర్ణం అనగా - బ్రాహ్మణ, క్షత్రీయ, వైశ్య, శూద్ర అను నాలుగు గ్రూపులు మాత్రమే. ఈ గ్రూపుల మధ్య జరిగే పెళ్ళి వర్ణాంతర పెళ్ళి. కులాల మధ్య జరిగె పెళ్ళి కులాంతర పెళ్ళి. హిందూ మతం మతం కాదు. అది ఒక నాగరికత. సింధూ నాగరికత + సంస్కృతి = హిందూమతం ఐంది.

అసలు మతాలు శైవం (అడ్డ బొట్టు వాళ్ళు) వైష్ణవం (నిలువు బొట్టు వాళ్ళు) అనాదిలో వీటి మధ్య మత తగాదలు జరిగేవి. ఈ మతాల నుండి విడిపోయిన కొంత మంది కొత్త మతాలు స్థాపించారు. అవి-

1. క్రీ॥పూ 599 లో వర్ధమాన మహావీరుడు జైన మతాన్ని
2.. ,, 563 లో గౌతమ బుద్ధుడు బౌద్ధ మతాన్ని
3. క్రీ॥శ. 788 లో శంకరచార్యుడు అద్వైతం (వైదిక మతాన్ని)
4. ,, 1019 లో రామానుజ చార్యుడు విశిష్టాద్వైత మతాన్ని
5. ,, 1199 లో మధ్వా చార్యుడు ద్వైతమతాన్ని
6. ,, 1125 లో బసవేశ్వరుడు వీరశైవమతాన్ని
7. ,, 1469 లో గురునానక్ సిక్కు మతాన్ని

ఇలా తమలో తమకు పడిరానప్పుడల్లా హిందుమతం నుండి ఓ కొత్త

1. 'కూలిరాజు' నాటక, - 10 వ పుట

మతాన్ని ఏర్పాటు చేయడం దాన్ని పటిష్టంగా స్థాపించడం జరిగింది. ప్రతి మతంలో కులాలు ఏర్పడటం జరిగింది. ప్రతి కులంలోనూ ఉపకులం పుట్టుకొచ్చింది. ఉదాహరణకు బోయి భీమన్న గారి మా కులంలోనే ఎన్నో ఉపకులాలు పుట్టుకొచ్చాయి. అవి -

1. మాల (మన్నెపు) - వృత్తి వ్యవసాయం
2. మాల కుమ్మరి - కుండలు చేయడం
3. మాల దాసరి - వైష్ణవ మత ప్రచారకుడు (శ్రీకృష్ణదేవరాయ కాలంలో ఈ కులం ప్రసక్తి ఉంది.)
4. మాల జంగం - శివాలయాలలో పూజారులు (కాకతీయుల కాలంలో వీరి ప్రసిద్ధి గొప్పది వరంగల్ కోటలోని శంభుని గుడి పూజారితనం మాల జంగాలది)
5. రాజమాల (వెలమలు) ఎఫ్.సి. జాబితాలో ఉన్నారు. (13వ శతాబ్దంలో ఏర్పడిన కులం)
6. వెలమాల - (వెలమలు) ,, ,,
7. ఆర్యమాల - గ్రామ సేవకులు 'ఎలోడు' మొదలగునవి. (బి.సి. జాబితాలో ఉన్నారు.)
8. నేతకానిమాల - బట్టలు నేయడం (పానుగంటి లక్ష్మినర్సింహరావు 'సాక్షి' పుస్తకంలో ఉందీ ఈ కులం గూర్చి.)
9. పంబలిమాల - బిక్షాటన
10. గుర్జాపు మాల - ,,
11. కొప్పుల వెలుమ - బి.సి. జాబితాలో ఉంది.
12. అరవ మాల - రైతు కూలీలు

ఈ పైన తెల్పిన ఉపకులాల మధ్య వియ్యం పొతు గాని కంచం పొత్తు

కాని లేదు. ఇప్పుడిప్పుడు ఈ కులాలు కలిసి పోతున్నాయి. నాకు తెలిసినంత వరకు ప్రతి కులంలోను ఉపకులాలు ఉన్నాయి. పెళ్ళి సమయాలలోనే వాటి ఉనికి తెలియవస్తున్నది.

ఏది ఏమైన భారత దేశ రాజకీయం మనుష్యులను కులాల వారిగా విడదీసి పాలస్తున్నది. కులాలది ఒక ఎత్తైతే అస్పృశ్యత మరొక ఎత్తు. ఇది మోసము ఇంకా మూర్ఖత్వము అనవచ్చును. అస్పృశ్యత పేరుతో మనిషిని మానసికంగా హింసించడం జరుగుచున్నది. ఇక ఇవి జరగకూడదని భారత రాజ్యాంగం చెప్తుంది.

The President, Sri V.V. Giri, underlined the need to Amend Article 17 of the Constitution to Provide for imposition of Capital punishment to those who practised untouchability............

Inaugurating Dr. B.R. Ambedkar College of Arts, Commerce and Science at Hyderabad.......deviating from the text of his speech.....with a raised voice.......the President said that every one was born from his mother's womb and would go to the funeral pyre just like any one and in these phases of human life there was no distinction between Caste and Creed......... [1]

(The Deccan Chronicle, 16-9-1973)

''కనుక ప్రజాస్వామ్య వాద మందును, 'మానవసేవయే మాధవ

1. 'గుడిసెలు కాలిపోతున్నై' పుట నెం. ౪ 2. 'కులమేది?' పుట నెం. ౭

వసేవ' అనేడి నుడి యందును నమ్మకం గల వారందరూ ముఖ్యంగా పడుచు ఆడ పిల్లలలో, మగ పిల్లలో ముందుగా కుల వ్యవస్థను కూలదోస్తేనే గాని మన దేశం కుమత రహిత ప్రజాస్వామయ దేశం కాజాలదు''[1]

మానవుల మధ్య జాతి, మత, కుల, వర్గ నిమ్నోన్నతాలన్నీ బలాబలాల తేడాల వల్ల పుట్టినట్టివే అంటూ బోయి భీమన్న తన రచనలల ద్వారా ప్రపంచ ప్రజలకు తెలియజేస్తున్నారు.

''చాతుర్వర్ణం మయా సృష్టం
గుణ కర్మ విభాగస్య''

అంటూ గీతలో శ్రీ కృష్ణుడు ప్రతిబోధించిందీ ఈ సత్యాన్నే; అయితే కొందరు కుత్సితులు ఈ కులాలు జన్మతోనే అంకురిస్తాయన్న అజ్ఞాన భావనతో కూపస్థ మండూకల్లా బ్రతికి సమాజాన్నే ఛిన్నాభిన్నం చేశారు. ఈ ఆవేదనతోనే భీమన్న రచనలు చేశాడు.

''కూటికోసము అటు మీద కులము లేని
జాతి కోసము అటు మీద జాతి లేని
మానవత్వము కోసము పూని మీరు
అడుగు ముందిడి సాగుడో అయ్యలార''[2]

బోయి భీమన్న కులరహిత సమాజ నిర్మాణం కోసం పాటుబడ్డాడు. మానవత్వానికి మించి మనుగడే లేదన్నాడు భీమన్న. స్త్రీ స్వాతంత్ర్యానికి సంబంధించిన సమస్యల్ని ఈ నాటకంలో చర్చించాడు. ఒక మానవతామూర్తిగా బోయి భీమన్న నేడు సాహిత్య జగత్తులో ధ్వజ స్థంభంలా నిలబడగలిగి

2. 'కూలిరాజు' నాటకం : ౦వ పుట

ఉన్నారంటే వారి ఉదార దృక్పథమూ, సమసమాజ నిర్మాణకాంక్షే కారణాలు.

''కూలీరాజు'' నాటకం ద్వారా భీమన్న చెప్పతలచిన దార్శనికత ఏమిటంటే - కులవిభేదాలను రూపుమాపి ఏకైక సంఘటిత భారత జాతిని నిర్మించి భారతీయులందరికీ రాజకీయ, ఆర్థిక, సాంఘిక సమానత్వాన్ని స్థాపించాలన్నదే అతని అభిమతం. దీనిని పరంజ్యోతి నాయిక పాత్ర ద్వారా తన గంభీర అభిప్రాయం ఇలా తెలియజేశాడు.

**పరంజ్యోతి :- ''........................నిరుద్యోగాన్ని, నిరాశనీ దారిద్ర్యాన్నీ దాస్యాన్నీ బాధనూ, బలహీనతనూ, అవిద్యనూ, అధర్మాన్నీ నిర్మూలించి మన ప్రజలందకీ చాలినంత తిండి, బట్ట, కొంప కలిగిస్తాం''** [1]

మన భారతీయ మహర్షులు ప్రబోధించిందీ ఇదే విధమైన సామ్యవాదాన్నే, అభ్యుదయ వాదాన్నే. వారు బోధించిందీ ఈ శ్లోకం చూడండి-

**''యవద్భ్రమేత జఠరం**
**తావత్ స్వత్వం హి దేహినాం**
**అధికం యో ऽభియన్యేత్**
**సస్తేన దండమర్హతి''**

'కడుపుకు ఎంత అవసరమో అంతమేరకే మనిషి ఆధీనంలో ఉంచుకోవాలి. అంతుకుమించి దాచుకుంటే దండించబడతాడు', అన్న తాత్పర్యమ్ పై శ్లోకానిది; ఇంతకు మించిన సోషలిజం, కమ్యూనిజం వేరే ఏముంటుంది

1. 'కూలిరాజు నాటకం 131 వ పుట

గనుక ! మానవులంతా మహర్షుల బోధనల కనుగుణంగా మనుగడ సాగిస్తే లోకంలో ఈ ఆర్థిక వ్యత్యాసాలు, అల్ల కల్లోలాలు ఎందుకు ఉప్పరిల్లుతాయి; భీమన్న దృక్పథమూ మహర్షుల బోధనలకు సారూప్యమైనదే.

సమాజం సుఖశాంతులతో జీవించడానికి దోహదం చేసే పాత సంప్రదాయంలోని మంచితనాన్ని స్వీకరించి, మానవ ప్రశాంతి జీవనానికి తోడ్పడే రచనలెన్నో చేశాడు భీమన్న. అందులో ఒకటి 'అసూయ' నాటకం.

సమాజ ప్రగతికి ప్రతిబంధకమయి మానవత్వాన్ని మంటగలిపే కులమత భేదాలు 'సంఘదేహాన్ని'' దహిస్తాయని భీమన్న గారి ధృడభిప్రాయం. దానినే ఈ రూపకంలోని కవిత ద్వారా తెలియజేస్తాడు.

**''సత్యము నసత్యముగ చూపజాలు వొకడు**
**లేని అపవాదులెన్నొ కల్పించు నొకడు**
**మంచి వానిని పడద్రోయ నెంచు నొకడు**
**మానవత్వము నాశనమయ్యె నేడు''** [1]

ఇలా సాంఘిక దోషాలను ఎత్తిచూపి మానవత్వపు విలువలను ప్రబోధించాడు భీమన్న. కులవిభేదాలు విస్మరించి సమాజాన్ని చైతన్యవంతం చేయమని విద్యావంతులకు సూచించాడు భీమన్న.

ప్రతి తత్త్వవేత్తకు ఒక ఆలోచనాక్రమం, పరిశీలన దృక్పథమూ ఉంటాయి అట్లాగే భీమన్నదీ ప్రధానంగా మనవతా దర్శనం. ఈ దర్శనానికనుగుణంగానే వివిధ సామాజిక ఆర్థిక రాజకీయ నైతిక సమస్యలకు పరిష్కార సూత్రంగ తనదైన భావజాలాన్ని ప్రసరింపజేశాడు భీమన్నగారు. తాను

1. 'అసూయ' రూపకంలో రాజా పాత్ర చేత అనిపిస్తారు భీమన్న (రంగం. 4)

రూపొందించిన రూపకాల్లో ఒకటి – ''మానవుని మరొక మజిలీ'' . ఇందు జగచ్ఛ్రేయస్సును కాంక్షిస్తూ తన అభిప్రాయాలను తెలిపాడు.

**''రాజకీయ తీర్మానం కాదిది**
**కాదిది ఆర్థిక కార్యక్రమము**
**వేదమాత మనకాదేశించిన**
**అఖిల జగచ్ఛ్రేయ స్వరూపమిది**
**ప్రభాతమయ్యిందోయ్**
**ప్రఫుల్లమయ్యిందోయ్ లోకం''** [1]

ఇలా భీమన్న తన సమాజం ఆనందంగా, ధర్మబద్ధంగా జీవించడానికి దోహదం చేసే విధంగా జాతిని జాగృతం చేశాడు.

నిర్జీవమైన ఒక సమస్యకు ప్రాతినిధ్యం వహించేకంటె సజీవమైన పాత్రను సిద్ధం చేసి ఆ పాత్రను సమస్యాపూరితమైన సమాజంలో బ్రతకనీయడం మంచిది కదా అనే అభిప్రాయంతో సామాజిక సమస్యల్ని మానవ విలువల్ని తెలియజేసే రచనలు కావాలంటాడు నాటక రచయిత ఇబ్సన్. అలాగే మన నాటక రచయిత బోయి భీమన్న కూడా.

ఒక నాటకానికి ముందు మాట వ్రాస్తూ ఇబ్సన్ – "It was not my desire to deal in the play with so called problems, what I wanted to do was to depict human beings, human emotior and human destinies upon a ground work of certain so conditions and principles of the present day. That is to s

1. 'మానవుని మరొక మజిలి' పుట నెం. 215

here is your society, have are your pillars. Here are their resealities. What have you to say of it" [1]

1930 వ సంవత్సరంలో వచ్చిన ఉప్పు సత్యాగ్రహ ఉద్యమం, హరిజనోద్ధరణ వంటి గాంధీ కార్యక్రమాలు తెలుగు నాటక రచయితలపై గొప్ప ప్రభావాన్ని చూపినై. ఆ ప్రభావం భీమన్న పై కూడ ఉంది. అందుకే సాంఘిక సమస్యల్ని ఎత్తి వ్యంగాత్మకంగా ''పడిపోతున్న అడ్డుగోడలు'' రూపకం రచించాడు. ప్రజల్లో కనువిప్పు కలిగించే ప్రయత్నం చేశాడు.

ఈ రూపకం ద్వారా కులపట్టింపు అర్థరహితమని, మూఢనమ్మకమని, అనాగరికమని ఇది తొలగిపోవాలని భీమన్న ప్రభోధిస్తాడు. మతాచారం ముఖ్యం కాదనీ నైతిక జీవనం అతిముఖ్యమన్న తాత్త్వికఁ చింతనను ప్రభోదం చేశాడు భీమన్న.

సృష్టిలో సమస్తం ప్రేమమయం. పుడమిపై ప్రేమరాజ్యం స్థిరపడాలని కొరుకునే వారిలో ముఖ్యుడు భీమన్న. ప్రేమకు కులభేదాలు ఉండవు. అదే సిద్ధాంతాన్ని తెలియజేసే రూపకం ''రాగవాసిష్ఠం' – ఇందులో .........

**''పికము పాడుటకు వల్లిక పల్లవించుటకు**
**సంబంధమేటే సంధ్యాకుమారి?**
**పరిణతినిజెందు చుందురు ఎవ్వరికి వారె**
**నవ మాసమందు నీవా భేదమెచటిదె?''** [2]

మానవుల మధ్య ప్రేమాదరాలకు కులభేదం అనవసరమన్న అభిప్రాయం భీమన్న పై కవిత ద్వారా వ్యక్తం చేశాడు.

ఆయన సాంఘిక భావాలు ఉన్నతమైనవి. మన సంఘంలోని

1. 'వ్యాసాంజలి' సంపుటి 22వ పుట – 2) 'రాగవాసిష్ఠం' రూపక 24 వ పుట

అస్పృశ్యత, కులభేదాలు, అన్యాయాలు, అక్రమాలు, దౌర్జన్యాలూ దోపిడీలూ చూస్తూ, అనుభవిస్తూ, అడ్డుకొంటూ తన్నివారణోపాయాలను ప్రబోధిస్తూ కవితా ప్రస్థానం చేస్తున్నాడు భీమన్న.

**''దివ్యబాల నరుంధతీదేవి నమృత**

**హృదయ నస్పృశ్య యనగ నోరెట్లు వచ్చె?**

**నరుని వెలిబెట్టి హింసించు నరుడు నరుడె**

**మానవాభ్యుదయముకిది మంచి దగునె?''** [1]

అంటరానితనమనే క్రూర దురాచారం భీమన్న మనసును ఎంత గాయం చేసిందో ఈ పంక్తుల వెల్లడిస్తున్నాయి. అరుంధతీదేవిని గూడా అస్పృశ్యురాలనే కుల కుత్సితపరులను భీమన్న ఈసడించుకొంటున్నాడు. నరుడు సాటి నరుణ్ణి అస్పృశ్యత పేరుతో వెలిగా ఉంచటం ఘోర మనీ, అటువంటి నరుడు నరుడే గాదని భీమన్న తెల్పుతూ మానవాభ్యుదయానికీ అంతరాలు మంచి చేకూర్చవన్న హితాన్ని ఉపదేశిస్తున్నాడు.

**సర్వేభవన్తు సుఖినం**

**సర్వే సన్తు శరీమయా**

**సర్వే భద్రాణి పశ్యన్తు**

**మా కశ్చి ద్దుఃఖ భాగ్వవేత్''**

అన్న ప్రాచీన మహర్షుల సూక్తి గూడ భీమన్న విశాల దృక్పథాన్నే వెల్లడిస్తున్నది. అందరూ కల్సి సుఖంగా జీవించాలనీ, కలగలసి బ్రతకాలనీ, ఎవరూ దుఃఖించరాదనీ పై మంత్ర సారాంశం. స్వార్థపరుల వల ఏర్పడ్డ ఈ కులాలు, అంతరాలు, అస్పృశ్యభావాలు సమసిపోవాలనే భీమన్న ప్రబోధించేది.

కలతలతో, కక్షలతో కష్టాలపాలైన లోకాలన్నీ ప్రేమతో ఏకమయి

1. 'పైరుపాట' రూపకం 17 వ పుట

సుఖించాలని వాంఛిస్తూ - ''పైరుపాట'' రూపకంలో భీమన్న ఇలా అన్నాడు.

**''పని యేదైనా గాని**
**పరమేశుని రూపకం గద**
**పరమేశుని రూపం లో**
**తర తమమ్ము లేముంటై''** [1]

ఈ పరమార్థం ఎప్పటికైనా మానవులకు ప్రాప్తం కావాలన్నది భీమన్న అభిమతం.

మత కలహాలూ, అంటరానితనం, కులకక్షలూ మొదలైన దురాచారాలు, మూఢవిశ్వాసాలూ మద్యపానం వంటి దుర్వ్యసనాలు విశృంఖలంగా తాండవిస్తున్న రోజులవి. గత విదేశీపాలనా, కమ్ముకొన్న పాశ్చాత్య నాగరికతా పెట్టుబడిదారీ వ్యవస్థ, దళారుల విజృంభణా, కపట రాజకీలూ మన సమాజాన్ని అతలంకుతలం చేస్తున్నాయి. మన జీవనంలోని ప్రతి అంశం మీద దుష్ప్రభావాన్ని కల్గి స్తున్నాయి.

అలాంటి పరిస్థితుల్లో భీమన్న సమాజంలోని ఆర్థిక వైరుధ్యాలనూ ''కులాల కుళ్ళునూ, మూఢాచారాలనూ, అంధ విశ్వాసాలనూ కళాత్మకంగా తూర్పారబట్టి ప్రజలను చైతన్యవంతుల్ని చేసి సంస్కరణోద్యమానికి మార్గదర్శులైనారు. 'చిత్ర కళా ప్రదర్శన' రూపక సంపుటి ద్వారా ఇది ౹నుభూతమవుతుంది. ఈ సంపుటిలోని ఒక రూపకం ' చాండాలిక' ఇందు నాయిక చాండాలిక ద్వారా ఈసంభాషణ చెప్పించాడు భీమన్న.

**''కులాన్ని బట్టి కాదమ్మా అదృష్టం**

1. 'పైరు పాట' రూపకం - 17 వ పుట

**మనిషిగా పుట్టడమే ఒక అదృష్టం**

**తనను తాను తెలుసుకొని**

**తన్మయమైన పోవడమే పరమార్థం**

**కులమేమటి - కులం?**

**రెండే కులాలు మనిషికి**

**పండితుడు, పామరుడు**

**పండితునికి కులం లేదు**

**పామరుడే కులమైనా పశువే!''[1]**

'గుణాల గుణి షు పూజా స్థానమ్ ; నచ లింగః నచో వయః '' అంటుంది శాస్త్రం. గుణమే ప్రధానం గానీ, కులమూ, వయసూ కాదంటుంది. భీమన్న చెప్తున్నదీ ఈ మహాదాదర్శాన్నే. మంచీ-చెడూ, జ్ఞానీ-అజ్ఞానీ తప్ప అంతకు మించి వేరే కులాలేవీ లేవని భీమన్న ప్రబోధిస్తున్నాడు. అవాంఛనీయమైన ఈ కులభావం కారుచిచ్చులా వ్యాపించి మనుష్యుల్లోని మానవత్వాన్ని మంట గులుపుతుంది. కుత్సిత మాత్సర్యాలను పెంచుతుంది. జాతి ప్రగతిని దహింప చేస్తుంది అంటూ బోయి భీమన్న ప్రజల భాధను తన బాధగా వ్యక్తం చేస్తూ సంఘాన్ని చైతన్యవంతం చేశాడు.

సకల తత్త్వాలకు మూలం మానవత్వం. దైవత్వంలో మానవత్వాన్ని, మానవత్వంలో దైవత్వాన్ని చూడగలిగే మనిషి డా॥ బోయి భీమన్న. అందుకే 'బాలయోగి' నాటకంలో ఓ చోట -

**''ఎవరు వెలుపల లోపల ఎవరు తలవ**

1.'బాలయోగి' నాటకం 51 వ పుట

**ఎవరు తనవారు పరవారు ఎవరు ధరణి**
**తనకు రాధకు మధ్య బాంధవ్యమేమి**
**ప్రాణ మొకటన్న జ్ఞానమె బ్రహ్మతాను''** [1]

'సత్యం జ్ఞానం; అనంతం బ్రహ్మ' అన్న ఉపనిషత్ వాక్యానికి 'జ్ఞానమే భగవత్స్వ రూపకం' అన్న బోయి భీమన్న నిర్వచనం ఒక వ్యాఖ్యానం వంటిది మాత్రమే.

"The philosophers have only interpreted the world in various ways; the point however is to change it" 'తాత్త్వికులు ప్రపంచాన్ని ఎన్నియో విధముల వివేచించినారు. ప్రశ్నల్లా ఈ ప్రపంచాన్ని ఏ రీతిగా మార్చాలన్నదే' అని కార్ల్ మార్క్స్ పేర్కొంటాడు. వారి దాదర్శ లోకమైతే ఈ యనది ఆచరణ లోకం.

ఏ వ్యక్తికైనా జన్మతో శూద్రుడు; కర్మతో ద్విజుడు. ద్విజుడు ఆర్యుడు, శూద్రుడు అనార్యుడు. శూద్ర బ్రాహ్మణత్వాలు ఒకే వ్యక్తిలో అతని విజ్ఞాన స్థాయిని బట్టి ఏర్పడే రెండు దశలు. శూద్రుడు సంస్కారం వల్ల బ్రాహ్మణ్యం పొందుతాడు. ఈ విషయం మహాభారతంలో స్పష్టంగా చెప్పబడింది.

**''న జాతిః పూజ్యతే రాజన్**
**గుణాః కళ్యాణ కారకాః**
**చండాల మపి వృత్త స్థం**
**తందేవా బ్రాహ్మణం విదుః'' – భారతం.** [2]

ఈ విషయాన్ని భగవద్గీత మరీ స్పష్టంగా వివరించింది.

---

1. 'బాలయోగి' నాటకం 51 వ పుట 1, 2 – రాగవాసిష్ఠం – రూపకం 15 వ పుట

"చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణ కర్మ విభాగశః" – భగవద్గీత [1]

ఇక మనుస్మృతి యందు ఇలా వుంది.

"బ్రాహ్మణ క్షత్రియో వైశ్యః
త్రయో వర్ణా ద్విజాతయః
చతుర్థ ఏక జాతి స్తు
శూద్రో నాస్తితు పంచమః" [2]

వీటి ఆధారంగా బోయి భీమన్న తన రచనల ద్వారా 'భారత జాతి ఒక్కటే నని, నాడు వర్ణవ్యవస్థ వృత్తుల దృష్ట్యా ఉన్నప్పటికీ అస్పృశ్యత అసలు లేనే లేదని, ఇది మధ్యలో ప్రవేశపెట్టబడిన కుతంత్రమని దీనిని ఖండించాలంటాడు భీమన్న. ఆర్యులూ, ద్రవిడులూ ఒకే జాతికి చెందిన వారని, జాతి విభేదం లేనేలేదని, ఉండకూడదనే సిద్ధాంతాన్ని 'ఆదికవి వాల్మీకి' రూపకం ద్వారా ప్రవేశపెట్టి తెలియజేస్తాడు.

"ఆర్య" అన్నది జాతి సూచికం కానే కాదనీ, అదిగౌరవ వాచకమనీ ఇప్పటికే పలువురు పెద్దలు ప్రకటించారు. "రాయల్ ఏషియాటిక్ సొసైటీ" అన్న బ్రిటిష్ సంస్థ ఆర్యులు భారతదేశంలోకి చొచ్చుకువచ్చి, ద్రావిడులను పారద్రోలారన్న అసంబద్ధ అవాస్తవ విషయాలను వ్రాసింది. తమవలెనే ఆర్యులు గూడ వలస వచ్చిన వారేననీ, భారతదేశానికి ప్రాచీన సంస్కృతే లేదనీ తెల్పుతూ బ్రిటిష్ చరిత్రకారులు తప్పుడు వ్రాత లెన్నో వ్రాశారు. డాక్టర్ అంబేద్కర్ సైతం వీరి వాదనల్ని ముక్తకంఠంతో ఖండిస్తూ ఆర్యులిక్కడి వారేనని తెలియజేస్తాడు.

---

1. రాగవాసిష్ఠం రూపకం 15 వ పుట- 2.3. రాగవాసిష్ఠం రూపకం 7 వ పుట - [illegible]
నూసహతిక - జూన్ 1991 - 5 వ పుట

'అస్మిన గంగ, అస్మిన యమున.....' అన్న సూత్రాన్ని అంబేద్కర్ ఉదాహరిస్తూ ఆర్యులు స్థానికులు కాకుంటే ''నా గంగ......నా యమున'' అని సంబోధించరని ప్రకటిస్తాడు.

సాంఘిక దోషాలను సరిదిద్దడం, మానవత్వపు విలువలకై పోరాడడం విద్యావంతుల ధర్మం. కుల విభేదాల్లోంచి పుట్టి పెరిగిన ఈ సాంఘిక దురన్యాయం విషయంలో భీమన్న గారు తమ విశాల దృక్పథాన్ని ప్రదర్శించాడు.

''లోకులు కాకులే
కోకిల పిల్ల
లోకువిచ్చావంటె
నూకలు కళ్ల
చేతికందిన పూలు
చిదిమి పారేస్తారు
అందక పోతే
ఆరడి పెడతారు
పై నున్న వాళ్ల కాళ్ళు
పట్టుక వేలాడుతారు
తక్కువ వాళ్లను
తొక్కుకొని పోతారు''[1]

అంటూ కులతత్వాన్ని భీమన్న గారు తీవ్రంగా ఖండించాడు. తన రూపకం అయిన 'ప్రగతి' లో పాట ద్వారా.

ఇలా భీమన్న తన రచనలన్నింటిలోనూ సమాజాన్ని పట్టి పీడించే

1. 'ప్రగతి' నాటిక - 40 వ పుట

ంమస్యల్ని ప్రతిఫలింప చేశాడు. ప్రజల జీవన స్థితిగతులను మెరుగుపరిచే ఫబోధాలనెన్నింటినో చేశాడు. కులాలు అంతరించి పోవాలనీ, మానవుడు ుహిలో మహర్షిలా వెలుగొందాలన్న ఆశను వెల్లడించాడు. తన అభ్యుదయ భావాలతో, మానవతా చింతనలతో సాహిత్యాన్ని పరిపుష్టం చేశాడు.

# ఉప సంహారము

క్రీ.శ. 1935 తరువాత ప్రపంచంలో ఏర్పడిన సాంఘిక, ఆర్థిక సంక్షోభాలు, మార్పులు, రాజకీయ చైతన్యం ప్రభావం వలన విశ్వసాహిత్యం లో హేతు, అభ్యుదయ (మార్క్సిజం) వాదాలు వచ్చాయి. ఒక తాత్త్విక రాజకీయ దృక్పథాన్ని భూమికగా చేసుకుని సాహిత్యంలో కర్తవ్య నిర్దేశం ప్రబోధం జరగాలనే ధోరణి భయలు దేరింది. జీవిత తత్త్వాన్ని నూత్న దృష్టిలో అభివ్యక్తం చేస్తూ మేధాగతంగా అర్థాన్నీ పాఠకునికి అందించే లక్షణం ఏదైతే ఉందో అదే తాత్త్వికం. తాత్త్వికం ఒక విజ్ఞానం, తత్త్వం ఒక వైజ్ఞానికం. తత్త్వం లేకుండా ఎవరూ ఉండరు. తత్త్వం (philosophy) అనే మాట పైథాగరస్ మొదట కనుగొన్నాడు.[1] 'కేవలం ద్రష్ట' అని ఒలింపిక్ క్రీడల్లో వాడిన మాట తాత్త్విక దృష్టికి నిదర్శనంగా భావించారు.

తాత్త్వికుడు తన సిద్ధాంతాలను శాస్త్రీయ శైలిలో చెప్పును. కవి దానినే తన జీవిత సిద్ధాంతము నాధారముగా చేసుకుని కావ్యమయ శైలిలో తెలుపును. కవి గంభీరుడైన తాత్త్వికుడు కూడా. బోయి భీమన్నలోనూ ఈ తాత్త్వికతయే కనిపిస్తుంది.

డా॥ బోయి భీమన్న తమ రూపకాలలో సాహిత్య జగత్తును తేజోవంతం చేశాడు. ఉదయమాన కవులకు మార్గదర్శకుడైనాడు. తమ కవిత్వ విధానం తో భావ కవిత్వానికి ఒక రూపాన్నిచ్చాడు. అద్వైత తత్త్వాన్ని గుర్తించినాడు.

1 'మిసిమి' మాసపత్రిక - ఆగష్టు 1993 సంచిక - 25 వ పుట

తమ తాత్త్విక దర్శనంతో, ఆలోచనా విధానంతో కొందరికి ఆలోచించే అవకాశాన్నిచ్చాడు. తాను సాధించి ఆరాధించే సాహిత్య సిద్ధాంతానికి 'రసాద్వైతం' అని పేరు పెట్టుకున్నాడు. ప్రతిఫలాపేక్షలేని పరమ ప్రేమ ఈ అద్వైత భావానికి ఆధారం.

**''ఏక హృదయ సంసిద్ధే రసాద్వైతం**
**లోక హృదయ సంబుద్ధే వాని తత్త్వం''** [1]

– అని అద్వైత తత్త్వాన్ని అవగాహనంచేసుకొన్న కవి బోయి భీమన్న కవిత్వం పట్ల నిర్దిష్టమైన అభిప్రాయలతో సాహిత్య రూపకల్పన చేశాడు. కవిత్వం అశుభం పలకకూడదని, అమంగళం కోరకూడదని వీరి విశ్వాసం. భావాన్ని స్పష్టంగా చెప్పడం కంటె 'ధ్వని' ప్రధానంగా చెప్పటంలో రమణీయత ఉన్నట్లు భావిస్తాడు. కనుకనే వారి రచనల్లో 'శ్లేష', 'ధ్వని' అధికంగా కనబడుతాయి., అక్షర రమ్యత, భాషా సారళ్యం కవిత్వానికి అవసరమని నమ్ముతాడు. భాషవిషయంలో తాను పూర్తి స్వేచ్ఛను పొందాడు . శృంగార కరుణ రసాలు రెండు ప్రధాన రసాలని భీమన్న అభిప్రాయం.

యావజ్జాతిని కదిలించిన సంఘటనలు వారినీ కదిలించాయి. ఆ స్పందన వీరి కవితావాహినిలో సమకాలీన సమస్యలుగా చోటుచేసుకున్నాయి. అందరినీ కదిలించిన వార్తలు, సంఘటనలు, సన్నివేశాలు వీరికి ప్రేరణనిచ్చి కవితా వస్తువులయ్యాయి. స్వాతంత్ర్యోద్యమం, అస్పృశ్యతా దురాచారం వీరి రచనలకు ఆలంబనమయ్యాయి. ఇటువంటి సమస్యల ఉధృతం అంతగా లేనప్పుడు తనదైన తాత్త్విక చింతనతో రచనలు చేశాడు. పద్యకావ్యాలు, ప్రబోధ గేయాలు, వచన సంపుటాలు ఉదాహరణకు 'గుడిసెలు కాలిపోతున్నాయి',

1. 'బోయి భీమన్న సాహితీ షష్ఠి పూర్తి సంచిక 23 వ పుట

'దీపసభ' మొదలగునవి కొంత పరిస్థితుల ప్రభావం వల్ల వచ్చినవే. పాలేరు, కూలిరాజు, ప్రగతి, రాగవాసిష్ఠం, బాలయోగి మరియు చిత్రకళా ప్రదర్శనం మొదలగు రూపకాలు ఉద్దేశపూర్వకంగా తన తాత్త్విక చింతనతో వ్రాసినట్టివి.

వీరి గేయ రూపకాల్లో కవితావేశం స్ఫురించే వస్తువు గొప్పగా ఉండడం వల్ల నాటకాలకు అధిక ప్రచారం వచ్చిందనే చెప్పొచ్చు. వీరి తాత్త్విక చింతనని తన రచనలు ఆధారం చేసుకున్నవి కావడం వల్ల వాటిలోని తత్త్వాన్ని సామాన్యులు అవగాహన చేసుకోవడంలో కొంత కష్ట పడక పోలేరు. అయినా వీరు సామాన్యుల దృష్టిలో ప్రజాకవిగా ఎక్కువ పేరును నిలుపుకున్నట్లు తెలుస్తుంది.

దేశాభిమానం భాషాభిమానం గుండెనిండా నింపుకున్న బోయి భీమన్న గారి 'నిండు మనంబు నవ్య నవనీత సమానంబు, పల్కు దారుణా ఖండల శస్త్ర తుల్యం' అనవచ్చు. తెలుగు వారి ఆచారాలు ,సంప్రదాయాలు వీరి కావ్యాలన్నింటా మూర్తీభవించాయి. వీరి కావ్యభాషతో తెలుగు భాషా తీయదనాన్ని రుచి రూపాడు. కావ్య వస్తు గ్రహణంలో, రచనా విధానంలో భావాభివ్యక్తిలో అన్నిటా ప్రత్యేత కనబరిచాడు. వ్యావహారిక, నూతన పదబంధాలను, అతి సామాన్యపదాలను, లోకోక్తులను ప్రయోగిస్తూ తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశాడు. వీరి కవిత్వంలో కొంత శైవ సంస్కృతీ పదజాలం కనిపిస్తుంది.

'కడుపులో కరుణయు, కంఠాన విషము
అగ్నిలలాటాన, నౌదల గంగ
జడలోన జాబిల్లి, మెడలోన నాగు
వైరుధ్యముల సమన్వయ రూపవంతడు'

ఈ పద్యం భీమన్న ''అర్ధనారీశ్వరుడు'' అనే ఖండకావ్యంలో వ్రాశాడు. భీమన్న శివశక్తుల ఆంతర్యం తెలిసిన రసాంతరంగ కవి. ఈ అంతరంగం నుండే ఒకప్పుడు 'శివోహం' అని వినిపిస్తుంది.

బోయి భీమన్న మీద వేదోపనిషత్ ప్రభావం ఉందని చెప్పొచ్చు. వీరి సంస్కారం ప్రాచీన కవులది. అయినా విధి బలీయాన్ని, పునర్జన్మ పురాకృత కర్మఫలాన్ని ఇతను విశ్వసించడు. ఇంకా స్మృతుల విషయంలో వీరి కంత పట్టింపు లేదు. కొన్ని ఆచార వ్యవహారాల విషయంలో కూడ అంతగా పట్టుదల లేదు. ప్రకృతిలో జగన్మాత మాతృరూపాన్ని దర్శించి ఆరాదించడం వీరి లక్ష్యం. స్త్రీల పట్ల విశేషమైన గౌరవాభిమానాలుండం వల్ల స్త్రీ స్థానాన్ని గూర్చి ఆలోచించునట్లు కనబడుతుంది. ప్రబంధాలలోని మగువల వర్ణనకు వ్యతిరేకి కాని, ప్రేమకు మాత్రం వ్యతిరేకి కాదు. ప్రేమ స్వరూపిణి అయిన స్త్రీలోని సాహసాన్ని తన రచనల యందు పొందు పరిచాడు. పురుషుల వల్ల స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలను వివిధ కోణాల నుంచి దర్శించాడు. స్త్రీ స్వభావంలోని అన్ని కోణాలు వీరి కవితలో ప్రతిఫలించాయి. పరిపూర్ణమైన స్త్రీ వీరి సంపుటాలలో దర్శనమిస్తుంది. స్త్రీని కేంద్ర బిందువుగా గ్రహించి ఆమె ఎదుర్కొన్న సమస్యలను పరిశీలించి తమ 'రసాద్వైత' సిద్ధాంతాన్ని రూపొందించాడు.

విశిష్టమైన వీర రసాద్వైత సిద్ధాంతానికి శైవభక్తి సిద్ధాంతంతో కొంత సామ్యం కనబడుతుంది. 'ప్లేటో' ప్రతిపాదించిన ప్రేమ తత్త్వానికి దగ్గరి పోలికలు రసాద్వైత శృంగార సిద్ధాంతంలో కొంతవరకు కనబడతాయి . జీవిత తత్త్వదర్శనం నుంచి వెలువడ్డ 'రసాద్వైత' శృంగార సాహిత్యం కావ్యాలుగా వెలిశాయి.

సృష్టిలాస్యం అయిన ప్రేమ అందరి మధ్యా వర్ధిల్లాలన్నది వీరి ఆకాంక్ష. రాయప్రోలు వారిఅమలిన శృంగారాన్ని జ్ఞప్తికి తెచ్చేవిధంగా స్త్రీ పురుషులు స్నేహంతో సమాజ శ్రేయస్సును కాంక్షింస్తూ ఉత్సాహంతో ముందుకు రావాలన్నది వీరి అభిమతం. కల్యాణ మయమైన జగత్తులో అసూయ, అరాచకాలు, ద్వేష వైషమ్యాలను మాని ప్రేమను పెంచి పోషించాలన్నది వీరి ఆశ. మానవత్వం పరిమళించే హృదయాలకు స్వాగతం పలుకు వీరి ఆదర్శమే వీరి రూపకాలలోని తాత్త్విక చింతన.

"The writer who refuses to allow a faith, a hope or a theory to interfere with his owrk who has the courage to con-ront existence itself, is also a metaphysician because Exist-ence is reality and not merely its outward from"[1]

ఈ విధంగా భీమన్నను గూర్చిన పరిపూర్ణమైనట్టి సిద్ధాంత వ్యాసం కాకపోయినప్పటికి ఇందులో భీమన్న జీవిత విశేషాలు, మరియు అభిప్రాయ అభిరుచులు ఇంకా అతని సాహిత్య వ్యాసంగం, హేతువాద దృష్టితోనూ, సామాజిక స్పృహతోను అతడు రచించిన సాంఘిక, పౌరాణిక గేయరూపకాల్లోని విశేషాలు, ఇప్పటికి ఉపలభ్యమగుచున్న వస్తు సామాగ్రి ఆధారంగా చేసుకొని రేఖా చిత్రంగా సృజించడమే ఈ సిద్ధాంత వ్యాసం యొక్క ముఖ్యఉద్దేశం...

1. 'మిసిమి' మాసపత్రిక - ఆగస్టు 1993 సంచిక - 25వ పుట

సృష్టిలాస్యం అయిన ప్రేమ అందరి మధ్యా వర్ధిల్లాలన్నది వీరి ఆకాంక్ష. రాయప్రోలు వారిఅమలిన శృంగారాన్ని జ్ఞప్తికి తెచ్చేవిధంగా స్త్రీ పురుషులు స్నేహంతో సమాజ శ్రేయస్సును కాంక్షింస్తూ ఉత్సాహంతో ముందుకు రావాలన్నది వీరి అభిమతం. కల్యాణ మయమైన జగత్తులో అసూయ, అరాచకాలు, ద్వేష వైషమ్యాలను మాని ప్రేమను పెంచి పోషించాలన్నది వీరి ఆశ. మానవత్వం పరిమళించే హృదయాలకు స్వాగతం పలుకు వీరి ఆదర్శమే వీరి రూపకాలలోని తాత్త్విక చింతన.

"The writer who refuses to allow a faith, a hope or a theory to interfere with his owrk who has the courage to confront existence itself, is also a metaphysician because Existence is reality and not merely its outward from"[1]

ఈ విధంగా భీమన్నను గూర్చిన పరిపూర్ణమైనట్టి సిద్ధాంత వ్యాసం కాకపోయినప్పటికి ఇందులో భీమన్న జీవిత విశేషాలు, మరియు అభిప్రాయ అభిరుచులు ఇంకా అతని సాహిత్య వ్యాసంగం, హేతువాద దృష్టితోనూ, సామాజిక స్పృహతోను అతడు రచించిన సాంఘిక, పౌరాణిక గేయరూపకాల్లోని విశేషాలు, ఇప్పటికి ఉపలభ్యమగుచున్న వస్తు సామాగ్రి ఆధారంగా చేసుకొని రేఖా చిత్రంగా సృజించడమే ఈ సిద్ధాంత వ్యాసం యొక్క ముఖ్యఉద్దేశం...

ప్రజల చరిత్రను సంస్కృతిని సాంప్రదాయాలను జీర్ణించుకొని ప్రజల కందించడమే బోయి భీమన్న రూపకాలు ప్రత్యేకతను సంతరించుకున్నాయి. ఉద్యమ చైతన్యాన్ని, వ్యాప్తిని ప్రజల కందించడం భీమన్న తాత్త్విక చింతన అని చెప్పొచ్చు.

1. 'మిసిమి' మాసపత్రిక - ఆగస్టు 1993 సంచిక - 25వ పుట

ఒక క్రొత్త Melody వీరి రూపకాల యందు కనిపిస్తుంది. ఈ విషయం గూర్చి "The roots of all cultures that exist from the Himalayas to Cape Comorin were laid in the great Sanskritic tradition. No literature could grow in this land independently. Telugu literature is but a fond child of Sanskrit literature. The first masters of Telugu literature accepted the Sanskrit language as the base of Telugu language.[1]

1. 'విశ్వనాథ అసంకలిత సాహిత్య [illegible]

# ఇతరులు భీమన్న గురించి

నేను నా పరిశోధన అంశం కోసం ప్రశ్నావళి తయారు చేసి ప్రముఖుల అభిప్రాయాలను ప్రత్యక్షంగాను పోస్టు ద్వారానూ సేకరించడం జరిగింది. అట్టి అభిప్రాయాలను ఈ మొదటి అనుబంధంలో చేర్చడం జరిగింది.

పద్మశ్రీ బోయి భీమన్న గారితో జరిపిన ఇంటర్వ్యూ విశేషాలు రెండవ అనుబంధంలో ఇవ్వడం జరిగింది.

## ప్రశ్నావళి:

1. ఆధునిక తెలుగు సాహిత్యంలో బోయి భీమన్నకున్న స్థానం ఎలాంటిది? కవిగా ఆయనకున్న ప్రత్యేకత ఏమిటి ?

2. బోయి భీమన్న ప్రతిపాదించిన రసాద్వైత సిద్ధాంతం గూర్చి మీ అభిప్రాయమేమిటి ?

3. భీమన్న సమాజ దర్శనమెలాంటిది ? దానికోసం భీమన్న సాహిత్యాన్ని ఉపయోగించిన పద్ధతి ఏమిటో వివరించండి ?

4. వివిధ సాహిత్య ప్రక్రియల్లో భీమన్న కనబరచిన తాత్త్వికత ఏమైనా ఉన్నదా ? ఉంటే వివరించండి ?

5. దైవ భావన గూర్చి భీమన్నకున్న అభిప్రాయాలను మీరెట్లు అర్థం చేసుకున్నారు ?

6. భీమన్నకు నాటకకర్తగా ఎలాంటి స్థానమున్నది ?

7. నాటక ప్రక్రియను భీమన్న సామాజిక సమస్యల పరిష్కారం కోసం వాడుకున్న పద్ధతి ఎలాంటిది ?:

8. భీమన్న రూపకాలలోని ప్రత్యేకతను వాటిలోని తాత్త్వికతను మీరెట్లు అర్థం చేసుకున్నరో తెలుపండి ?

9. భీమన్నపై పాశ్చాత్య సిద్ధాంతాల ప్రభావం ఏమైన ఉన్నదా ?

10. భీమన్నపై జాతీయ భావాల ప్రభావం ఉన్నదా ? దేశీయ సిద్ధాంతాల ప్రభావం ఆయన మీద ఎట్లా పనిచేస్తుంది ?

11. మతం గూర్చిభీమన్నకున్న విశ్వాసం ఎటువంటిది ?

12. అంటరాని తనం గూర్చి, దాన్ని నిర్మూలించడం గూర్చి భీమన్న చూపిన పరిష్కాల మార్గాలేమిటి ?

# ప్రొఫెసర్ ఎల్. చక్రధరరావు

విశాఖపట్టణం,

తేది 22-7-1992.

1. ఆధునిక తెలుగు సాహిత్యంలో శ్రీ బోయి భీమన్న గారికి ఉన్న స్థానం సుస్థిరమైనది. వీరి కవితా వాస్తవికతపైఆధారపడి వుంది. సమాజంలోని అట్టడుగు వర్గాల జీవిత విధానానికి వీరి కవిత అద్దం పడుతోంది.
2. శ్రీ బోయిభీమన్న గారి రసాద్వైత సిద్ధాంతం అపూర్వం కానిదైనప్పటికీ వీరు ప్రతిపాదించిన తద్విధానం అనితర సాధ్యం. ఇంతే కాక అందరిప్రశంసల్ని పొందింది. వీరి యీ సిద్ధాంతం సర్వదా సర్వథాసముపదేయం.
3. శ్రీ బోయి భీమన్న గారి సమాజ దర్శనం 'సమ్యగ్దర్శనం' అని ఒక మాటలో చెప్పవచ్చు. వీరు సాహిత్యాన్ని ఋజుపద్ధతి (సూటి విధానం) ద్వారా రచించారు.
4. తత్త్వం(తత్+త్వమ్) అంటే ఉన్నది ఉన్నట్లు తెలుసుకోవటం అని పదవ్యుత్పత్తి. ఉన్నది ఉన్నట్లు నేరుగా చెప్పటమే వీరి తాత్త్వికత. ఇదే యథార్థ దృక్పథం,
5 భీమన్న గారిది మానవ భావనయే దైవభావన.
6. కవిగా భీమన్న గారికున్న స్థానం నాటక కర్తగా లేదు. నాటకాలు నానాటికి అంతరిసుతన్న నేటికాలంలో నాటకాలకు కాని నాటక కర్తలకు కాని సముచిత స్థానం లేదు.

7. సామాజిక సమస్యా పరిష్కారానికి ఇతివృత్యాన్ని, భాషను, భావాల్ని జాగ్రత్తగా తీసుకొని శ్రీ గురజాడ వారి వలె శ్రీ బోయి భీమన్న గారు కూడా నాటక రచనను కొనసాగించారు.

8. శ్రీ భీమన్న గారి రూపకాలు కూడా సమాజానికి అద్దం పట్టేవిగా ఉన్నాయి.

9. శ్రీ భీమన్న గర్పై పాశ్చాత్య సిద్ధాంతాల ప్రభావం ఉంది. ఆధునిక కాలంలో పాశ్చాత్య సిద్ధాంత ప్రభావానికి లోనుకాని సాహితీ వేత్తలు లేరు.

10. శ్రీ భీమన్న గారిపై జాతీయ భావాల ప్రభావం ఉంది అస్పృశ్యత కుల వివక్ష, లంచగొండితనం మొదలగు వాటపై వీరి అభిప్రాయాలు జాతీయ భావాల ప్రభావం వల్ల స్థిరపడి క్రమంగా జాతీయ భావ ప్రవంతిలో వీరు ఒక ప్రధాన భాగమై పద్మభూషణ బిరుదును పొందారు నేడు. వీరు కేవలం ఆంధ్ర కవి మాత్రమే కాదు, జాతీయ మహాకవి, విశ్వకవి.

11. మానవతే మతం అని శ్రీ భీమన్నగారి భావన.

12. కులాంతర వివాహాలు జరిపించటం, అన్ని కులాల వారికీ ఒకే చోట వాసస్థానాన్ని కల్పించటం, నూతనాభ్యుదయ దృక్పథాలను కలిగించే విశాల భావాలను పెంపొందించే సాహితీ రచనల్ని అందరకీ అందుబాటులో ఉండేటట్లు వివిధ మార్గాల ద్వారా చేయుటం అంటరాని తనాన్ని నిర్మూలించటానికి గాను వీరు సూచించిన కొన్ని సముచిత మార్గాలు.

ఇట్లు,

భవదీయులు

చక్రధరరావు

27-7-1992

# డాక్టర్ జె. బాపు రెడ్డి, ఐ.ఎ.ఎస్.,

Dr. J. Bapu Reddy, I.A.S.,
Rtd. Commissioner,
Small Savings & State Lotteries
Tilak Road - Hyderabad - 500 001.
Resi: RAMACHILUKA, Plot No. 10, Road No. 5, Jubilee Hills,
Hyderabad - 34

హైదరాబాద్,
30-4-1994

పద్మశ్రీ కళాప్రపూర్ణ బోయి భీమన్న గారు కారణజన్ముడు. ఆయనకు ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక సృజనాత్మక భావుకుడుగా సుందర రసాద్వైత తత్త్వవేత్తగా తనదైన ఒక సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నాడు. పుస్తకాల నుంచి కాకుండా ప్రకృతిలో నుంచి నిత్య జీవితా సత్యా నుంచి సాహిత్య స్ఫూర్తిని పొందిన విజ్ఞాన ప్రజ్ఞాన జిజ్ఞాసువాయన - ఉపజ్ఞాకోకిలమతడు. భారతీయ చరిత్రను సంస్కృతిని ఆకళింపు చేసుకుని మానవ జీవితాన్ని మహోన్నత శిఖరాల వైపు నడిపించే అక్షర సోపానాలు నిర్మిస్తున్న అద్భుత ప్రతిభాశాలి, ప్రగతిశీలి ఆయన. అతడు అనాది కొస నుంచి అనంతత్వంలోకి పయనించే అకాండ తాండవ మూర్తి . కవిత అల్లినా రూప (నాట) కాలు రచించినా, వ్యాస పీఠికలు వ్రాసినా ఆయన కలంలో నుంచి కాలాతీత అమృత భావ చేతనం ఆవిర్భవిస్తుంది.

సామాజిక సమస్యలకు పరిష్కారం చూపే శక్తితో పాటు, ఆధ్యాత్మిక చింతనను భౌతిక జీవితానందంతో జోడించే పరమార్థాన్ని ప్రబోధించే ప్రజ్ఞను కూడా ఆయన ప్రదర్శించాడు. అందుకే కుల మత, జాతి విభేదాలకు కట్టుపడని విశ్వచైతన్యన రథ సారథి డా॥ బోయిభీమన్న.

వ్యాస వాల్మీకి కాళిదాసు వంటి కవి ఋషుల వంశానికి చెందిన చిరంజీవి ఆయన. ధర్మం కోసం పోరాడుతున్న కర్మవీరుడు ఆయన. సృష్టి రహస్యం తెలిసి ద్రష్ట ఆయన.

దేశం అనే మైదానంలో పరుగుపెట్టే కాలమనే గుఱ్ఱాల గుట్టు తెలిసిన దిట్ట అతను. అందుకే ఆధునిక సాహిత్య రంగంలో ఆయనకు ఏ పాటు లేదు, జాక్ పాట్ తప్ప.

–జె. బాపురెడ్డి

## శ్రీమతి హైమవతి భీమన్న

ఇంనెం. ఐ.సి. 85,
ఇరంమంజల్ కాలనీ
హైద్రాబాద్ – 500 482.

భాగ్యనగరం,
తేది: 30-4-1994

పేదవాని కుండలలో
వేద మధువు నిండాలి
వేద మాత గుండెలలో
విశ్వజనత పండాలి

అంటాడు డా. బోయి భీమన్న తన "రాఖీలు" గేయ సంపుటిలోని ఒక పాటలో

కొందరికి గుండె చిన్నది, కొందరికి మనసు చిన్నది
బ్రతుకె కొందరికి చిన్నది
అంత మాత్రాన ఇల చిన్నదనము లేదు
పెత్తనము చేయు నీ కన్ను పెద్ద దైన

అంటాడు తన "మధుగీత" కావ్యంలో

చిత్తంలో ప్రతి దెబ్బా
సుత్తి దెబ్బగా మలచిన
మానవ మూర్తిని మించిన
మహిత శిల్ప మేమున్నది

అంటాడు "పైరుపాట" గేయ నాటికలో.

ఈ మూడు ఉదాహరణలు నేనెందు కిచ్చానంటే సాహిత్యం ద్వారా బోయి భీమన్న ప్రదర్శించిన స్థాయి ఇంతటి ఉన్నతోన్నతమైనట్టిదీ, విశ్వ పరివ్యాప్తమైనట్టిదీ అని చెప్పడానికి.

ఈయన పద్య, గేయ, వచన ప్రక్రియలలో చేసిన సాహిత్య కృషి గురించి తెలియని వారు ఈ నాడు లేరు. ఆయితే తెలిసిన వారే తప్ప నిశితంగా పరిశీలించిన వారు తక్కువ. అట్టి పరిశీలనకు పూనుకున్న శ్రీ తక్కెళ్ల బాలరాజు గారికి నా అభినందనలు.

బాలరాజు గారు పరిశీలిస్తున్న భీమన్న రూపకాలను గురించి చెప్పాలంటే ఇతర ప్రక్రియలలో ఈయన చేసిన కృషి కంటె కూడ ఎక్కువగా చెప్పవలసి వుంటుంది. 'రాగవైశాఖి' కావ్యంలో భీమన్న నాటకాల గురించి ఇచ్చిన అభిప్రాయాన్నే రెండు వాక్యాల్లో ఇక్కడ ఇస్తున్నాను.

సంగీత, సాహిత్య, నృత్య, ఆలేఖ్య శిల్పాది సర్వకళా సంపూర్ణమైన ఒక విశిష్ట కళా ప్రక్రియ నాటకం. నేత్ర పర్వం, శ్రవణ పేయం, మనోమోహనం కాగలిగిందే నాటకం. వాస్తవాన్ని ప్రతిబింబించడం కాదు. ప్రతిబింబాన్ని వాస్తవీకరించడం నాటకం. వెంకయ్యను అద్దంలో చూపడం కాదు. వెంకయ్యను శ్రీ కృష్ణుడుగా చూపడం నాటకం. అందుకే కన్యాశుల్కం ఒక నాటకం కాలేకపోయింది, వసంతసేన నాటకం కాగలిగింది.

ఒకానొకనాడుకన్యాశుల్క నాటకాన్ని, వసంతసేన నాటకాన్ని చూసి భీమన్న వ్రాసిన మాటలు ఇవి. ఒక అర్థశతాబ్దంగా 'పాలేరు' నాటకం సహస్రాధికంగా ప్రదర్శించబడి ప్రజలలో, ముఖ్యంగా బడుగు వర్గాలలో

కలిగించిన సామాజిక చైతన్యాన్ని గమనిస్తే నిజంగా నాటక లక్షణమేమిటో లక్ష్యమేమిటో స్పష్టంగా అవగాహన అవుతుంది.

భీమన్నను గురించి నిజంగా జరగవలసిన పరిశోధన ఇంకా జరగలేదు. ఇప్పుడిప్పుడే ప్రారంభమవుతున్నది. శుభం.

హైమవతీ భీమన్న
30-4-1994

‘‘హిమాని’’
భాగ్యనగరం

## అవంత్స సోమసుందర్

కవి & విమర్శకుడు

కళాకేళి నికేతన్ పిఠాపురం - 533 450

తేది: 29-7-92

డియర్ టి. బాలరాజు గారికి,

మీరు పంపిన ప్రశ్నావళికి నా వ్యక్తిగత జవాబు పంపిస్తున్నాను.

ఆధునిక తెలుగు సాహిత్యంలో బోయి భీమన్నకు ఉన్న స్థానం వివాదాస్పదం, కవిగా అతని ప్రత్యేకత ఏదైనా ఉందంటే అది యధేచ్ఛావాదం. రసాద్వైత సిద్ధాంతం ఏదైనా ఉంటే అదే నేను చెప్పిన మానసిక అరాచకత్వ జన్యమే. అతని సమాజ దర్శనం వైయక్తికమైంది. దార్శనికత లేదు. అతను వివిధ సాహిత్య ప్రక్రియ లేవి రాయలేదు. దైవ భావన ఒక Consolation. Public కోసం చేసే ఆరటాలు. భీమన్నకు నాటక కర్తగా అంతగా గౌరవస్థానం లేదు. సామాజిక సమస్యను Garb గా వాడుకున్నాడు. భీమన్న పాశ్చాత్య సాహిత్యం బాగా చదివిన వాడు కాదు. అతనికి సమాకాలీన అంతర్జాతీయ ప్రముఖ కవుల పేర్లు కొందరివి మాత్రమే తెలియును. భీమన్నపై ఒక దశ వరకు జాతీయ భావాల ప్రభావం ఉంది. భీమన్న ఎన్నో భావ గీతాలు వ్రాసాడు. కనుక అతని మత విశ్వాసాల గూర్చి పరిశోధించాల్సిందే. అస్పృశ్యతా నిర్మూలనకు తానుగా ప్రజలకే పరిష్కార మార్గము చూపిన దాఖలాలు అంతగా లేవు. వ్యక్తిగత జీవితంలో తాను బ్రాహ్మణ స్త్రీని వివాహమాడాడు. బహుశ సర్వులకూ అదే మారమని భావిస్తున్నాడేమో.

-అవంత్స సోమసుందర్

# బోయి భీమన్న గారితో ఇంటర్వ్యూ

శ్రీ బోయి భీమన్న గారిని హైదరాబాదులోని వాళ్ళింట్లో ఓ సాయంకాలం నందు కలసి వారి వ్యక్తిత్వానికి, వ్యక్తిగత జీవితానికి, సామాజిక జీవితానికి సంబంధించి నాకు గల సందేహాలను, కవికి – సమాజానికి గల సంబంధాల వట్ల వారికి గల అభిప్రాయాలను కోరగా వారిచ్చిన సమాధానాలను, అభిప్రాయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

1. మీరు.రూప(నాట)కాలు, నృత్య నాటికలు, గేయ నాటకాలు, ఈ విధంగా అనేకం వ్రాశారు కదా, వీటిని వ్రాయడంలో ఏదైనా ప్రత్యేక పథకం ఉందా?

జ.:- నేను ఎన్నో దృశ్య నాటక కావ్యాలు వ్రాశాను. అందులో పాలేరు, కూలిరాజు, పైరుపాట, రాగవాసిష్ఠం, ప్రగతి, చిత్రకళాప్రదర్శనం, బాలయోగి, ఆదికవి వాల్మీకి, అసూయ, పడిపోతున్న అడ్డుగోడలు, మానవుని మరొక మజిలీ మొదలగునవి చాలా చోట్ల ప్రదర్శించబడ్డాయి. నిజానికి ప్రదర్శనయే ప్రధాన లక్ష్యంగా పెట్టుకోలేదు. భారతీయ సంస్కృతికి మూలకర్తలు హరిజనులు (ఆది బ్రాహ్మణులు). ఈ సత్యాన్ని ప్రచారం చేయడం కోసం ఆయా పురాణ కథలను తీసుకొని కొన్న నాటకాలు, ప్రస్తుత సంఘటనలని సన్నివేశాలన్ని తీసుకుని నాటకాలు వ్రాశాను.

ముఖ్యంగా భారతీయ సంస్కృతికి మూలపురుషులు హరిజనులు అని తెలపడం, నాటక పాత్రలను ఈ బడుగువర్గాల నుంచి తీసుకున్నానే తప్ప ఆ పాత్రల చుట్టూ నేను అల్లినది సంపూర్ణ సాహిత్యమే – అంటే పాటలు, పద్యాలు, అందమైన వచనం.

2. రసాద్వైత మంటే ఏమిటో వివరిస్తారా ?

జః– నేను రసాద్వైత మంటే ఏమిటో చాలా చోట్ల వివరించియున్నాను. 'రాగవైశాఖి' పీఠికలో చూడండి. ప్రకృతి పురుష నిరంతర రమణమే సృష్టి. అదే నా రసాద్వైతం. స్త్రీ పురుషశక్తుల పరస్పర ఆకర్షణ పరస్పర భక్తి నైరంత్యర్యమే రసాద్వైతం.

3. మీరు అద్వైతంలో పుట్టి పెరిగారని చాలా చోట్ల చెప్పారు. అయితే అద్వైతానికి, రసాద్వైతానికి తేడా ఏమిటి ?

జః– ఆత్మ పరమాత్మ ఒకటే అనేది అద్వైతం పరమాత్మ సముద్రమైతే అందులోని అనంతకోటి జలబిందువులు ఆత్మలు. పరమాత్మ నుంచి ఆత్మ పుట్టి పెరిగి తిరిగి పరమాత్మలోనే లయించిపోతూవుంటుంది. ఈ ఆత్మ పరమాత్మ రూపం అని, వాటి నిరంతర రమణమే రసాద్వైతమని నా దర్శనం

4. రచయిత కావడం పూర్వజన్మ సుకృతం అని అంటారు. ఈ విషయంలో మీ ఉద్దేశం ?

జః– నా ఉద్దేశంలో పూర్వజన్మ అనేది లేదు. ఒక జన్మలో చేసిన పాపపుణ్యాలు

మరొక జన్మకి అంటి పెట్టుకొని వస్తాయి అనేది అబద్ధం, అసాధ్యం. ప్రతి ఆత్మ దాని బీజ శక్తిని బట్టి రక రకాలుగా వికసిస్తుంది. అందులో రచయిత కావడం ఒకటి.

5. కవి అనేవాడు ఒక పార్టీకి కాని, మతానికి గాని Commit అయి ఉండడం మంచిదంటారా, కాదంటారా ?

జ:– మంచిది కాదు పార్టీలు, మతాలు స్థిరమైనట్టివి కావు. అవి ఎప్పటికప్పుడు మార్చుకోడానికి వీలైనట్టివి. ఇక సాహిత్యము సర్వజనీనంగా ఉండాలి. మానవుని గుణశీలాలు ఆధారంగా చేసుకుని అతని చుట్టూ అల్లబడాలి. అందుకే రచయితకు Commitment ఉండకూడదంటాను. ఒక వేళ Commit అనే మాటకు విశాలమైన అర్థం చెప్పితే అది సౌజన్యానికి దగ్గరగా ఉండాలి.

6. నాటి–నేటి సాహిత్యంపై మీ అభిప్రాయం ?

జ:– ఎప్పుడో ఓసారి కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు ఒక సభలో మాట్లాడుతూ 'అప్పటి సరస్వతి వేరు – ఇప్పటి సరస్వతి వేరు' అన్నారు. అప్పుడు నేనన్నాను – ''సరస్వతి వేరు వేరు కాదండీ, అప్పుడూ ఇప్పుడూ సరస్వతి ఒకర్తే. అప్పుడ కంచిపట్టు చీరలు కట్టింది. ఇప్పుడ మిడ్డీలు కడుతున్నది'' అని.

సాహిత్యం నాడూ నేడూ ఒకటే. నాడు నిండుగ ప్రవహించేది. నేడు మున్సిపల్ కొళాయిలో నుంచి ఒక్కొక్కచుక్క, ఒకొక్క చుక్క వలె

పడుతున్నది. కవితా రచనలో నియమాలు పాటించక పోవడం వల్ల రస భావ సౌందర్యాలకు లోపం ఏర్పడింది.

7. ఈనాటి రచయితకు, వర్ధమాన కవులకు మీరిచ్చే సలహా ?

జ:- ఏమి లేదు. సలహాలు ఇవ్వడం, నీతులు చెప్పడం చాలా తేలిక. అది వన్-వే-ట్రాఫిక్. చెప్పేవాళ్ళే తప్పా విన్పించుకునే వాళ్ళుండరు. ''నేను పెళ్ళి చేసుకుని చాలా బాధలు పడుతున్నాను, నువ్వు చూస్తున్నవు కదా! నువ్వు పెళ్ళి చేసుకోవద్దురా, కొడకా! '' అంటే వాడు వింటాడా, ఆ బాధలేవో నేను కూడ పడి చూస్తానంటాడు. అన్ని విషయాలలోనూ ఇదే వాస్తవం. అయితే నేను ప్రత్యేకంగా చెప్పేదేమిటంటే -రచయిత అయినాడు, రచయిత కాదలచినవాడు ముందు మన ప్రాచీన సాహిత్యం చదవాలి. మన గతమేమిటో తెలసుకోవాలి. మనకు వారసత్వంగా వచ్చిన ఆస్తి ఏమిటో గుర్తించాలి. అప్పుడు ఆ పునాదిపై నిలబడి తాను చేయగల్గిన నిర్మాణానికి నూతన సృష్టికి పూనుకోవాలి. పునాదిని వదిలేస్తే మనం ఏంచేసిన అది 'నేల విడిచిన సామే' అవుతుంది. తనకు తృప్తి ఇవ్వదు, ఇతరులకు ఆనందమివ్వదు.

8. కవులలో దొంగ కవులుంటారా ?

జ:- దొంగ కవులు ఉంటారు. కవి నామకులూ ఉంటారు. దొంగ కవులంటె ఇతర కవుల రచనల నుంచి, జానపద సాహిత్యం నుంచీ దొంగలించి తమ సొంత కవిత్వంగా చెప్పుకునేవారు. ఇలాంటి వాళ్ళు పూర్వమూ

ఉన్నారు, ఇప్పుడూ ఉన్నారు. ఇక ఛందస్సు వచ్చి పద్యాలు వ్రాయగలిగిన వాళ్ళు చాలా మంది కవులుగా చలామణీ అవుతూ సన్మానాలు అందుకుంటున్నారు. అందుకు అనుకూలంగా సిదాంతాలు కూడా ఏర్పర్చుకున్నారు. కందము వ్రాసిన వాడే కవి అనే సిద్ధాంతం అందులో ఒకటి. అయితే ఇలాంటి వాళ్ళు బ్రతుకుదెరువు కోసం, సమాజంలో గౌరవం కోసం అన్ని రంగాలలో వలెనే సాహిత్య రంగంలో కూడా ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. మనం పట్టించుకోగూడదు. తాను వ్యక్తిగతంగా లోకానికి కొత్తగా చెప్పగలిగిందేమైనా ఉన్నదా, అని ఆలోచించుకుని ఉంటే చెప్పగల్గిన వాడే నిజమైన కవి.

9. జాతీయ ఉద్యమాలలో మీ పాత్ర ఏమైనా ఉన్నదా ?

జ:- చాలా ఉంది. నేను 1931 లో కళాశాలలో చేరినప్పటి నుంచి విద్యార్థిగా కాంగ్రెస్ వాలెంటీర్‌ను. నేటి వరకు కూడా కాంగ్రెస్ వాదినే. ఆ మధ్యలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీకి చెంది ఉండేవాడిని. ఆ పార్టీ నుంచి కమ్యూనిస్టులు విడిపోయిన తరువాత నేను కాంగ్రెస్‌లోనే ఉండిపోయాను. 1941-42 లో అగస్టు విప్లవము సమయంలో కాంగ్రెస్ అగ్రనాయకుల సలహాపై నేను ప్రత్యక్షంగా ఉద్యమంలో చేరకుండా మా యువకులం అండర్ గ్రౌండ్ వర్క్ చేశాం. అగ్రనాయకులు జైలు నుండి విడుదలై వచ్చినపుడు వారికి రాజకీయ రంగాన్ని చెక్కుచెదరకుండా అప్పగించింది. మేమే. నా పాలేరు, కూలిరాజా నాటకాలలో దేశభక్తి గీతాలు చాలా ఉన్నాయి. 'పాలేరు' నాటకంలో ప్రారంభ గేయమే -

చదవండి -

"బానిస తనమును – బాపుమురా
భరత భూమికి – భాగ్యము తేరా
సకల దేశముల – సర్వమానవుల
సామ్యము – సాధింపుమురా"–

10. మీరు అంటరాని కులంలో పుట్టారు కదా, నీ జీవిత ప్రగతిలో అంటరాని తనం మిమ్మల్ని ఏ విధంగా భాధించింది ?

జ:– అంటరానితనం నిషేధింపబడిన ఈ రోజుల్లోనే అది ఇంకా ఇంతగా బాధిస్తున్నది కదా! ఆ రోజుల్లో ఎందుకు బాధించదు, చాలానే బాధించింది. డా౹ అంబేద్కర్ జీవిత చరిత్రలోఆయన ఎన్ని బాధలు పడ్డాడని పేర్కొనబడిందో అన్ని భాధలు నేనూ పడ్డాను. నా సమకాలీనులైన హరిజన విద్యార్థులందరూ పడ్డారు. అయితే నా ప్రత్యేకత ఏమిటంటే నేనేదీ పట్టించుకోలేదు. అందుకు కారణం నేను చిన్నప్పుడే ప్రాచీన సాహిత్యం చాలావరకు చదవడం, అవగాహన చేసుకోవడం. అరుంధతీ నుంచి మతుంగ, ధర్మవ్యాధ, వ్యాస, వాల్మీకి మొదలైన పురాణ స్త్రీ పురుషులందరూ మావాళ్ళే అనే ధృడ విశ్వాసంతో నేను రచనలు సాగించడం వల్ల అంటరానతనాన్ని నేను లెక్కచేయలేదు,. అంతేకాకుండా నన్ను వివిధ దశలలో ప్రోత్సహిస్తూ వచ్చిన చిల్లరిగె యోగానందకని, కళావెంకట్రావ్, నిడుదవోలు వెంకట్రావ్ వంటి వాళ్ళందరూ గూడా బ్రాహ్మణులే కావడం మరొక కారణం. హిందూ సమాజం పట్ల అందుకే నేను ద్వేషం పెంచుకోలేదు.

## ఉపకరించిన గ్రంథాలు - పత్రికలు

అభ్యుదయ విమర్శ విశేష సంచిక : సంపాదకులు - తుమ్మల వెంకట్రామయ్య
ఆంధ్ర వాఙ్మయ చరిత్రము : డా॥ దివాకర్ల వేంకటావధాని
ఆంధ్రమహాభాగవతోపన్యాసములు : ఆంధ్ర సారస్వత పరిషత్తు; హైద్రాబాదు
ఆధునిక తెలుగు సాసిత్య విమర్శ-
సాంప్రదాయిక రీతి : డా॥ కోవెల సంపత్కుమాచాచార్య
ఆధునికాంధ్ర కవిత్వము
సంప్రదాయములు- ప్రయోగములు : డా॥ సి. నారయణ రెడ్డి
ఉపనిషత్ చింతన : ఏటుకూరి బలరామ మూర్తి
కన్యాశుల్క నాటక కళ : సర్దేశాయి తిరుమల రావు
కావ్యాలంకార సంగ్రహము : సన్నిదానం సూర్యనారాయణ శాస్త్రి
గాంధేయ మార్గం - తాత్త్వికత : ఏటుకూరి బలరామమూర్తి
తిక్కన హరిహరనాథ తత్త్వము : డా॥ కేతవరపు వెంకట రామ కోటి శాస్త్రి
తెలుగు ఏకాంకికా వికాసము : డా॥ వనం మధుసూధన్
తెలుగు నాటకరంగం : గొల్లపూడి మారుతీరావు
తెలుగు నాటక సాహిత్యం : ఆంధ్ర సారస్వత పరిషత్తు; హైదరాబాదు
తెలుగు సాంఘిక నాటకం (మొ. భాగం) : డా॥ పి.వి. రమణ
తెలుగు సాహిత్య వికాసం : సంపాదకుడు డా. కె.కె. రంగనాథాచార్యులు
తెలుగు సంస్కృతి తరంగాలు : ప్రచురణ డైరెక్టర్ సమాచార పౌర సంబంధ శాక హైద్రాబాదు

| | | |
|---|---|---|
| దశ రూపక సారము | : | కూర్పరి : గడియారము రామకృష్ణ శర్మ |
| పరిశోధనా విధానం | : | ఎస్. జయప్రకాశ్ |
| పాలేరు నుంచి పద్మశ్రీ వరకు | | |
| బోయి భీమన్న | : | రచన : హైమవతి |
| పాపులర్ రచనలు చేయడం ఎలా? | : | యండమూరి వీరేంద్రనాథ్ |
| భాగవతి వైజయంతిక | : | సంపాదకుడు కరుణశ్రీ |
| బోయి భీమన్న సాహితీ | | |
| షష్టి పూర్తి సంచిక | : | సంపాదకులు గనుముల జ్ఞానేశ్వర్ |
| మన నవల–పరిశీలన | : | చైతన్య సాహితీ వరంగల్ |
| మంచుతెర (నాటకం) | : | ఆదివిష్ణు |
| మహాత్మ్యకుడు జిడ్డు కృష్ణమూర్తి | | |
| అవగాహన | : | జె. శ్రీ రఘుపతిరావు |
| యుగద్రష్ట(యువకవి శేషేంద్ర) | : | ఎడిటర్ ఆచార్య తిరుమల |
| రచయితా – శిల్పమూ | : | రచనా ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ అనువాదం: తుమ్మల వెంకటరామయ్య |
| కులమేది ? | : | యలమంచి వెంకటప్పయ్య |
| గుడిసెలు కాలిపోతున్నై | : | బోయి భీమన్న |
| రాగవైశాఖి | : | ,, |
| దీపసభ | : | ,, |
| రాయప్రోలు రచనల పరిశీలన | | |
| తత్త్వ వివేచన | : | డా॥ ఎం. లావణ్య సరస్వతి |
| రాయప్రోలు సౌందర్య దర్శనం | : | డా॥ కె యాదగిరి |

వ్యాసాంజలి : తక్కళ్ళ బాలరాజు

విజ్ఞానఖని అరిస్టాటిల్
జీవితం తాత్త్వికత : శ్రీ విరించి

విశ్వనాథ వారి
నాటకములు - ఒక పరిశీలన : శ్రీమతి ఆర్. కమల

శ్రీనాథ కవితా వైజయంతి : సంపాదకుడు డా॥ పి. సుమతీ నరేంద్ర

సాహితీ వసంతం : డా. పేర్వారం జగన్నాథం

సాహిత్య తత్త్వం : డా. ఆర్వీయార్

సాహిత్యావలోకనం : డా॥ పేర్వారం జగన్నాథం

సాహిత్య శిల్ప సమీక్ష : పింగళి లక్ష్మీకాంతం

సాహిత్యోపనిషత్ : టి.యల్. కాంతారావు

స్వాప్నికుడు, ఆదర్శవాది ప్లేటో
జీవితం తాత్త్వికత : శ్రీ విరించి

గ్రీక్ తత్త్వవేత్త సోక్రటీస్ జీవితం-
తాత్త్వికత : శ్రీవిరించి

## పత్రికలు :

అభ్యుదయ మాసపత్రిక : జనవరి, మార్చి నుండి జూన్,
అగస్టు, 1992

ఆంధ్రజ్యోతి ( దినపత్రిక) : తేది 13.1.92 మరియు 14.1.92

ఆంధ్రప్రదేశ్ (మాసపత్రిక) : మే, 1993 సంచిక

| | | |
|---|---|---|
| ఆంధ్రప్రభ ( దినపత్రిక) | : | 19.4.93, 20.9.93, 31.5.93, 21.6.93 |
| ఆంధ్రభూమి( దిన పత్రిక) | : | 8.10.93 |
| ఉదయం | : | 12.9.91 మరియు 28.10.91 |
| మిసిమి (మాసపత్రిక) | : | జనవరి, సెప్టెంబర్, 92; ఏప్రిల్ 93 నుండి అగస్టు 93 వరకు |
| వరంగల్ వాణి ( దినపత్రిక) | : | 10.7-92 |
| భారతదేశంలో కులం | : | కమ్యూనిజం మాసపత్రిక ప్రత్యేక సంచిక జనవరి, 1994 (తృతీయ ముద్రణ) |
| స్రవంతి(సాహిత్య మాస పత్రిక) | : | జూలై, 1986 |

## సంస్కృతం :

| | | |
|---|---|---|
| అభిజ్ఞాన శాకుంతలం | : | కాళిదాసు |
| మేఘ సందేశం | : | కాళిదాసు |
| రఘువంశం | : | కాళిదాసు |
| శ్రీమద్భగవద్గీత | : | శ్రీ నిర్వికల్పానంద స్వామి |

## ఇంగ్లీషు :

| | | |
|---|---|---|
| Arms and the man | : | Bernard Shaw |
| One act play of today (2nd series) | : | Selected by J.W. Marriot |

| | | |
|---|---|---|
| One act play of today (2nd series) | : | Selected by J.W. Marriot |
| One act play of today (6th Series) | : | ..........do.......... |
| One act play for B.A. Students | : | Edited by M.L. Raina |
| Select one act play | : | Edited by B.N. Joshi |
| The Caste System | : | Rammanohan Lohia |
| A.P. State & Subordinate Service Rules - Edition 1989-90 | : | LD. Gogia M/s. Asia Law House |

ఆచార్య పేర్వారం జగన్నాథం
మాజీ వైస్ ఛాన్సలర్
తెలుగు విశ్వవిద్యాలయం

ఫోన్ :78392
1-8-120,
మిథిలానగర్, బాలసముద్రం,
హనుమకొండ - వరంగల్లు

తేది 27-3-1996

# ఆత్మీయం

డా॥ తక్కళ్ళ బాలరాజు నాకు చిరకాల మిత్రుడు. ఉత్సాహవంతుడు. గట్టి పట్టుదల కలవాడు. వినయశీలి. అంతేకాక ఆయన కవి, నాటక కర్త, నాటక ప్రయోక్త. ఇప్పుడీ సిద్ధాంత గ్రంథం ద్వార ఆయన ఒక మంచి పరిశోధకుడుగా కూడా సాహిత్య రంగంలో ప్రవేశిస్తున్నాడు. బాలరాజు ఉద్యోగిస్తున్నది వరంగల్లు జిల్లా కోశాగార కార్యాలయంలో. ఉద్యోగ సంబంధమైన నియంత్రణ ఆయన సాహిత్య వ్యాసంగాన్ని అడ్డుకోలేక పోయింది. సాహిత్య వ్యాసంగం తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించకుండ నిరోధించలేకపోయింది. ఈ రెండింటిని ఆయన సవ్య సాచిలా దక్షతతో నిర్వహిస్తున్నాడు. సాహితీ ప్రియులకు మంచి విందును చేకూరుస్తున్నాడు.

డా॥ బాలరాజు ఇంతకు ముందే పలు కవితా సంపుటాల్ని ప్రచురించినాడు. నాటకాలను వెలువరించినాడు. వరంగల్లులో జరిగే పలు కవిసమ్మేళనాలలో పాల్గొని కావ్యానందాన్ని పంచి పెడుతుంటాడు. పలు సందర్భాల్లో తన నాటకాల్ని ప్రదర్శింపజేసి ప్రజల్ని రంజింపజేస్తుంటాడు. సాహిత్య సాంస్కృతిక సంస్థలతో సంబంధాలు పెంచుకొని పలు కార్యక్రమాలు నిర్వర్తిస్తుంటాడు. తను చేస్తున్న ఉద్యోగం సాహిత్యేతర రంగానికి చెందినదైనా పట్టుబట్టి తెలుగులో ఎం.ఏ., పూర్తి చేసి వెనువెంటనే పరిశోధనకు పూనుకున్నాడు. పరిశోధనకు, తనకు అభిరుచిగల రంగాన్నే ఎన్నుకున్నాడు. ''బోయి భీమన్న రూపకాలు తాత్త్విక చింతన'' అను అంశంపై బాగా కష్టపడి పరిశోధన సాగించినాడు. వాటిని శాస్త్రీయంగా వింగడించి

వాటిలో నిగూఢంగా ఉన్న అంతస్తత్వాన్ని వెల్లడించినాడు. ఇటీవల కాకతీయ విశ్వవిద్యాలయం నుండి డాక్టరేటు పట్టాను పొందినాడు. నాపై అభిమానం కొద్దీ, విషయంపై నున్న ఆసక్తి కొద్దీ నా సూచనలను పాటిస్తూ పరిశోధన పూర్తి చేసినాడు. ఈ సందర్భాల్లో నా హార్దిక అభినందనలు.

పద్మశ్రీ డా॥ బోయి భీమన్న గారి గురించి వేరే తెలుపవలసిన పని లేదు. ఆధునిక తెలుగు సాహిత్య రంగంలో వారికి ఒక ప్రత్యేక స్థానమున్నది. విశిష్టమైన సాహిత్య వ్యక్తిత్వమున్నది . భీమన్న పలు సాహిత్య ప్రక్రియల్లో పెక్కు రచనలు చేసినాడు. తాను విశ్వసించిన సిద్ధాంతాల్ని నిర్భయంగా వెల్లడించగల్గిన ధీమా భీమన్నకున్నది. ఆయన కొన్ని సాహిత్య, సామాజిక పరమైన సిద్ధాంతాల్ని తన రచనల్లో ప్రతిపాదించినాడు. వారి నాటకాల్లోను ఈ ముద్ర కనిపిస్తున్నది. భీమన్న గారి సిద్ధాంతాలూ, విశ్వాసాల వెనుక ఉన్న తాత్త్వికతను బాలరాజు చక్కగా అనుశీలించినాడు. అన్వయించినాడు. ఆ అంశానికి న్యాయం చేకూర్చినాడు.

డా॥ బాలరాజు ఇంకా మునుముందు ప్రగతి పథంలో సాగుతూ, ఉన్నత శిఖరాలను అందుకోవాలని ఆకాంక్షిస్తున్నాను –

– పేర్వారం జగన్నాథం

# మా మనవి

వరంగల్ నగరంలో చైతన్య సాహితి కవులను, కళాకారులను ప్రోత్సహిస్తున్నది. 18 సం.లనుండి మా సంస్థ సాహిత్య సాంస్కృతిక సేవలు అందిస్తున్నధి. ఎందరో ప్రముఖ కవులను కళాకార లను తీర్చిదిద్దిన సంస్థగా, సేవా నిరతి కల్గిన కార్యకర్తలకు, స్వచ్ఛంద సాహితి సంస్థలకు ఆదర్శంగా నిలిచిందని సగర్వంగా చెప్పుకొనుచున్నాము.

మా సంస్థ నుండి 9 పుస్తకాలు ప్రచురించాము. ఇది 10వ పుస్తకం. డా॥ బాలరాజు గారు దీని రచయిత. వీరు కవితలు, వ్యాసాలు, నాటికలు, పద్యాలు మొదలగునవి రచించి ప్రచురించినారు. డా॥ బాలరాజు గారి 12వ రచన అయిన ''బోయి భీమన్న రూపకాలు తాత్త్విక చింతన'' వ్యాస గ్రంథం ఈ సంస్థ ద్వారా రావడం మాకెంతో ఆనందంగా ఉంది. శ్రీ టి. మధుసూధన్ (మధు) గారు దీనికి ముఖ చిత్ర రచన చేశాడు. వారికి కృతజ్ఞతలు. మరియు ఎందరో కళా హృదయులు మాతో సంహకరించారు. వారికి కృతజ్ఞతాభివందనాలు. మా కృషిని ప్రోత్సహిస్తారని తెలుగు సాహితి ప్రియులందరికి మా మనవి.

–చైతన్య సాహితి

# అంకితం

అన్నయ్య-వదినల అనురాగస్మృతికి



కీ॥ శే॥ తక్కళ్ళ రాజయ్య - శ్రీమతి తక్కళ్ళ లక్ష్మి

పుణ్య దంపతులకు

డా. [illegible] బాలరాజు
M.A., Ph.D.,
ఇ.నెం. 3-14-133-1/ఎ,
సుభాష్ నగర్ కె.యు.సి. రోడ్,
కొత్తూరు, హన్మకొండ,
వరంగల్ - 506 001.

**జననం** : 17-11-1949
విద్యార్థి దశ నుండి తెలుగు, హిందీ రచనా వ్యాస రంగం చేపట్టారు.

**ప్రచురణలు** : వెలుగు రేఖలు(గేయ సంపుటి) స్వాతంత్ర్య పిపాసి (ఏక పాత్రలు) నవ తరానికి నాంది (నాటిక) మరో ప్రొద్దు పొడుపు (నాటిక) చైతన్య పథంలో (నాటిక) వ్యాసాంజలి (వ్యాస సంపుటి) అరుణ కిరణ్ (హిందీ కవితలు) క్లరికల్ గైడ్ (నమోనా ఉత్తరాలు) బెష్పషల్ జి.ఓస్ (జి.ఓస్ సంపుటి) పాటల పందిరి (టి.వి. రేడియో పాటలు) రంగుల తెర (రేడియో హాస్య నాటికలు) బోయి భీమన్న రూపకాలు - తాత్త్విక చింతన (పరిశోధన వ్యాస గ్రంథం)

**పాటల క్యాసెట్స్** : దేశ భక్తి గీతాలు, వయోజన విద్య గీతాలు (డి. సారంగపాణి బృందం పాడినవి) వినాయక భక్తి గీతాలు (డా. పత్రి కుమారస్వామి & బృందం పాడినవి)

**రాబోవు రచనలు** : న్యూ ఆఫిషయల్ డిక్షనరీ (ఇంగ్లీష్-తెలుగు-ఇంగ్లీష్) కథల సంపుటి, హిందీ గేయ సంపుటి, ఇంగ్లీష్ గ్రామర్ హ్యాండ్ బుక్, దూర దర్శన్ రూపకాలు

**అభిరుచి** : సాహిత్య సాంస్కృతిక సేవకు సంబంధించిన కార్యక్రమాల యందు పాల్గొనడం, సెమినార్లలో సాహిత్య సభలలో ప్రసంగించడం

**పదవులు** : ప్రధాన కార్యదర్శి చైతన్య సాహితి వరంగల్, వివిధ సాహిత్య సంస్థలలో సభ్యత్వం

**వృత్తిరీత్యా** : జిల్లా ట్రెజరి కార్యాలయంలో సీనియర్ ఆడిటర్‌గా ఉన్నారు

Chaitanya Sahiti, Hanamkonda - Warangal. Rs. 100/-